శ్రీః

# వల్లవీపల్లవోల్లాసము.

శ్రీ మాడభూషి నరసింహాచార్యకృతము



**పైడి ముడుపు : శ్రీ ఉన్నం జ్యోతివాసు**


ప్రకాశకులు

**రావికృష్ణకుమారి మోహనరావు దంపతులు**

చీరాల

శ్రీః

# వల్లవీపల్లవోల్లాసము

శ్రీ మాడభూషి నరసింహాచార్యకృతము

**పైడి ముడుపు :** శ్రీ ఉన్నం జ్యోతివాసు

ముద్రణ : ***17-02-2015***

ప్రతులు : ***300***

పేజీలు : ***136***

వెల రూ. : ***50-00***

©

**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**SOWMYA PRINTERS**
**CHIRALA.**

# సముదాగమము

శ్రీమద్భాగవతము – దశమస్కంధం – ఉత్తరార్ధము 58వ అధ్యాయమున 31 నుండి 55 శ్లోకముల వరకు వర్ణింపబడిన 'నాగ్నజితి – శ్రీకృష్ణుల' వివాహమాధారంగా శ్రీ మాడభూషివారు 'వల్లవీపల్లవోల్లాసము' అను పేర కడు మృదుమధురంగా రూపొందించిన ఇక్కావ్యమునకు శ్రీ ఉన్నం జ్యోతివాసుగారు 'పైడి ముడుపు' అను సుదీర్ఘ పీఠికను అమర్చగా, మీదు చక్కగా రూపొందుటకు అన్నివిధముల తోడ్పడిన డా॥ వుయ్యూరువారున్ను కడు ధన్యులు.

సర్వసమృద్ధిగా వెలువడుతున్న 'వల్లవీపల్లవోల్లాసము' పై శ్రీమతి గోగినేని యోగప్రభావతీదేవి గారి ఆధ్వర్యమున శ్రీమతి అన్నం మాధవీలత గారు సిద్ధాన్తవ్యాసమును 'ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం' వారికి సమర్పించుట మిక్కిలి హర్షణీయము. అద్దానిని పరిశీలించగలరు.

**పైడి ముడుపుతో పఠితృలోకము పరవశించుగాక!**

**రామోరా.**

సంపాదకుడు

శ్రీః

# ప్రశంసాపంచరత్నాలు

తే॥గీ॥ దేవభాషాకృతులె గాక తెలుఁగుకృతులు
సైత మచ్చున వెలయించి సన్నుతగతి
బుధుల కందించు శ్రీరావి మోహనుండు
ధరణిజనులందు నేఁ డహొ! ధన్యతముఁడు. 1

తే॥గీ॥ విపులపీఠికావ్యాసాల విస్తరిల్లఁ
గృతుల నాసక్తితోడఁ బరిష్కరించి
తెలుఁగుజాతికి నందించు ధీయుతుండు
జ్యోతివాసుండు సాహితీజ్యోతి సుమ్ము! 2

తే॥గీ॥ వీరిమేలికలయికలో వెలుఁగుచూచె
వల్లవీపల్లవోల్లాసభద్రకృతియు
మరలఁ బాఠకలోకసమ్మదముకొఱకు
సరససాహిత్యసంచారసరణికొఱకు 3

క॥ ఈరీతిగనే సుకృతుల్
వీరివలన వెలుఁగుచూచి విబుధానంద
శ్రీరమ్యపథాన నిలిచి
కూరుచుఁ గాక! సుయశమ్ము క్రొంగ్రొత్తవిధిన్. 4

ఉ॥ వాసిగ నాంధ్రకావ్యములు వచ్చిన నచ్చునఁ బాఠకోత్తముల్
భాసురపుష్పమాలికలపై భ్రమరావళివోలె మూగి వా
గ్వాసన లాని మోదిలుట స్వచ్ఛవిధానము నేఁటికాలమం;
దీసిసలైనసత్యము గ్రహింపుఁడు పాఠకులార! సన్మతిన్. 5

ది. 15-1-2015
(జయ-మకరసంక్రమణము)

వుయ్యూరు లక్ష్మీనరసింహారావు
చరవాణి : 9573884352

# పైడి ముడుపు

– ఉన్నం జ్యోతివాసు వేములపాడు.

**అనర్ఘమపి మాణిక్యం హేమాశ్రయమపేక్షతే ।**
**నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః ॥**

విలువైన మాణిక్యము కూడ బంగారములో పొదిగితేనే రాణిస్తుంది. అలాగే ఆశ్రయం లేకపోతే పండితులు, స్త్రీలు, లతలు శోభించవని అభిజ్ఞులు చెబుతారు. ప్రాచీన చక్రవర్తులు, సార్వభౌములు, వారి సామంతులు, శ్రీమంతులు మొదలగు వారి ఆశ్రయం కారణంగా సాహిత్యవృక్షము శాఖోపశాఖలుగా విస్తరించింది. కావ్యపుష్ప సౌరభాలను దిగంతాలకు వ్యాపింప జేసింది. మధ్య మధ్య అరాచకాల తుఫానులు వచ్చినా మరలా కొత్త చివుళ్లు వేసింది. స్వాదు ఫలాలను అందించింది.

పండువంటి విజయనగరసామ్రాజ్యం అంతరించిపోయింది. దాని నాశ్రయించి వర్ధిల్లిన సాహిత్యము చిన్నచిన్న సంస్థానాలను చేరింది. ఆ చిన్న చిన్న పాలకులు తమకు చిక్కిన ముక్కలను కాపాడుకోవడముతోనే వారి జీవితాలు ముగిసిపోయేవి. ఏ కొద్దిమందో సాహిత్యానికి ఆలంబనగా నిలిచారు. వారి ఆశ్రయంలో సాహిత్యదీపము మినుకు మినుకు మంటూ గుడ్డిగా వెలిగింది. విమర్శకులీయుగాన్ని క్షీణయుగమని పిలిచారు.

క్షీణయుగంలో పుట్టిన సాహిత్యమంతా కాలపరీక్షకు నిలబడకపోవచ్చును. కాని సాహిత్యాన్ని ప్రోత్సహించి నిలబెట్టినందుకు అప్పటి సంస్థానాల పాలకులు అభినందనీయులు. అంతకు ముందు యుగాలలో కూడ ఎంతో సాహిత్యం వచ్చింది. అందులోను కాలపరీక్షకు నిలబడి బ్రతికి బట్టకట్టిన రచనలు కొన్ని మాత్రమే. క్షీణ యుగంలో అది ఇంకాస్త తగ్గింది.

క్షీణ యుగంలో పాండిత్యము పెరిగింది. కవిత్వము తగ్గింది. రసనిర్భరమైన కవితారీతుల కన్నా సమస్యాపూరణలు, అవధానాలు, ఆశుకవితలు పాలకులను ఆకర్షించాయి. కవులలో కళాదృష్టి తగ్గింది. శాస్త్రదృష్టి పెరిగింది. అందువలన చిత్ర, బంధ, గర్భకవిత్వాలు, అనేకార్థకావ్యాలు, ఆశుకవితలు ప్రబలమయ్యాయి. సమస్యాపూరణలు చమత్కార చారువులైనా అవి తటిల్లతల వలె మెరిసే మెరుపులే కాని శాశ్వతమైన రసప్రసారాలు కావు.

శాస్త్ర పాండిత్యము కవిత్వములో దిగడం వలన పాండిత్య ప్రాగల్భ్యము పెరిగింది. అందువలన సాహిత్యవృక్షము నిరోష్ఠ్య, నిరూష్మ, అపంచవర్గీయ, నిర్గద్య, శుద్ధాంధ్ర రచనలు,

ద్వ్యర్థి, త్ర్యర్థి వంటి అనేకార్థ కావ్యాలను కాచింది. రుచీ పచీ లేని ఈ వ్యర్థమైన పంటలు ఏ రసజ్ఞుడినీ ఆకట్టుకోలేక పోయాయి. కారణము ఆంతరదృష్టి చెదిరి, బాహ్యదృష్టి ముదరడమే. ఫలితంగా జీవములేని నీరస రచనలు చాలా పుట్టాయి. అందును కొందరు ప్రౌఢకవుల ప్రబంధాలు నారికేళ పాకంలో పడ్డాయి. కొన్నింట్లో ఈ పాకము ముదిరి రాక్షస నారికేళ పాకమయింది. వీటిలో శబ్దాడంబరము తప్ప రసానందము శూన్యము.

సర్వమధురము (ములుగు పాపయారాధ్యులు), శ్రీకృష్ణాభ్యుదయము (మండపాక పార్వతీశ్వర శాస్త్రి), అచ్చతెనుగు భాగవతము (అల్లంరాజు రామకృష్ణకవి) మొదలగునవి క్షీణయుగంలోని చక్కని అచ్చతెనుగు కృతులు. కృష్ణార్జున చరిత్ర (మంత్రిప్రెగ్గడ సూర్య ప్రకాశము), అచలాత్మజా పరిణయము (కిరీటి వేంకటాచార్యులు), లంకావిజయము (పిండిప్రోలు లక్ష్మణకవి), రామకృష్ణార్జున రూపనారాణీయము (ఓరుగంటి సోమశేఖరం), యాదవభారతీయము (చెన్న కృష్ణకవి), సారంగధరీయము (పోకూరి కాశీపతి), వసుస్వారోచిషోపాఖ్యానము (కొత్తపల్లి సుందర రామకవి) మొదలగునవి ఈ యుగంలోని అనేకార్థ కావ్యాలు. అభినవ భారతము (మతుకుపల్లి మాదయ్య), కవిజనరంజనము (అడిదము సూరకవి), కూచిమంచి కవుల కృతులు మొదలగునవి ప్రౌఢ ప్రబంధాలు. వీటిపై వసుచరిత్ర ప్రభావమెక్కువ. క్షీణయుగంలో ప్రతికవీ ఒక పిల్లవసుచరిత్రను వ్రాయడానికి ప్రయత్నించినవాడే. అందుకు భిన్నంగా పిల్లమనుచరిత్రను వ్రాసిన కవి మాడభూషి నరసింహాచార్యులు.

**కవిచరిత్ర :** మాడభూషి వారిది పండిత వంశము. వీరు శ్రీవైష్ణవులు. ఈ వంశానికి మూలపురుషుడు వేంకటాచార్యులు. ఈయన ఎనిమిది భాషలలో పండితుడు. పురాణాలు, శాస్త్రాలు బాగా చదువుకొన్నాడు. ప్రతివాద భయంకరుడని ప్రసిద్ధికెక్కాడు. మహారాజులు ఆయనకు పాదపూజలు చేసేవారు. ఆయన రచనలేవీ తెలియనప్పటికి 17, 18 శతాబ్దాలలో ఆయనదొక అదృశ్యమైన అద్భుత అధ్యాయము. వేంకటాచార్యులకు తొమ్మిది మంది కొడుకులు. వారిలో శ్రీనివాసాచార్యులు మహాపండితుడు. అతనికి ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుక్కి తన తండ్రి వేంకటాచార్యుల పేరే పెట్టుకొన్నాడు. ఈ వేంకటాచార్యులకు 5గురు కొడుకులు. వారిలో వేదాంతదేశికులు కుశాగ్రబుద్ధి. ఎనిమిది భాషలలో పండితుడయ్యాడు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, న్యాయాలు, ధర్మాలు క్షుణ్ణంగా చదువుకొన్నాడు. ఇంగ్లీషు నేర్చుకొన్నాడు. సర్వతంత్ర స్వతంత్రుడయ్యాడు. మహారాజ సభలలో విద్వద్గజమని, యవన రాజుల సభలలో పండిత రాజని, ఇంగ్లీషు ప్రభువుల కోర్టులో సదరమీనని, బ్రాహ్మణ సభలలో బృహస్పతియని కొనియాడబడిన శేముషీ విభవుడు.

ఈ వేదాంత దేశికాచార్యుల కొడుకే ప్రస్తుత మన గ్రంథకర్త మాడభూషి నరసింహాచార్యులుగారు. అందరూ ఆయనను నరసింహదేశికులని పిలిచేవారు. ఆయన 1799లో పుట్టాడు. తండ్రి వద్ద, గురువుల వద్ద అన్ని విద్యలూ అభ్యసించాడు. వేదమయుడైన వైనతేయుని (కాంతస్య పురుషోత్తమస్య ఫణిపతి శయ్యాసనం వాహనం వేదాత్మా విహగేశ్వరో – అనుటవలన గరుత్మంతుడు వేదరూపుడు) కటాక్షంవలన సంగీత సాహిత్యాలలో ప్రౌఢుడయ్యాడు. వసుచరిత్ర పద్యాలను వీణపై శ్రావ్యంగా ఆలపించేవాడు. ఆ కాలంలో వసుచరిత్ర పద్యాలను వీణపై ఆలపించడం కూడ ఒక విద్యే. పండిత సభలలో ఆ పద్యాలపైనే గోష్ఠులు, పరీక్షలు జరిగేవి. అతని సమకాలికుడు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి (1790–1870) వసుచరిత్ర పద్యాలకు రాగనిర్దేశము చేస్తూ బహువిషయ సమన్వితమైన చక్కని వ్యాఖ్య వ్రాశాడు. మొన్నమొన్నటి వరకు దీని వ్రాతప్రతి విశాఖలోని పరవస్తు వారి గ్రంథాలయములో ఉండేదని చెప్పుకొనేవారు. ఇప్పుడదేమయిందో!

నరసింహాచార్యులు వివాద రహితుడు. విష్ణుసేవలో తరించిన కులశేఖర ఆళ్వారులు, పరాంకుశ భాష్యకారుల చరిత్రలను శ్రద్ధగా చదివేవాడు. సర్వతంత్ర స్వతంత్రులైన వేదాంత దేశికులు, రంగనాథ దేశికులు వ్రాసిన గ్రంథాలను ఆదరంగా చదివేవాడు. నిరంతరం వారి స్మరణలో మునిగి తేలేవాడు. ఆయనకు నూజివీడు సంస్థాన పాలకుడు శోభనాద్రి అప్పారావు (పాలనా కాలము 1830–1868) గారి ఆశ్రయం లభించింది. శోభనాద్రి అప్పారావు తనకన్నా ఏడెనిమిదేళ్ళు పెద్దవాడైన. నరసింహాచార్యుల పట్ల భక్తిప్రపత్తులతో మెలగేవాడు. తన తండ్రి చనిపోయేనాటికి అప్పారావు పసివాడు. సంస్థానాన్ని కోర్టు ఆఫ్ వార్డ్స్ వాళ్లు వశం చేసికొన్నారు. ఎంతో పోరాడి 1830లో ఎస్టేటును తన అధీనానికి తెచ్చుకొన్నాడు. కవులను, కళాకారులను ఆదరించాడు. ఆయన సంస్థానం సంగీత సాహిత్యాలకు కాణాచి అయింది. ఎప్పుడూ సాహిత్య గోష్ఠులు, శాస్త్ర చర్చలు. నరసింహాచార్యులను ఆదరంగా పిలిచి ఆయన చేత వల్లీపల్లవోల్లాస ప్రబంధము చెప్పించాడు. దానిని తమ ఇలవేల్పు, ఆగిరిపల్లెలో కొలువున్న శోభనాద్రి నృసింహస్వామికి అంకిత మిప్పించాడు. ఆ స్వామివారి మీద నరసింహాచార్యులచేత స్తోత్రాలు, దండకాలు, శతకాలు వ్రాయించాడు కాని అవన్నీ అలభ్యాలు.

సహజంగానే సరళ స్వభావుడైన కారణంగా, సాహిత్య వివాదాల రచ్చకు వెళ్లనందువలన నరసింహాచార్యుల గుఱించి అంతగా తెలియడం లేదు కాని అతని కొడుకు వేంకటాచార్యులు (1835–1897) మాత్రము సుప్రసిద్ధుడయ్యాడు. తాతల, తండ్రుల మేలిమి గుణాలన్నీ గుత్తకు పుచ్చుకొని పుట్టాడు. ఏకసంథాగ్రాహి. అసాధారణ ప్రతిభావంతుడు. అంతేకాదు – తర్కవ్యాకరణ మీమాంసా జ్యౌతిషశాస్త్ర కూలంకష మనీషా విశేషుడు. ప్రాకృత వైకృత శౌరసేనీ మాగధీ పైశాచీ ప్రముఖ భాషా వ్యాకరణ పరిజ్ఞాన

చణుడు. ఆంధ్ర గీర్వాణోభయ భాషా ప్రబంధ రచనా విచక్షణుడు. సమధిక సంగీత సాహిత్య సర్వస్వుడు. శతలేఖనీ పద్య సంధాన ధురంధరుడు. అష్ట ముఖాష్ట భాషా వ్యస్తాక్షరీ విద్యానవద్యుడు. ఏకకాల ప్రదర్శితాష్టవిధాష్టావధాన ప్రకారుడు. పఠనమాత్ర పరిగృహీత అనులోమ ప్రతిలోమాది బహువిచిత్ర ప్రకార పఠిత ఆంధ్ర గీర్వాణ వృత్త ప్రబంధుడు. అంతేకాదు, ఆరడుగుల అందగాడు. దానికి తోడు కమ్మని కంఠం. ఇన్ని విద్యలతో ఆంధ్రదేశాన్ని ఒక ఊపు ఊపాడు. 1875 ప్రాంతాలలో ఆంధ్రదేశము, దాని చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఎక్కడ చూసినా ఆయన పేరే వినిపించేది. అందుకు కారణము – 1872 ఫిబ్రవరి 21వ తేదీన నూజివీడు సంస్థానాధీశుడు రాజా నారయ్య అప్పారావు ఆగిరిపల్లెలో చేయించిన విద్వన్మహాసభలో వేంకటాచార్యులు చేసిన శతావధానము, ఆశు కవితాప్రదర్శన. ఆనాడు అది ఒక మహాద్భుతము.

ఆ సభకు నారయ్య అప్పారావు గారి సోదరులు, పిఠాపురం రాజా శ్రీ రావు వేంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరు (ఈయన సంస్కృతాంధ్రా లలో మహా పండితులు), నర్సరావుపేట జమీందారు శ్రీ రాజా మల్రాజు కొండలరావు బహద్దరు మొ॥ వారు తమ ఆస్థాన పండితులతో వచ్చారు. గంగాధర రామారావు వేంకటాచార్యులతో– 'మీ శతలేఖనీ పద్యప్రబంధ నిబంధన చమత్కారాన్ని చూడాలని ఉంది' –అన్నారు. వెంటనే వేంకటాచార్యులవారు ప్రారంభించారు. పృచ్ఛకులు కోరినట్లుగా సంస్కృతంలో 27 వృత్తాలు, తెలుగులో 20 వృత్తాలు, రెండు భాషలలో 4 కీర్తనలు మొత్తం 51 పూర్తయ్యాయి. అంతలో గంగాధర రామారావు లేచి – మీరిలా ఎన్నైనా చెప్పేటట్లున్నారు. మీ ద్విసంధాగ్రాహిత్వము పరీక్షిస్తానన్నాడు. ఒక పండితుడు లేచి ఒక సీసపద్యాన్ని చదివాడు. ఆచార్యులవారు దాన్ని పౌరాణిక ధోరణిలో చదవడమే కాక, అనులోమ ప్రతిలోమ విధంగా కూడ చెప్పారు. సభంతా నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయింది. అయినా గంగాధర రామారావు ఆగలేదు. ఆ సీసపద్య భావాన్ని ఒక వృత్తంలో సంస్కృతంలో చెప్పమన్నాడు. ఆచార్యులవారు ఆశువుగా చెప్పారు. వెంటనే గంగాధర రామారావుగారు అభూతోపమాలంకారములో ఒక తెలుగు వృత్తము చెప్పమన్నాడు. ఆచార్యులవారు తడుముకోకుండా ఆశువుగా చెప్పారు. సభంతా ఉత్కంఠభరితమయింది. కాలం తెలియలేదు. అన్నపానాదులు గుర్తు రాలేదు. ఆచార్యులవారు ఆశువుగా చెప్పిన ఆ శ్లోకాలలో, పద్యాలలో ఒక్క స్ఖాలిత్యము కూడ లేకపోవడం చూచి ఆనాటి సభ వేనోళ్ల కీర్తించింది. అప్పటికే రాత్రి బాగా పొద్దుపోయింది. ఆనాటి సభ ముగిసింది.

అభూతోపమాలంకారము చాలా అరుదైన అలంకారము. అలంకార గ్రంథాలలోను, కావ్యాలలోను అంతగా కన్పించదు. రామాయణంలో వాల్మీకి ప్రయోగించాడు. వాలి సుగ్రీవుల యుద్ధంలో సుగ్రీవుడిని గుర్తు పట్టడానికి రాముడు

లక్ష్మణునిచేత ఒక గజపుష్పాల తీగను తెంపించి అతని మెడలో వేయిస్తాడు. అపుడు సుగ్రీవుడిని వాల్మీకి ఇలా వర్ణించాడు.

**స తయా శుశుభే శ్రీమాన్ లతయా కంఠసక్తయా**
**విపరీత ఇవాకాశే సూర్యో నక్షత్రమాలయా**

*– కిష్కింధకాండ 12 సర్గ 41 శ్లో.*

మెడలో గజపుష్పలతను ధరించిన సుగ్రీవుడు ఆకాశంలో నక్షత్రమాలికచే చుట్టబడిన సూర్యునిలా ప్రకాశించాడని వాల్మీకి వర్ణించాడు. సూర్యుడు ఉన్నప్పుడు నక్షత్రాలు ఉండవు. కాని ఇక్కడ ఉన్నట్లుగా వర్ణింపబడింది. అందువలన ఇది అభూతోపమాలంకారమని పండితులు అన్నారు. దండి కావ్యాదర్శంలో దీనినింకొక విధంగా చెప్పాడు. ఈ అలంకారముపై పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఇటువంటి క్లిష్టమైన అలంకారములోనే రాజా నారయ్య అప్పారావు గారిని వర్ణించమని గంగాధర రామారావు గారు ఆచార్యులవారిని ఆదేశించారు. ఆచార్యులవారు తడుముకోకుండా ఇలా వర్ణించారు.

శా॥ **శ్రీమద్దానదయాదిసద్గుణవళీసీమాయమానుండు ప్రో**
**ద్దామస్థోమవిరాజమానుఁడు మహోద్యత్కీర్తివిభ్రాజితుం**
**డై మేలొందుచునుండు నారయమహేంద్రాఖండలుం డొప్పు లో**
**కామేయ ప్రభుతాఢ్యుఁడై పరిమళోద్యత్సత్సువర్ణోపమన్.**

– అంటూ నారయ్య అప్పారావు గారు సువాసనగల బంగారమని అభూతోపమాలంకారములో ఆశువుగా వర్ణించారు.

ఆ మర్నాటి సభలో ఆచార్యులవారు అష్టభాషావ్యస్తాక్షరి అన్న అవధాన ప్రక్రియను ప్రదర్శించారు. కారణాంతరాలవలన అప్పుడు అష్టభాషలలో ఇంగ్లీషు, హిందూస్థానీ, అరవము మాత్రమే ఇవ్వబడ్డాయి. అది అద్భుతంగా రక్తి కట్టింది. అప్పుడు గంగాధర రామారావు ప్రభువు – “వీరి సామర్థ్యాన్ని చూస్తే వీరు పండితరాయలకు అపరాకృతిగా కన్పిస్తున్నారు. కనుక ఇకనుండి వీరిని పండితరాయ వేంకటాచార్యులని పిలువవలసినది” – అని అభినవ పండితరాయ బిరుదాంకితుని గావించారు. అది వారికి సార్థకమయింది.

పండితరాయలు సామాన్యుడు కాదు.

**“వాచామాచార్యతాయాః**
**పదమనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః”**

అని గర్జించినవాడు. ఈ శ్లోకం చాలా పెద్దది. ఆసేతు హిమాచల పర్యంతము ఉన్న పండిత మండలిని ప్రశ్నిస్తున్నాను. వాక్పతి అనే పేరుకు ఈ భూలోకంలో నేను

తప్పు మరొకడున్నాడా? ఉన్నట్టయితే విశంకం వదంతు (సందేహం లేకుండా చెప్పండి) – అని గర్జించాడు. అయినా భట్టోజీ దీక్షితులు, అప్పయ దీక్షితులు ఎదుర్కొన్నారు. ఓడిపోయారు. అంతటి గొప్పవాడు పండితరాయలు. ఆయన గొప్ప ఏకసంథాగ్రాహి. ఒకసారి మొఘల్ పాదుషా వద్ద తన ప్రతిభ చూపి సన్మానం పొందాలనుకొన్నాడు. ఢిల్లీ వెళ్లాడు. ఊరిబయట కోనేటిలో సంధ్యాద్యనుష్ఠానాలు తీర్చుకొంటున్నాడు. అక్కడికి ఇద్దరు ముసల్మానులు వచ్చారు. వాళ్లెందుకో గొడవ పడ్డారు. ఆ గొడవ పాదుషా వద్దకు వెళ్లింది. విచారణలో పండితరాయలు సాక్షి అని తేలింది. అప్పుడు పండితరాయలు 'ఆ గొడవ అంతా పార్శీ భాషలో జరిగింది. నాకాభాష రాదు. విన్నది విన్నట్లుగా చెప్పమంటే చెబుతాను' అన్నాడు. పాదుషా అంగీకరించాడు. రాయలు పొల్లుపోకుండా అప్పగించాడు. అతని ధారణను పాదుషా నమ్మలేకపోయాడు. అతనికి పార్శీ భాష వచ్చనుకొన్నాడు. పరీక్షించాలనుకొన్నాడు. అరబ్బీ భాషలోని ఖురాను షరీఫు గ్రంథం తీసికొని అందులోని 4 పుటలు చదివాడు. రాయలు తూచాతప్పకుండా ఆ పేజీలు తిరిగి అప్పగించాడు. పాదుషా ఆనందానికి హద్దుల్లేక అతనిని తన ఆస్థానకవిని చేసికొన్నాడు.

ఇటువంటి ప్రతిభావిశేషాన్నే వేంకటాచార్యులు ప్రదర్శించారు. నూజివీడు జమీందార్లకు సంబంధించిన ఒకదావాలో ఈయన సాక్ష్యం చెప్పవలసివచ్చింది. న్యాయమూర్తితో తాను విన్నది విన్నట్లు చెబుతానని వంద పుటల వాఙ్మూల మిచ్చాడు. ఇన్ని సంగతులు తారీఖులతో సహా జ్ఞాపకం ఉండడం అసంభవం. నమ్మనన్నాడు న్యాయమూర్తి. అప్పుడాచార్యులవారు తమ వాఙ్మూలం యావత్తు తూచ తప్పకుండా అనులోమంగాను, విలోమంగాను అప్పగించారు. దాంతో న్యాయమూర్తి దిగ్భ్రాంతి చెందాడు. ఆ విచారణ నెల రోజులు జరిగింది. ప్రతిపక్షం వారు తనను అడిగిన ప్రశ్నలే అడుగుతూ అడ్డు ప్రశ్నలు వేస్తుంటే (క్రాస్ ఎగ్జామినేషన్) ఆచార్యులవారికి కోపం వచ్చి 'వాళ్లు ఆ ప్రశ్నలు తనను ఎప్పుడెప్పుడు అడిగారో, వాటికి తాను లోగడ ఏ జవాబులు చెప్పాడో అన్నీ తేదీలతో సహా చెప్పేటప్పటికి అందరూ ఆశ్చర్యపోయారు. ఆయన సాక్ష్యం వల్లనే నూజివీడు జమీందార్లకు న్యాయం జరిగిందని చెప్పుకొంటారు.

ఒకనాడు పనప్పాకం అనంతాచార్యులు పండిత మిత్రులతో ఉన్నప్పుడు ఆయన వద్దకు ఒక అరవ పండితుడు వచ్చాడు. తాను వ్రాసిన శ్లోకాలను చదివి అర్థస్వారస్యం వివరిస్తూ తన గొప్పలు చెప్పుకొంటున్నాడు. ఆయనకు అక్కడి పండితులెవ్వరూ ఆనలేదు. అక్కడ వేంకటాచార్యులు కూడ ఉన్నారు. పది శ్లోకాల తర్వాత ఆచార్యులవారు – 'ఈ శ్లోకాలు నేను చిన్నప్పుడు మా తండ్రిగారి వల్ల విన్నవే. పూర్వకవి ఎవరో వ్రాసిన ఈ శ్లోకాలు మా అనంతాచార్యులు ఎరుగడనే కదా! నీవిగా చెప్పుకొంటున్నావు. ఇది ధర్మమా!' అన్నారు. దాంతో ఆ పండితుడు తోక త్రొక్కిన త్రాచు అయ్యాడు. 'ఏదీ. ఆ శ్లోకాలు నీకు

వస్తే చెప్పు చూద్దాము. వ్రాసిన వాడిని నన్నే ధిక్కరిస్తావా' – అని అరిచాడు. ఆ శ్లోకాలన్నిటిని ధారణ పట్టిన ఆచార్యులవారు పొల్లుపోకుండా అప్పజెప్పడంతో ఆ పండితుడు అవాక్కయ్యాడు.

శతావధానాన్ని ప్రచారములోనికి తెచ్చింది వేంకటాచార్యులుగారే. గంటకు వందలకొద్దీ పద్యాలు చెప్పడమే కాకుండా ఏకసంథాగ్రహణముతో వేలకొద్దీ పద్యాలు అప్పగించు బుద్ధిమత్తరులు వారు. ఆయన ఆశీస్సులతో తిరుమల బుక్కపట్టణము రాఘవాచార్యులు, దేవులపల్లి సోదర కవులు మొదలైనవారు అవధానాలు ప్రారంభించారు. తిరుపతి వేంకటకవులు దానికి వ్యాప్తి తెచ్చారు. అవధానాలు, ఆశుకవితలతోనే కాలక్షేపం చేయకుండా ఆచార్యులవారు మంచి రచనలు కూడా చేశారు. అవి–

1. భరతాభ్యుదయ ప్రబంధము (1885), 2. వామన నాటకము, 3. మదనమోహన చరిత్ర (వచన కావ్యము), 4. రామావధూటి తారావళి, 5. హంస సందేశము, 6. పుష్పబాణ విలాసము (ఇది రాజాజ్ఞచే ఆశువుగా చెప్పిన ఆంధ్రీకరణము), 7. ఆనంద గజపతీంద్ర శతకము, 8. బృహద్వైద్య రత్నాకరము. 9. ప్రభానాటకము (ఇది అశ్వఘోషుని చరిత్ర) వీటిలో దాదాపు అన్నీ అచ్చుయ్యాయి కాని ఇప్పుడు లభించడంలేదు.

భరతాభ్యుదయము – భారతంలోని శకుంతల కథకు సొగసులద్దుతూ వ్రాయబడిన నాలుగాశ్వాసాల ప్రౌఢశృంగారప్రబంధము. అప్పట్లో మద్రాసు విశ్వవిద్యాలయములో పట్ట పరీక్షలకు పఠనీయ గ్రంథముగా ఉండేది. పండిత వాదాలలో, చర్చలలో ప్రామాణిక గ్రంథంగా గుర్తింపబడింది. భరతాభ్యుదయంలో ఒకచోట ఆచార్యులవారు 'అక్షిభ్రువ' – అన్న ప్రౌఢ ప్రయోగమొకటి చేసారు. అది చూచి ఆయన సమకాలిక కవి ఒకరు 'చక్షుర్భువ' – అని ప్రయోగించాడు. ఒక పండిత సభలో – చక్షుః భూః – ఈ రెండు కలిపితే అకారాంతమెలా అయిందని అడిగారు. అందుకా కవి ఆచార్యులవారి 'అక్షిభ్రువ' – ప్రయోగం చూపించాడట. అప్పుడు వాళ్లు – ఆచార్యులవారి ప్రయోగమును పాణినీయ సూత్రము 'అచతుర' – సమర్థిస్తుంది కాని నీ ప్రయోగాన్ని అంగీకరించదని, అక్షిని చక్షుః అని మారిస్తే ప్రాణం మీదికి వస్తుందని చెప్పారని 'కథలు గాథలు' లో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు వ్రాసారు.

అంతటి మేథావిపట్ల స్పర్థ వహించినవారు కూడ లేకపోలేదు. వారిలో అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి సుప్రసిద్ధుడు. ఇతడు గొప్ప పండితకవి. ఒకసారి ఆచార్యులవారు గంగాధరరామారావు గారి కొలువుకు వచ్చారు. ఆ సభలో సుబ్రహ్మణ్య కవి కూడ ఉన్నాడు. 'ఇఁక' అన్న పదముతో ప్రారంభించి రామారావుగారి కీర్తిని వర్ణించమని సుబ్రహ్మణ్యకవి

కోరాడు. అప్పుడాచార్యులవారు ఈ క్రింది పద్యం చెప్పారు.

**క. ఇఁక నెవ్వరికీర్తులు నీ, ప్రకట గుణుండైన రామరాయ క్ష్మాభృ
త్సుకృతి జనపోషకుని కీ, ర్తికి సరిగా రావు సుమ్ము పృథ్వీస్థలిలోన్.**

ఈ పద్యంలో తప్పుందని సుబ్రహ్మణ్యకవి ఆక్షేపించాడు. తానీ కింది పద్యం చెప్పాడు.

**క. ఇఁక విను నీ యశమునకు ద, లఁకి శశికృశుఁడయ్యును మఱలఁ బెరుగ వేర్వే
ల్లఁకియుఁ గొనెనొకొ తొలిమల కె,లఁకులను శ్రీరామరాయ! లలితశ్రేయా!**

ఇఁకలో అరసున్న ఉందని, అట్లే ప్రాసస్థానములో సబిందుక 'క'కార ప్రాస ఉండవలెనని సుబ్రహ్మణ్యకవి ఆక్షేపణ. అప్పుడు ఆచార్యులవారు గడుసుగా చెప్పిన సమాధానము ప్రసిద్ధమని 'కథలు–గాథలు'లో చెళ్లపిళ్ల వారు వ్రాసారు.

సుబ్రహ్మణ్యకవి అంతటితో ఆగలేదు. సభలో తన నోరు మూపించినందుకు ఉగ్రుడయ్యాడు. ఆచార్యులవారి మీద పాము పగ పెంచుకొన్నాడు. తొలితరం చారిత్రక పరిశోధకుడు గురజాడ శ్రీరామమూర్తిగారు స్థాపించిన రాజయోగి పత్రికలో ఆచార్యులవారి భరతాభ్యుదయము దోషభూయిష్ఠమని నిందించాడు. కణ్వాశ్రమంలో భరతునికి ఆచార్యులవారు విప్రాంగనలతో – జోజో నృపకుమార జోజో సుకుమార జోజో జయంత వసంత సుందరాకారా – అని జోలపాటలు పాడించారు. పద్య కావ్యంలో పదసాహిత్యమా – అని సుబ్రహ్మణ్యకవి ఆక్షేపించాడు. కాని సాహిత్యలోకము అతని నిందలను పట్టించుకోలేదు. పండిత సభలలో, వాదాలలో ప్రామాణిక గ్రంథంగా గుర్తించింది. కొక్కొండ వేంకట రత్నం పంతులు 'బంగారము భరతాభ్యుదయమ'ని తన బిల్వేశ్వరీయ ప్రబంధములో కొనియాడాడు.

కాణాదం పెద్దన సోమయాజి ముకుంద విలాసానికి నకలుగా సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయకావ్యం వ్రాసాడు. పెద్దనగారి పలుకుబడులు, పదబంధాలు, భావాలనే కాకుండా డజన్లకొద్ది పద్యాలు పద్యాలను ఎత్తుకొని సుబ్రహ్మణ్యకవి తన గ్రంథంలో ఇరికించుకొన్నాడు. ముకుంద విలాసానికి భద్రాపరిణయం కార్బన్‌కాపీ అయింది. విమర్శకులు దీన్ని గ్రంథ చౌర్యమన్నారు. ఆచార్యులవారు మౌనంగా నవ్వుకొన్నారు. సుబ్రహ్మణ్యకవి విమర్శల పాలయ్యాడు.

తన అమోఘమైన ప్రతిభాపాటవాలతో గంటకు నూర్లకొలది పద్యాలు చెప్పగలిగినవాడు, ఏకసంథాగ్రహణముతో వేలకొలది పద్యాలు అప్పగించ గలిగిన ధారణారాక్షసుడు, ఒకేసారి 8 భాషలలో వ్యస్తాక్షరిని నిర్వహించగలిగిన బుద్ధిమత్తరుడు,

నెలరోజులు తానిచ్చిన సాక్ష్యాన్ని మళ్లీ తూచా తప్పకుండా అనులోమంగాను, విలోమంగాను అప్పుజెప్పిన హ్యూమన్ కంప్యూటర్ అయిన ఆచార్యులవారికి సంతానం లేదు. అంత గొప్ప మేథకు వారసత్వం లేకపోవడం దురదృష్టము. వేదాంత నరసింహాచార్యులను దత్తత తీసికొన్నారు.

తన జీవితకాలంలో మాడభూషి నరసింహాచార్యులు కొడుకు కీర్తిప్రతిష్ఠలను కొంతవరకే చూశాడు. 1872లో కొడుకుచేసిన అద్భుత శతావధానాన్ని తాను కళ్లారా చూడలేకపోయాడు. కారణం 1858 నాటికే నరసింహాచార్యులు విష్ణుపద సాన్నిధ్యము చేరుకొన్నాడు.

**కవి – రచనలు :** నరసింహాచార్యులగుఱించి అంతగా తెలియక పోయినా ఆయన రచనలు కొన్ని తెలుస్తున్నాయి. ఆయన తొలి రచన రుక్మిణీకల్యాణము. ఇది లభించుటలేదు. అచ్చు పడిందో లేదో కూడా తెలియడం లేదు. తొలి రచనకు సాధారణమైన పేరే పెట్టినప్పటికి తరువాత రచనలకు విషయప్రధానమైన అందమైన పేర్లు పెట్టాడు. నాగ్నజితీ పరిణయాన్ని వల్లవీపల్లవోల్లాసమనే ప్రబంధంగా వ్రాశాడు. వల్లవి అంటే గోపిక. పల్లవుడు అంటే విటుడు. వల్లవీ పల్లవుడు అంటే గోపికాజారుడు – అని అర్థము. వల్లవీ పల్లవోల్లాసము అంటే గోపికాజారుడైన శ్రీకృష్ణుని ఉల్లాసము అని అర్థము. పల్లవ శబ్దమును గుఱించి కీ॥శే॥ వంతరాం రామకృష్ణారావు గారు కాళహస్తి మాహాత్మ్య టీకలో ఇలా వ్రాశారు. పల్లవ – విటుఁడను నర్థముగల పల్లవ శబ్దము నిఘంటువులందు గానరాదు. "పల్లవికుఁడు = కాముకుఁడు, విటుఁడు – వాచ" – సూ.ని. "పల్లవికః = (పల్లవః శృంగార రసోఽస్త్యస్యాస్మిన్ వా పల్లవ + ఠన్) కాముకః – ఇతి హేమచంద్రః" (శబ్దక). పై వివరణను బట్టి "పల్లవః అస్య అస్తి ఇతి పల్లవః" అని సాధింపనగును. పల్లవము = శృంగారరసము. ("పల్లవస్స్యాత్... శృంగారే" విశ్వ) పల్లవమితనికి గలదు – అని వ్యుత్పత్తి. "అర్శ ఆదిభ్యోచ్" (పాణి) అను సూత్రముచే 'అచ్' ప్రత్యయము పల్లవ + అచ్ = పల్లవః. ఇది ఆయన పాండిత్యప్రౌఢిమకు నికషోపలము.

గణేశుని కథను నీలాపనిందా నివారణము అన్న కావ్యంగా వ్రాశాడు. ఈ కథతో జాంబవతీ, సత్యభామల పెండ్లిండ్లు కూడ ముడిబడ్డాయి. కనుక నరసింహాచార్యులు అష్టమహిషులలో సగము మంది పెళ్లిళ్లు చేశాడు. కాని వల్లవీ కావ్యంలోనే నాగ్నజితి పెండ్లికి ముందు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవిందల పెళ్లిళ్లను ఒక్కొక్క పద్యంలో వర్ణించాడు. కావ్యాంతంలో భద్ర, లక్షణల కల్యాణము ఒక్కొక్క పద్యంలో ముగించి అష్టమహిషీ కల్యాణము చేశాడు.

నీలాపనిందా నివారణము కావ్యము అట్టమీద మాడభూషి నరసింహాచార్య

కృతమని ఉన్నప్పటికి అవతారికలో దేవులపల్లి సుబ్రహ్మణ్యకవి వ్రాశాడని తోపింప జేసే పద్యాలు ఉన్నాయి. కృతిభర్త చెలికాని వేంకట్రాయుడు తన నిండు సభలో - విఘ్ననాయకుని ఉదంతము వినాలని ఉంది. ఈ సభలో ఎవరికైనా తెలిస్తే చెప్పండి - అని అడిగాడు. అప్పుడు అతని సోదరుడు లచ్చారావు లేచి ఇలా అన్నాడు.

**ఉ. ఏ మును నూజివీటి పురికేఁగిన నాఁడిదె దానశూరతా**
**శ్రీమహనీయకీర్తిని ప్రసిద్ధి వహించిన శోభనాద్రి రా**
**ణ్ణామకుఁ డప్పరాయ నరనాధుని యాజ్ఞ నృసింహసూరి ప్ర**
**జ్ఞా మహిమానుభావమునఁ గావ్యముగా నొనరించి తెచ్చినన్**

**చ. విని మన యాశ్రితుండయిన వేంకటరామయసూరి భవ్య వ**
**ర్తన నిరతాంతరంగుని బిరాట్ల కులీనుని సూరయార్య నం**
**దనుఁగని వ్రాసితెండని ముదంబున నేనన నట్లొనర్చి మీ**
**రనువుగ చిత్తగించుఁడని యక్కృతి చెంతకుఁ దెచ్చి యుంచినన్**

**మ. నను నాత్మాశ్రిత ముఖ్యునిం ధరణిజానాథాంఘ్రి భక్తి ప్రవ**
**ర్తను శ్రీ దేవులపల్లి వంశభవు సుబ్రహ్మణ్యసూరిం గనుం**
**గొని మీరల్ మృదు గీతికా ఫణితి వాగ్గుంభంబు శ్రావ్యంబుగా**
**గను వాక్రుచ్చుఁడటన్న నేఁజదువ నాకర్ణించి మోదంబునన్**

(నీలాప 8, 9, 10 పద్యాలు)

దీనివలన ఈ కావ్యావతారిక దేవులపల్లి సుబ్రహ్మణ్య కవి వ్రాశాడని, నరసింహాచార్యుల కావ్యాన్ని ఆయన నిండు సభలో గానం చేశాడని తెలుస్తున్నది. ఆంధ్రభాషా విలాసిని పత్రికలో ఈ కావ్యం సీరియల్‌గా వచ్చింది. ఆ తరువాత చెలికాని లచ్చారావు తన అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము తరపున ముద్రించాడు. ఎన్ని ఆశ్వాసాల కావ్యమో తెలియదు కాని మిత్రులు శ్రీ కె. శ్రీనివాసులు (రెడ్డి) గారి వలన తొలి 35 పద్యాలు నాకు లభించాయి. ఇది అవశ్యము ముద్రించ వలసిన కావ్యము. ఇందలి శైలి ప్రౌఢంగా ఉంది.

ఇక ప్రకృత కావ్యము వల్లవీ పల్లవోల్లాసము. ఇది నాగ్నజితి వివాహము. కవి దీనికి ముద్దుగా వల్లవీపల్లవోల్లాసము అని పేరుపెట్టుకొన్నాడు. ఇది చాల మందిని ఆకర్షించింది. అతని సమకాలికుడు శిష్ట్ల కృష్ణమూర్తి శాస్త్రి వల్లవీపల్లవోల్లాసమనే సంస్కృత భాణం వ్రాశాడు. మంజులాచార్యుడనే ఇంకొక కవి కూడ వల్లవీపల్లవోల్లాస మనే సంస్కృత భాణము వ్రాసాడని మిత్రులు ఇప్పగుంట సాయిబాబా గారు నాతో అన్నారు. అతడెప్పటివాడో తెలియరాలేదు.

**అష్టమహిషులు :** నాగ్నజితి అష్ట మహిషులలో ఒకతె. అష్టమహిషులు ఎవరూ, ఏమిటి అన్న విషయంలో కొంత గడబిడ ఉంది. అష్టమహిషులతో శ్రీకృష్ణులవారికి పింగళిసూరన సేవలు చేయించిన 'తొడలు తలాడగా' (ప్రభావతీ ప్రద్యుమ్నము 2-15) - అన్న పద్యములోని అష్టమహిషులు - రుక్మిణి, సత్యభామ, భద్ర, జాంబవతి, మిత్రవింద, కాళింది, నాగ్నజితి, లక్షణలు. దశావతార చరిత్ర (8-268), ఉత్తర రామాయణము (8-345) మొ॥ కావ్యాలలో ప్రసక్తమైన అష్ట మహిషులు వీరే. తాళ్లపాక చిన్నన్న వ్రాసిన అష్టమహిషీ కల్యాణములోను వీరే. వీరిలో నాగ్నజితికి సుదంత, సత్య - అన్న నామాంతరాలు కూడా ఉన్నాయి. చిన్నన్న ప్రత్యేకంగా ఆమెను సత్యకీర్తి అని పేర్కొన్నాడు. కొందరు నాగ్నజితి స్థానంలో నీలను చేర్చి వర్ణిస్తారు. నీల వృత్తాంతము ఆచార్య సూక్తిముక్తావళిలోను, హరి వంశములోను కన్పిస్తుంది.

ఆచార్య సూక్తిముక్తావళి - కావేరీ తీరములో ఉన్న నిచుళాపురములో ధర్మవర్ముడనే రాజు ఉన్నాడనీ, అతనికి నీలాంశతో ఒక కూతురు పుట్టిందని, ఆమె వన విహారం చేస్తున్నప్పుడు అక్కడకు వచ్చిన రాజు శ్రీరంగపతి (విష్ణువు)ని ప్రేమించిందని. ధర్మవర్మడీ విషయమును శ్రీరంగపతితో చెప్పగా, ఆయన అనుగ్రహించి నీలను పెళ్లి చేసికొన్నాడని కథనము చేసింది.

హరివంశం - కాలనేమి పుత్రులు ఏడుగురు కుంభకుని ఇంట వృషభాలై పుట్టి చెలరేగారు. కృష్ణుడు నందాదులతో కుంభకుని ఇంటికి వెళ్లాడు. గిబ్బలను అడచిన వారికి తన కూతురు నిస్తానని కుంభకుడు చెప్పాడు. కృష్ణుడా ఎద్దులను అడచి నీలతోను, నందాదులతోను ఇంటికి వచ్చాడని - కథనము చేసింది. ఎఱ్ఱన ఈ కథను 55 గద్యపద్యాల (హరివంశము పూర్వభాగము 6వ ఆశ్వాసము 120 నుండి 174 వరకు) లో రసరమ్యంగా వర్ణించాడు. దీనినైదురెట్లు పెంచి కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయమను అచ్చతెనుగు కావ్యమును, రాపాక లక్ష్మీపతి నీలా వివాహము అన్న ప్రబంధమును వ్రాశారు. తెలుగులో నీలపెండ్లిని వర్ణించిన కావ్యాలివి రెండే.

వైష్ణవ ప్రబంధాలలో నీల గుఱించి ఉన్నప్పటికి ఆమె అష్టమహిషి కాదు. బహు పురాణాలను శోధించి దశావతార చరిత్రమనే మహా ప్రబంధము వ్రాసిన ధరణిదేవుల రామయమంత్రి అష్టమహిషులను, నీల, రాధలను వేరువేరుగా శ్రీకృష్ణుని భార్యలుగా ఇలా చెప్పాడు.

సీ. **కలహాంతరిత భోజ కన్యను లాలించు, స్వాధీన పతిక సత్యను భజించు**
**వాసకసజ్జికయౌ సుదంతను గూడు, విప్రలబ్ధనుమిత్రవింద నరయు**
**ఖండితయైన లక్షణ వేఁడుకొను విర, హోత్కంఠితను భద్ర నూఱడించుఁ**
**గాళింది నభిసారికను జేరి కలయుఁ బ్రోషిత భర్తృకను జాంబవతినిఁ జేరుఁ**

**గడమ పదియాఱు వేవురు కంజముఖుల, భావహావవిలాసవిభ్రమవిహార**
**లలిత బిబ్బోకచకితలీలాదరస్మి, తాది శృంగార చేష్టల కలరు శౌరి**

**క. నీళానీలాలక రాధాలలనను దోడితెచ్చి దయ మీఱంగా**
**నేలెం గులకాంతలతో, నాళీకాక్షుండు రతుల నానాగతులన్.**

(దశావతార 8 – 260, 261)

రామయమంత్రి అష్టవిధనాయికలను అష్టమహిషులకు అన్వయించాడు. రాధను, నీలను భార్యలుగా ఏలుకొన్నట్లు చెప్పాడు. అందువలన నీలకాని, రాధ కాని ఆ దక్షిణనాయకునికి భార్యలే కాని అష్ట మహిషులు కారని తెలుస్తున్నది.

కాని శ్రీవైష్ణవ సంప్రదాయము ప్రకారము స్వామికి ధర్మపత్నులు ఎందరున్నా వారిలో శ్రీ, భూ, నీళలే ప్రధానలు. వారిని ప్రత్యేక సూక్తముల ద్వార ప్రస్తుతించింది. నీలా తుంగస్తన తట సుప్త ముద్బోధ్య కృష్ణం (నీళ యొక్క ఎత్తైనస్తన తటముల మీద నిద్రిస్తున్న కృష్ణుని మేలుకొల్పునది) అని శ్రీ పరాశర భట్టరు గోదాదేవిని స్తుతిస్తూ నీలను ప్రస్తావించారు. పరమాత్మ శ్రీకృష్ణునిగా అవతరించినపుడు స్వామికి ప్రధాన దేవేరిగా, భోగపత్నిగా అవతరించింది నీళాదేవియే. ద్రావిడ సాహిత్యములో ఆమెను నప్పిన్నై – అని పిలుస్తారు. వైకుంఠంలో ఆమె లక్ష్మీదేవి, భూదేవులతో కలిసి నీళాదేవి అన్నపేరుతో వేంచేసి ఉంటుంది.

"వైకుంఠే తు పరే లోకే శ్రీ సహాయో జనార్దనః
ఉభాభ్యాం భూమినీళాభ్యాం సేవితః పరమేశ్వరః"

"ఏవం భూత భూమి నీళానాయక" – మొదలైన సూక్తులవలన ఈ విషయం తెలుస్తున్నది. ద్రవిడ సాహిత్యంలోనే నీళప్రస్తావన కన్పిస్తుంది.

**తెలుగు సాహిత్యంలో నాగ్నజితి :** క్షీణయుగము అష్టమహిషుల పెళ్లి తోరణాలతో కళకళ లాడింది. పరిణయాలు, అభ్యుదయాలు, విలాసాల పేర్లతో ఎన్నో పెళ్లి కావ్యాలు వచ్చాయి. వానిలో రుక్మిణీ పరిణయాలే అధికము. నాగ్నజితిని 17వ శతాబ్దము చివరి పాదం వరకు ఎవరూ తాకలేదు. దొరికినంత వరకు నాగ్నజితి పెళ్లి పుస్తకాల జాబితా తయారు చేశాను. చూడండి.

1. సుదంతా కల్యాణము (ద్విపద)–రాజవోలు సుబ్బారాయుడు–17వ శతాబ్ది ఉత్తరార్ధము.
2. నాగ్నజితీ పరిణయము – వల్లూరు నరసింహకవి – 18వ శతాబ్దము
3. సుదంతా పరిణయము – వెలిదండ్ల అళగిరి – 18వ శతాబ్దము
4. వల్లవీ పల్లవోల్లాసము – మాడభూషి నరసింహాచార్యులు – 19వ శతాబ్దము

5. వల్లవీ పల్లవోల్లాస భాణము – శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి – 19వ శతాబ్దము
6. వల్లవీపల్లవోల్లాసము – శ్రీనివాసాచార్యులు – 19వ శతాబ్దము
7. నాగ్నజితీ పరిణయము – వేమూరి శారదాంబ – 19వ శతాబ్దము

రాజవోలు సుబ్బారాయుని కావ్యము అలభ్యము. వల్లూరు నరసింహం కృతికి బ్రౌనుదొర వ్రాయించిన వ్రాతప్రతులు రెండు ప్రాచ్య లిఖిత భాండాగారం (మద్రాసు)లో ఉన్నాయి. అళగిరి, మాడభూషి కవి కావ్యాలకు కూడ బ్రౌన్ వ్రాయించిన ప్రతులు ప్రాచ్య. లి. భా. లోనే ఉన్నాయి. మిగిలిన వారి రచనలు అచ్చయినాగాని దొరకడం లేదు.

**భాగవతంలో నాగ్నజితి :** సంస్కృత భాగవతంలో నాగ్నజితి వివాహము 25 శ్లోకాలలో (దశమ స్కందము ఉత్తరార్ధము 58 అధ్యాయము 31 నుండి 55 శ్లోకముల వరకు) వర్ణింపబడింది. పోతన 19 పద్య గద్యాలలో (ఉత్తరభాగము 126 నుండి 144 పద్యం వరకు) కథనం చేశాడు. అందలి కథ చూడండి.

కోసల దేశాన్ని నగ్నజిత్తు అనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి నాగ్నజితి అనే కూతురు ఉంది. ఆ రాజు పశుసంపదలో మదించిన వృషభాలు ఏడు ఉన్నాయి. వాటిని అణచిన వానికి తన కూతురునిచ్చి పెళ్లి చేస్తానని ప్రకటించాడు. ఎందరో రాజులు విఫలయత్నం చేశారు. అది విని కృష్ణుడు తన సేనలతో కోసల దేశానికి వెళ్లాడు. తొలి చూపులోనే నాగ్నజితి అతనిని ప్రేమించింది. కృష్ణుడు రాజుతో – నేను సౌజన్యంతో నీ కూతురును కోరుకొంటున్నాను – అన్నాడు. అప్పుడు రాజు – నా కుమార్తెకీ లోకంలో నీ కంటే తగిన భర్త ఎవరున్నారు. సూర్యుడు చీకటిని పారద్రోలినట్లు యుద్ధంలో శత్రువులను జయించిన వీరుడివి. ఈ ఏడు గిత్తలను జయించి నా కూతురును చేపట్టమని అర్థించాడు. కృష్ణుడు పై వస్త్రాన్ని నడుముకు బిగించి, ఏడు రూపాలు ధరించి పర్వతాల వంటి ఆ గిత్తలను కుమ్మి నేలపై పడవేశాడు. రాజు ఆనందంతో నాగ్నజితీ కృష్ణుల పెళ్లి చేశాడు. ఇది తెలిసి, గతంలో విఫల యత్నం చేసిన రాజులు కృష్ణునిపై దండెత్తారు. అర్జునుడు తన పరాక్రమంతో వారిని పారద్రోలాడు. నాగ్నజితీ కృష్ణులు ద్వారకకు వచ్చారు. ఇదీ సంస్కృతాంధ్ర భాగవతాలలోని నాగ్నజితి వివాహము.

ఈ కథాక్రమాన్ని మార్చకుండా, హంస నారదాది పాత్రలను సందర్భోచితముగా సృష్టించి మాడభూషి కవి వర్ణనా ప్రధానంగా వల్లవీపల్లవోల్లాస ప్రబంధం వ్రాశాడు. ఇందలి కథను చూడండి.

**కథాసంగ్రహము :** పూర్వం కోసల రాజ్యం సిరిసంపదలతో తులతూగుతూ ఉండేది. ఆ రాజ్యాన్ని నగ్నజిత్తు అన్న రాజు ఇంద్రవైభవముతో పరిపాలిస్తున్నాడు. ఆయన

కీర్తి లోకమంతా వ్యాపించింది. లక్ష్మీదేవి కరుణ వలన ఆయనకు చక్కని కొడుకులు పుట్టారు. కాని స్త్రీ సంతానం కలుగలేదు. కొడుకులు ఎంతమంది ఉన్నా కూతురు లేని జీవితము వ్యర్థమని మహారాణి ఎప్పుడూ బాధపడుతూ ఉండేది. లక్ష్మీదేవికి ఆమె ఎన్నో పూజలు, వ్రతాలు చేస్తూ ఉండేది.

ఒకనాడు ఆమెకు కలలో లక్ష్మీదేవి ప్రత్యక్ష్యమయింది. వరం కోరుకోమన్నది. నీవంటి కూతురిని ప్రసాదించమని వేడుకొంది ఆమె. దేవి అనుగ్రహించింది. ఆమె కరుణవలన మహారాణి ఒక మంచి రోజున చందమామ వంటి పాపను కన్నది. అంతఃపురంలో ఆనందం వెల్లివిరిసింది. రాజు బ్రాహ్మణులకు దానధర్మాలు విరివిగా చేశాడు. పాపకు శాంతి పౌష్టిక విధులను నిర్వర్తించారు. పదకొండవ రోజున సత్య – అని నామకరణం చేశారు. ప్రజలు నాగ్నజితి యని, చెలులు సుదంత అని ఆమెను ముద్దుగా పిలుచుకొనేవారు.

నాగ్నజితి బాల్యం ఆటపాటలతో గడిచింది. గురువుల వద్ద సంగీత సాహిత్యాలను అభ్యసించింది. క్రమంగా ఆమెకు యౌవనం వచ్చింది. లక్ష్మీదేవి వంటి తన కూతురుకు మంచి మగడెక్కడ దొరుకుతాడా అని నగ్నజిత్తు ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాడు.

నగ్నజిత్తు ఆవుల మందలో మదించిన ఏడు గిత్తలు ఉన్నాయి. వాటికి మిడిసిపాటెక్కువ. పట్టబోయినవారిని కొమ్ములతో కుమ్మి, గిట్టలతో తొక్కి నుగ్గు నుగ్గు చేసేవి. ప్రజలాసంగతిని నగ్నజిత్తుకు చెప్పారు. వాటిని బంధించమని ఆయన తాళ్లు, బల్లేలతో భటులను పంపించాడు. అవి వారికి అలివి కాలేదు. అది తెలిసిన నగ్నజిత్తు ఆ గిత్తలను ఎవరు పడగొడతారో అతనికి తన కూతురునిచ్చి పెళ్లి చేస్తానని ప్రకటించాడు. ఎందరో రాజులు విఫలయత్నం చేశారు.

ఇంతలో వసంత ఋతువు వచ్చింది. చివురుటాకులతో, పూలతో తోటలు కళకళ లాడాయి. నాగ్నజితి చెలికత్తెలతో వనవిహారము చేసింది. ప్రథమాశ్వాసము ముగిసింది.

ఒకనాడు నాగ్నజిత్తు అంతఃపురములో బంధువులతో కొలువుతీరాడు. కూతురును సరసన కూర్చోబెట్టుకొని, వారితో తన కూతురుకి తగిన వరునిగుఱించి ప్రస్తావించాడు. వాళ్లు పెళ్లి ముచ్చట్లలో పడ్డారు. అప్పుడు నారదుడు అక్కడకు వచ్చాడు. 'మా పూర్వపుణ్యము వలన మీ దర్శన భాగ్యము లభించింద'ని నగ్నజిత్తు ఆయనను సాదరంగా ఆహ్వానించాడు. మాటల మధ్యలో ఏఏ దేశాలు చూసి ఇక్కడకు వచ్చారు స్వామి – అని నారదుడిని అడిగాడు. పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ తాను కృష్ణుని ద్వారకలో కొన్నాళ్లుండి ఇప్పుడు కోసల రాజ్యానికి వచ్చానని నారదుడు చెప్పాడు. కృష్ణుని దివ్యచరిత్రమును తెలుపుమని నగ్నజిత్తు అడిగాడు. కృష్ణుడు యుద్ధంలో శిశుపాల, జరాసంధులను జయించి రుక్మిణిని,

జాంబవంతుని జయించి జాంబవతిని, సత్యభామను, కాళిందిని, విందానువిందులను జయించి మిత్రవిందను పెళ్లి చేసికొన్నాడని, అతని బలపరాక్రమాలను, సౌందర్యమును, కల్యాణ గుణాలను తనివితీరా వర్ణించి, నగ్నజిత్తు పూజలందుకొని నారదుడు బదరికాశ్రమానికి వెళ్లిపోయాడు.

అదంతా విన్న నాగ్నజితి విరహంలో పడింది. ఆమె తాపాన్ని చూసి చెలికత్తెలు కలవరపడ్డారు. తల్లిచాటు బిడ్డవు. ఇలా ప్రేమలో పడితే సాటివాళ్లు నవ్వరా అని హితవు పలికారు. అయినా నాగ్నజితికి విరహం అధికమయింది. మణులతో కూడిన చంద్రకాంత శిలావేదిపై చివురుటాకులతో శయ్యను ఏర్పాటు చేసి ఆమెను పడుకోబెట్టారు. పన్నీరు కలిపిన గంధాన్ని చన్నులకు పూశారు. ఏడాకుల అరటి చెట్లనుండి జారిన కర్పూరపు పొడిని చల్లారు. పూల విసనకఱ్ఱలతో విసరి శీతలోపచారాలు చేశారు. ఇంతలో సూర్యాస్తమయమయింది. చీకటి పడింది. నక్షత్రాలు విరిశాయి. వెన్నెలవాన కురిసింది. మలయ పవనం వీచింది. కోకిలలు చిలుకలు కూశాయి. మన్మథుడు నాగ్నజితిపై విల్లెక్కుపెట్టాడు. ఆమె తట్టుకోలేక పోయింది. చెలులు మన్మథపూజ చేశారు. మలయ మారుతాన్ని, చంద్రుడిని, మన్మథుని తిట్టిపోశారు. సూర్యోదయ మయింది.

చెలులు నాగ్నజితిని ఊరడిస్తున్నారు. మానససరోవరాది సరస్సులలో భర్తతో విహరించి వస్తున్న ఒక ఆడుహంస ఆ వనానికి వచ్చింది. నాగ్నజితి సౌందర్యము చూచి ఆశ్చర్యపోయింది. ఆమె విచారానికి కారణమేమిటని చెలికత్తెలను అడిగింది. వారు విషయమంతా పూసగుచ్చారు. అప్పుడా హంస – నేను ద్వారకలో నివసించే హంసను. స్వామివద్ద నాకు చనువు ఉంది. నీ చక్కదనాన్ని ఆయనకు వర్ణించి, నీ కొంగుకు ముడివేస్తాను – అని మాట ఇచ్చింది. నాగ్నజితి ఊరడిల్లింది.

జరిగినదంతా తెలిసి నాగ్నజితి తల్లి బాధపడింది. తండ్రి మాత్రము కృష్ణుడే నీకు భర్త అవుతాడని ఊరడించాడు. హంస తన భర్తతో ద్వారకానగరము చేరింది. ఇంతలో గ్రీష్మ ఋతువు వచ్చింది. ఒకనాడు కృష్ణుడు అర్జునునితో వనవిహారం చేసి, పారిజాతము నీడను గల బంగారు వేదికపై కూర్చున్నాడు. హంస కృష్ణుని వద్దకు వచ్చి – స్వామీ! భూలోకమంతా చుట్టి వచ్చాను. అనుమతిస్తే విశేషాలన్నీ చెబుతానన్నది. హంస శరీరాన్ని నిమిరి చెప్పమన్నాడు కృష్ణుడు. అప్పుడు తను చూసిన విశేషాలన్నీ చెబుతూ – తాను కోసల రాజు ప్రమదావనంలో విహరిస్తున్నప్పుడు ఆ రాజు కూతురు నాగ్నజితిని చూశానని, ఆమె అందచందాలను వర్ణించి చెప్పింది. ఆమె విరహము, తన ఊరడింపు, ఆమె పంపించిన సందేశమును హంస అందంగా వివరించింది. అప్పుడు కృష్ణుడు అర్జునుని వైపు చూశాడు. ఆమె కోరిక నెలాగైనా నెరవేర్చాలి – అన్నాడు

అర్జునుడు. నవనిధులు, నవ యౌవనము కలిగిన ఆ జవరాలు అనే రత్నముతో జతకూడుట నీకే తగును – అన్నది హంస. హంసార్జునుల భావాలను గ్రహించి కృష్ణుడు సంతోషించి అంతఃపురానికి వెళ్లాడు. ద్వితీయాశ్వాసము ముగిసింది.

కృష్ణుడు నాగ్నజితి స్వయంవరానికి వెళ్లాలనుకొన్నాడు. అంతలో వర్షఋతువు వచ్చింది. మబ్బులు, మెరుపులు, ఇంద్ర ధనుస్సులను చూసి, వాటిని నాగ్నజితి కురులు, శరీరము, కనుబొమలతో పోల్చుకొని విరహంలో పడ్డాడు. అక్కడ నాగ్నజితి కూడ విరహంలో ఉంటుందని ఊహించి, హంసాంగనను పిలిపించి ఇలా చెప్పాడు. రాబోయే శరత్తులో దేవతలు ఆశ్చర్యపడేటట్లుగా గిత్తలను మట్టి కరిపించి నిన్ను చేపడతానని నాగ్నజితికి చెప్పి, అప్పటివరకు ఆమెవద్దనే ఉండమని హంసాంగనను ఆమె భర్తతోపాటు కోసలకు పంపించాడు. శరదృతువు వచ్చింది. కృష్ణుడు అర్జునుడితో పరివారముతో కోసల బయలుదేరాడు. రైవతక పర్వతము వద్ద విడిది చేశారు. మృగయులు వచ్చి కృష్ణాదులను వేటకు ఆహ్వానించారు. కత్తులు, బల్లేలు, తుపాకులు, కుక్కలు, డేగలతో వేటకు వెళ్లారు. జంతువులను వేటాడి అలసిపోయారు. ఆ రాత్రి అక్కడే గడిపారు.

మరునాడు కృష్ణుడు పరివారముతో కోసల బయలుదేరాడు. ఇది తెలిసి నగ్నజిత్తు నగరాన్ని అలంకరింప జేశాడు. బలాలతో కృష్ణునకు ఎదురువెళ్లి సాదరంగా ఆహ్వానించాడు. ఇదంతా చెలికత్తెలు నాగ్నజితికి చేరవేశారు. ఆమె సిగ్గు మొగ్గలయింది. హంసతో విజ్ఞతతో పాలను నీళ్లను వేరు చేయగలిగిన నీవు నా గుఱించి ఏవిధంగా చెప్పాలో ఆవిధంగా స్వామికి చెప్పమని పంపించింది.

హంసాంగన తన భర్తతో కృష్ణుని దర్శనానికి వెళ్లింది. నాగ్నజితి సందేశాన్ని తెలిపింది. మీ గుఱించి విన్నది మొదలు క్షణాలు యుగాలుగా గడుస్తున్న ఆమెను అనుగ్రహించు స్వామీ అని విన్నవించింది. కృష్ణుడు అర్జునునితో – నగ్నజిత్తు వద్దకు వెళ్లి మాటల నేర్పుతో నాగ్నజితిని పెళ్లికి అడిగి రమ్మని పంపించాడు. అర్జునుడు నగ్నజిత్తుకు కృష్ణుని సందేశం విన్పించాడు. నగ్నజిత్తు సంతోషించి ఆ పరంధామునికి కన్యాదానం చేస్తే నా కీర్తి ఇనుమడిస్తుంది. అయినా ఒక విషయం చెప్పాలి. నా మందలో కొండలవంటి 7 ఆఁబోతులు పుట్టాయి. వాటిని ఎవరైతే బంధిస్తారో అతనికి నా కూతురును ఇచ్చి పెళ్లి చేస్తానని చాటించాను. కనుక స్వామి ఆ గిత్తలను కూల్చి వీర్యశుల్క అయిన నా కూతురుని స్వీకరించి నన్నానందింపచేయాలి' – అని విన్నవించాడు.

నగ్నజిత్తు గిత్తలను రప్పించాడు. కృష్ణుని చూడగానే అవి కయ్యానికి కాలు దువ్వాయి. కృష్ణుడు వాటినన్నిటిని అన్ని రూపాలలో ఎదుర్కొన్నాడు. నేలకూల్చాడు. దేవతలు పూలవాన కురిపించారు. నగ్నజిత్తు అనందంతో కృష్ణుడిని పెళ్లికొడుకును

చెయ్యమని అర్జునుడికి పురమాయించాడు. కోసల నగరాన్ని అందంగా అలంకరించారు. నాగ్నజితిని పెళ్లికూతురును చేశారు. కృష్ణుడిని పెళ్లికొడుకును చేసి ఏనుగు మీద ఊరేగించి పెళ్లి మండపానికి తీసికొని వచ్చారు. పెళ్లి నాలుగు రోజులు వైభవంగా జరిగింది. మామగారిచ్చిన కట్నకానుకలతో, భార్యతో కృష్ణుడు ద్వారకకు బయలుదేరాడు. గతంలో గిత్తలతో పోట్లాడి ఓడిపోయిన రాజులు కృష్ణునిపైకి దండెత్తారు. అర్జునుడు వాళ్లనెదుర్కొని మట్టికరిపించాడు. మధ్యాహ్నమయింది. ఒక నదీతీరంలో ఉన్న అందమైన వనంలో విడిది చేశారు. తాటిచెట్లనుండి కారుతున్న మధుధారలు (కల్లు) చూచి యాదవులకు నోరూరింది. మధుపానం చేశారు. కృష్ణుని కీర్తిస్తూ ఆడి పాడారు. ఆ రాత్రి అక్కడే గడిపారు.

మరునాడు బలరామాదులు స్వాగతం పలుకగా నాగ్నజితీకృష్ణులు ద్వారక ప్రవేశించారు. మేళతాళాల మధ్య అంతఃపురంలో తల్లిదండ్రుల దీవెనలు తీసికొన్నారు. సాయంత్రమయింది. వధూవరుల తొలిరాత్రిని ఏర్పాటు చేశారు. చెలికత్తెలు నాగ్నజితికి చెప్పవలసినవి చెప్పి పంపించారు. వధూవరులు తొలి సమాగమము జరిగింది. తెల్లవారింది. చిలుకలు మేలుకొలుపులు పాడాయి.

ఇలా రోజులు గడుస్తు ఉండగా హేమంత ఋతువు వచ్చింది. ఆ చలిరాత్రులలో నాగ్నజితీకృష్ణులు సుఖరాత్రులు గడిపారు. తర్వాత కృష్ణుడు భద్ర, లక్షణలను కూడ పెళ్లి చేసికొని అష్ట మహిషులతో ద్వారకానగరమును పాలించెను. తృతీయాశ్వాసము ముగిసింది.

మూలంలో 25 శ్లోకాలలో ఉన్న ఈ కథను మాడభూషి కవి వర్ణనలతో చాలా రెట్లు పెంచి 615 పద్య గద్యాల ప్రబంధంగా వ్రాశాడు. ఈ నాగ్నజితి పెళ్లి కథ తెలుగు హరివంశంలోని నీల పెండ్లి కథను పోలినది. నీల పెండ్లి కథ సంస్కృత హరివంశములో లేదు. సంస్కృత భాగవతం లోని నాగ్నజితి వృత్తాంతాన్ని ఎఱ్ఱన నీలాసుందరీ పరిణయముగా మార్చాడు. భాగవతంలోని నాగ్నజితి హరివంశంలో నీల అయింది. నగ్నజిత్తు యశోద అన్న కుంభకుడైనాడు.

భాగవతంలోని నాగ్నజితి పెళ్లి కథలో లేని జిగిబిగి హరివంశము లోని నీల పెండ్లి కథలో ఉండడం విశేషం. భాగవతంలో కృష్ణుడు రాజు. రాజైన కృష్ణుడు గిత్తలను గెలిచి నాగ్నజితిని పెళ్లి చేసికోవడం ఉచితం అనిపించుకోదు. హరివంశంలో నీల పెళ్లినాటికి కాళియ మర్దనము జరుగలేదు. కృష్ణుడు అప్పటికి రాజు కాలేదు. పైగా కాలనేమి కొడుకులు 7 గురు కృష్ణునిపై పగతో కుంభకుని ఇంట గిత్తలుగా పుట్టారని హరివంశము కథాప్రారంభము (పూర్వభాగము 6-124) లోనే ఘంటా పథంగా చెప్పింది. కనుక కృష్ణునికి కోడెల కయ్యము తప్పనిసరి. కార్యకారణ సంబంధం ఇక్కడ ఉన్నంత బలంగా

భాగవత కథలో లేదు. నీల పెళ్లి నాటికి కూచిమంచి తిమ్మకవి కృష్ణుడిని 16 ఏళ్లవాడని చెప్పాడు.

వర్ణనలు : భాగవత కథలోని లోపాన్ని పట్టించుకోకుండా మాడభూషి కవి ఆ కథను యథాతథంగా తీసికొని హంస, నారద పాత్రలను సృష్టించి ప్రబంధ వర్ణనలతో వల్లవీపల్లవోల్లాస ప్రబంధం వ్రాశాడు. తన సమకాలికులందరు ద్వ్యర్థులు, త్ర్యర్థులు, శ్లేషలు, యమకాలు, అచ్చతెలుగులు, నిరోష్ఠ్యాలు, నిరూష్మాలే మహాకావ్య లక్షణాలుగా భావించి కావ్యాలు వ్రాస్తూ ఉంటే తాను మాత్రము అల్లసాని పెద్దనాదులు రాణించిన మనోహర వర్ణనలు చేసుకుంటూ భావోద్రేకాలకు, మానసిక బలహీనతలకు లోనుకాని ఒక సాధారణ ప్రబంధాన్ని రమణీయంగా వ్రాశాడు. మూలంలో లేని హంసార్జున రాయబారాలను సృష్టించాడు. వినుకలి వలన ఏర్పడిన ప్రేమ, వియోగము, విప్రలంభ శృంగారమును అతివేలము చేసి కావ్యాన్ని శృంగార మయం చేశాడు. వర్ణనా వ్యామోహము మేర మీరనందువలన కావ్యం రసరమ్యమయింది. అందలి వర్ణనలను చూడండి.

1. పుర వర్ణన (1 ఆ 50 నుండి 66), 2. నగ్నజిత్తు వర్ణన (1–67 నుండి 72), 3. లక్ష్మీదేవి వర్ణన (1–79), 4. గర్భిణీ స్త్రీ వర్ణన (1–89), 5. నాగ్నజితి బాల్యము (1–91 నుండి 96), 6. నాగ్నజితి యౌవనము (1–97, 98), 7. వసంత ఋతువర్ణన (1–108 నుండి 115), 8. వనవిహారము (1–117 నుండి 138), 9. నారద తీర్థయాత్రల వర్ణన (2–11 నుండి 13), 10. ద్వారకా పుర వర్ణన (2–16 నుండి 25 వరకు), 11. శ్రీకృష్ణ లీలా వర్ణనము (2–28 నుండి 35 వరకు), 12. శ్రీకృష్ణ సౌందర్య వర్ణన (2–36 నుండి 52), 13. నాగ్నజితి విరహము (2–57 నుండి 67), 14. శీతలోపచారాలు (2–86), 15. సాయంకాల వర్ణన (2–87 నుండి 93), 16. ఉపాలంభనలు (2–97 నుండి 109), 17. సూర్యోదయము (2–113 నుండి 118), 18. గ్రీష్మ ఋతువర్ణన (2–159 నుండి 169), 19. నాగ్నజితి సౌందర్యవర్ణన (2–177 నుండి 201), 20. వర్ష ఋతువు (3–3 నుండి 7), 21. శరదృతువు (3–23, 27, 28), 22. ప్రయాణము (3–29 నుండి 42), 23. రైవతక పర్వతవర్ణన (3–42), 24. వేట (3–43 నుండి 68), 25. వివాహము (3–102 నుండి 152), 26. మధుపానము (3–170 నుండి 173), 27. పురప్రవేశ వర్ణన (3–174 నుండి 181), 28. పడకగది ముచ్చట్లు (3–189 నుండి 201), 29. సంభోగ శృంగారము (3–204 నుండి 212), 30. సంభోగానంతర కృష్ణుని వర్ణన (3–217), 31. సంభోగానంతర నాగ్నజితి (3–221), 32. హేమంత ఋతువు (3–231 నుండి 237), 33. హంస దౌత్యము (2–176 నుండి 219), 34. అర్జున దౌత్యము (3–87, 88),

35. అరణ్య వర్ణన (3–42), 36. కోడెల కయ్యము (2–97 నుండి 99), 37. గిత్తల వర్ణన (1–100).

ఆలంకారికులు చెప్పిన ప్రబంధవర్ణనలను దాదాపు సమగ్రంగా కలిగిన ఏకైక ప్రబంధమిది. తీర్థయాత్ర, ప్రయాణము వంటి మారుమూలవర్ణనలను సందర్భము చూచుకొని కవి జాగ్రత్తగా చొప్పించాడు. వర్ణనల సంఖ్య ఎక్కువే కాని, కవి వాటిని పొదుపుగానే వర్ణించాడు. వర్ణనల సంఖ్య బాగా పెరగడం వలన కాబోలు నది, అరణ్యము, కుమారోదయము వంటి వర్ణనలకు అవకాశం ఉన్నా వర్ణించలేదు.

గిత్తల ఆకారాలు, కయ్యము వర్ణనలలో కవికి మంచి అవకాశం, సందర్భము ఉన్నప్పటికి అంత తీవ్రంగా వర్ణించలేదు. కవి స్వభావము అందుకు కారణం కావచ్చును. ఇందలి వర్ణనలను బట్టి ఈ కవి మృదుస్వభావుడని, కోమలమైన హృదయం కలవాడని, మితభాషి అని, తీవ్రమైన పోకడలను ఇష్టపడేవాడు కాదని ఊహించవచ్చును.

ఇతని వర్ణనలలోను, సమాసాలలోను, పదగుంభనములోను, భావుకతలోను మార్దవమెక్కువ. శబ్దకాఠిన్యమంతగా కన్పించదు. పురవర్ణనలలో మాత్రము కొంత శబ్దప్రౌఢిమ కన్పిస్తుంది. ఇందులో కవి మూడు పురవర్ణనలను చేశాడు. 1835 నాటి నూజివీడు పురమును అవతారికలో కవి ప్రౌఢంగా వర్ణించాడు.

సీ. **ద్విజరాజకేతన ద్విజరాజధర సితద్విజవాహ సన్నిభ ద్విజగణంబు**
**కార్తవీర్యార్జున కార్తికేయార్జున కీర్తిత క్షత్రియ వర్తనంబు**
**రాజీవదర మహారాజీవ నిధి రాజరాజ సమ్మిత వణిగ్రాజితంబు**
**కర్షణాంచిత బాహు ధర్షిత వైరి సంకర్షణామిత సత్వ కర్షకంబు**

గీ. **చటుల విక్రమ పటురటద్భటచయంబు,**
**నటవిటశ్రేణి రంజిత నరచయంబు,**
**మత్త వేదండ తండంబు, మహిత చక్రి,**
**తురగ నికరంబు నూజివీట్పురవరంబు** (1–12)

నూజివీడు పురములోని బ్రాహ్మణులు ద్విజరాజకేతన (గరుత్మంతుని జెండా గుర్తుగా గల విష్ణువును), ద్విజరాజధర (వాసుకిని ఆభరణముగా ధరించిన శివుడిని), సితద్విజవాహ (తెల్లని హంసను వాహనముగా కలిగిన బ్రహ్మను) సన్నిభులు. అంటే వారు త్రిమూర్తులను పోలినవారని అర్థము.

ఆ పురములోని క్షత్రియుల శౌర్యము కార్తవీర్యార్జున కార్తికేయార్జున కీర్తితము. (కార్తవీర్యుడు, కుమారస్వామి, అర్జునుడు వంటి మహావీరులచే కీర్తింపబడినది.) అంటే ఆ రాజులు గొప్ప పరాక్రమవంతులు.

ఆ పురములోని వైశ్యులు రాజీవదర మహారాజీవనిధి రాజరాజసమ్మితులు. (పద్మము, శంఖము, మహాపద్మము వంటి నవనిధులు కలిగిన కుబేరునితో సమానమైన సంపదలు కలిగి విరాజిల్లుచున్నారు.)

ఆ పురములోని రైతులు కర్షణాంచిత బాహుధర్షిత వైరి సంకర్షణామిత సత్త్వులు (నాగలి గల చేతులతో శత్రువులను శిక్షించిన బలరాముని మించిన శక్తి కలవారు.)

అంతే కాదు ఆ నగరము చటుల విక్రమ పటురటత్‌భట చయంబు కలిగినది. (తీవ్రమైన పరాక్రమము పరుషంగా ధ్వనించే భటులు కలిగినది.) నటవిటశ్రేణీ రంజిత సంచయంబు (నటులు, విటులతో ప్రజలను రంజింపజేయునది.) మత్తవేదండ తండంబు (మదించిన ఏనుగుల గుంపును కలిగినది.) మహితచక్రి తురగ నికరంబు (గొప్ప గొప్ప రథాలు గుఱ్ఱాలు కలిగినది) – అని అర్థము. ఈ పద్యంలో కవి సీస పాదాలలో చాతుర్వర్ణాలను గీత పాదాలలో చతురంగ బలాలను వర్ణించాడు.

అప్పటివరకు కోర్టువారి వశంలో ఉన్న ఆ సంస్థానం అప్పుడే శోభనాద్రి అప్పారావు గారి పరమయింది. ఆ ఆనందోత్సాహంలో కవి నూజివీడు పురాన్ని ప్రబంధ నగరంగా వర్ణించాడు. అయితే అప్పటి సామాజిక స్థితిగతులను కవి స్పృశించలేదు.

అవతారికలో నూజివీడు పురాన్ని వర్ణించిన కవి, కావ్యంలో రెండు నగరాలను వర్ణించాడు. అవి కోసల, ద్వారకలు. కథ కోసలనగర వర్ణనతో ప్రారంభమవుతుంది. ఈ నగరాన్ని కవి 17 పద్యాలలో రమణీయంగా వర్ణించాడు. అందలి తొలి పద్యాన్ని చూడండి.

సీ. **లసదాగమస్ఫూర్తి వెసఁ బూని హంసార్వ**
**సరణులై తనరు భూసురులు హరులు**
**తేజోబలోద్ధతి దిక్కుంభినీశుల**
**కెరలి రంజిల్లు భూవరులు కరులు**
**కమనీయ నవరత్న కాంచన చక్రకో**
**టులను శోభిల్లు వైశ్యులు రథములు**
**పరమ ధర్మాభాతి పరజీవన క్షేత్ర**
**దారతఁ దగిన పాదజులు భటులు**

గీ. **రమ్య సుమనః ప్రమోదాంగ రాగలలిత,**
**పల్లవావాప్తిచే మించు ప్రౌఢవార**
**కాంత లారామములు గల్గి ఘనత నొందె,**
**భూస్థలిఁ గరంబు కోసలపురవరంబు** (వల్లవీ 1–52)

ఈ పద్యంలో కవి ఒక విశేషణానికి రెండు విశేష్యాలను అన్వయించాడు. లసదామ స్ఫూర్తి వెసఁబూని హంసార్వసరణులై తనరు బ్రాహ్మణులు, గుఱ్ఱాలు ఆ నగరంలో ఉన్నాయి. అంటే – ప్రస్ఫుటమైన వేదస్ఫూర్తిని ధరించి హంసార్వ (హంసవాహనుడైన బ్రహ్మ) యొక్క పద్ధతి కలవారై బ్రాహ్మణులు ప్రకాశిస్తున్నారు. అంటే బ్రహ్మను పోలిన వారని అర్థము. ఆ నగరంలోని బ్రాహ్మణులు వేదవిద్యను చక్కగా అభ్యసించిన వారని భావము. గుఱ్ఱాల పరంగా – ఉజ్జ్వలమైన గమన నైపుణ్యం కలిగి హంసార్వసరణి నున్నవి. (సూర్యరథాశ్వాలను పోలినవి) ఆ నగరములోని గుఱ్ఱాలు.

తేజోబలోద్ధతి దిక్కుంభినీశుల కెరలి రంజిల్లు క్షత్రియులు, ఏనుగులు ఆ నగరంలో ఉన్నాయి. అంటే – బలపరాక్రమాల గర్వముతో అష్టదిక్పాలకులను మించి భాసించు క్షత్రియులు కలరు. ఏనుగుల పరంగా – గొప్ప బలము, దేహము ఔద్ధత్యముతో దిగ్గజాలను మించి శోభించు ఏనుగులు ఆ నగరంలో ఉన్నాయి.

కమనీయ నవరత్న కాంచన చక్రకోటలను శోభిల్లు వైశ్యులు, రథాలు ఆ నగరంలో ఉన్నాయి. వైశ్యుల పరంగా – మిలమిల మెరిసే మరకత మాణిక్యాదులుగా గల నవరత్నాలు, బంగారు నాణెములు కోటానుకోట్లుగా గల వైశ్యులు ఆ నగరంలో ఉన్నారు. రథాల పరంగా – కన్నులు మిరుమిట్లు గొలిపే నవరత్నాలు పొదిగిన బంగారు చక్రాలచే శోభిస్తున్న రథాలు ఆ నగరంలో ఉన్నాయి.

పరమ ధర్మాభాతి పరజీవన క్షేత్ర దారతఁదగిన శూద్రులు, భటులు ఆ నగరంలో ఉన్నారు. శూద్రుల పరంగా – మంచి ధర్మము కలిగిన పద్ధతులతో వర్షాధార భూములను సాగుచేయగలిగిన శూద్రులు ఆ నగరంలో ఉన్నారు. భటుల పరంగా – పదునైన కత్తుల తళతళలతో శత్రురాజ్యాలను గెలుచు సామర్థ్యము గల భటులు ఆ నగరంలో ఉన్నారు.

రమ్య సుమనః ప్రమోదాంగ రాగ లలిత పల్లవావాప్తిచే మించు ప్రౌఢవార కాంతలు, ఆరామములు ఆ నగరంలో ఉన్నాయి. వారకాంతలపరంగా – అందమైన పూలతో, పరవశము కలిగించే లేపన ద్రవ్యాలతో సుందరులైన విటుల పొందుతో మిసమిసలాడే ప్రౌఢవార కాంతలు ఆ నగరంలో ఉన్నారు. ఉద్యానవనాల పరంగా – ఇంపైన పూల పరిమళాలతో, మెత్తనైన ఎఱ్ఱని చివుళ్లతో శోభించు అందమైన వనాలు ఆ నగరంలో ఉన్నాయి. ఇన్ని శోభలతో ఆ కోసల నగరం భూమి మీద ఘనత వహించిందని కవి గొప్పగా వర్ణించాడు.

అంతటితో ఆగలేదు. ఆ నగరము శ్రీవిలాస లలితమై సముద్రునితో పోలుతుందని ఇలా శ్లేషించాడు.

గీ. **భవ్యగుణరత్న బహుసుధా భవన రాజ**
**మండలోదయ సదనంత మహిత భోగ**
**లసిత పురుషోత్తమ శ్రీ విలాస లలిత**
**మగుచు విలసిల్లె నప్పుర మబ్ధికరణి.** (వల్లవీ 1–53)

శ్రేష్ఠమైన రత్నసౌధాల సమూహము యొక్క సమృద్ధిచేత, అంతులేని భోగాలు కలిగిన ఉత్తమ పురుషులతోను, సిరిసంపదలతోను సముద్రము వలె కోసల రాజ్యము విలసిల్లుచున్నదని కవి వర్ణించాడు.

ఇందలి శ్లేష – జాతిరత్నాలకు, అమృతమునకు, చంద్రబింబమునకు పుట్టుక అయినది, ఆదిశేషుని విశాలమైన పడగ నీడన విరాజిల్లుతున్న విష్ణువు, లక్ష్మి దేవుల విలాసములతో శోభాయమానంగా ఆ నగరము సముద్రము వలె ఒప్పుచున్నదని కోసల నగరాన్ని కవి సముద్రముతో శ్లేషించాడు.

కోసల నగరాన్ని సముద్రంతో శ్లేషించి వర్ణించినప్పటికీ కవికి తృప్తి కలుగలేదు. మానససరోవరంతోను, వసంతముతోను, రామాయణముతోను, సముద్రముతోను మరలా శ్లేషించాడు.

సీ. **రాజహంస విలాస రాజమానాంగమై**
**బహుజీవనావాప్తి భవ్యమగుచు**
**లసమాన పల్లవోల్లాస సంవాసమై**
**సమదానురాగిణీ సదనమగుచు**
**రమణీయ గుణశాలి రామాభిరామమై**
**భరతగోష్ఠీసమాభరితమగుచుఁ**
**బురహూతగణనీయ పురుషోత్తమహితమై**
**లక్ష్మీవిహారాభిలలితమగుచు**

గీ. **మానససరోవసంతరామాయణాంబు,**
**నిధులతో సామ్యమొంది సేవధి విశేష**
**మహితగోపురసౌధ హర్మ్యప్రసక్తి,**
**నలరు నన్నగరీవర మనవరతము.** **(వల్లవీ 1–67)**

రాజహంస విలాస రాజమానాంగమై బహుజీవనావాప్తి భవ్యమగుచు ఆ నగరము మానససరోవరముతో సామ్యము పొందినది. అంటే రాజహంసల క్రీడలతో విలసిల్లుతూ విస్తారమైన నీరులను కలిగి ఆ నగరము అందమైన మానస సరోవరమును పోలినది. రాజశ్రేష్ఠుల విలాసములతో విలసిల్లుతూ అనేక వృత్తులకు ఆ నగరము నెలవై ఉన్నదని శ్లేష.

లసమాన పల్లవోల్లాస సంవాసమై సమదానురాగిణీ సదన మగుచు ఆ నగరము వసంతముతో సామ్యము పొందినది. అంటే – అందమైన చివురుటాకుల వికాసము కలిగి చిక్కని ఎఱ్ఱదనములకు స్థానమవుతూ ఆ నగరము వసంత ఋతువును పోలినది. అందమైన విటుల సంతోషములకు నెలవై ప్రమదానురాగాలు కలిగిన వారకాంతలకు ఆ నగరము స్థానమైనదని శ్లేష.

రమణీయ గుణశాలి రామాభిరామమై భరతగోష్ఠీ సమాభరితమగుచు ఆ నగరము రామాయణముతో సామ్యము పొందినది. అంటే – మంచి గుణములు కల శ్రీరామునితో మనోహరమై భరతాదుల ముచ్చట్లతో నిండిన ఆ నగరము రామాయణమును పోలినది. సుగుణ సంపన్నమైన స్త్రీల మనోహరమైన నాట్యకేళులతో ఆ నగరము అభిరామమైనదని శ్లేష.

పురుహూత గణనీయ పురుషోత్తమ హితమై లక్ష్మీ విహారాభిలలిత మగుచు ఆ నగరము అంబునిధితో సామ్యము నందినది. అంటే – ఇంద్రాదులు పూజించు శ్రీమహావిష్ణువుకు తగిన దగుచు, లక్ష్మీదేవి విహరించుటకు తగిన మనోహర ప్రాంతమయిన ఆ నగరము క్షీరసముద్రమును పోలినది. వైభవంలో ఇంద్రునకు సాటిరాగల ఉత్తమ పురుషులకు స్థానమై సిరిసంపదలు కొలువై ఉన్న శుభకర ప్రాంతమా నగరమని శ్లేష.

ఆ నగరము మానస సరోవరము తోను, వసంతముతోను, రామాయణము తోను, సముద్రముతోను పోల్చదగినదై నిధులతోను ఎత్తైన గోపురాలతోను, సౌధాలతోను, హర్మ్యాలతోను అలరారుచున్నదని కవి వర్ణించాడు.

సాధారణంగా అన్ని ప్రబంధాలలోను కనిపించే కస్తూరి కలిపిన పన్నీటి జల్లులతో తడిసిన బజారులు, ముత్యాల ముగ్గులు, నల్ల కలువల తోరణాలు వ్రేలాడే వైదూర్య స్తంభాలు, కర్పూర చందన అగరు ధూపాలు పరిమళించే రాజవీథులు, శుకపికాల స్వరాలతో, అందమైన పూలతో, మృదువైన చివుళ్లతో నిండిన ఉద్యాన వనాలు, సరసులతో శ్లేషలతో గడుసుగా సమాధానం చెప్పే పుష్పలావికలు ఈ ప్రబంధంలోను కనిపిస్తారు. ప్రబంధాలలో తరచుగా కన్పించని చిగురు బోడుల వర్ణనను కవి పరస్పర విరుద్ధమైన భావాలతో సొగసులద్దుతూ చిత్రంగా వర్ణించాడు.

**సీ. శారద పూర్ణిమా చంద్రబింబాస్యలై**
**యలకాంధ తమసంబు ననుకరించి**
**మదకీర కోకిల మంజులవాణులై**
**పక్వబింబాధర ప్రాప్తిఁ గాంచి**
**తనరారు మృగరాజ తనుమధ్యసీమలై**
**కరికుంభ వక్షోజ గరిమఁ బెంచి**

**బిసనాళ మృదుబాహులసమానలై రాజ**
**హంసయానంబుల నతిశయించి**
గీ. **చంద్రికాస్మిత సాంద్రలై చరణనయన,**
**వారిజంబుల విలసిల్లి వన్నెకెక్కి**
**చిత్రలావణ్య గణ్యతఁ జిగురుబోడు,**
**లాపురంబున విహరింతు రేఁపుమీఱి.** (వల్లవీ 1-56)

ఆ నగరంలోని పడుచు పిల్లలు శారద పూర్ణిమా చంద్ర బింబాస్యలై కూడ (శరత్తులోని పున్నమినాటి చంద్రబింబము పాటి ముఖము కలిగిన వారయి కూడ) అలకాంధ తమసమును అనుకరించారు (ముంగురులు అనే చీకట్లను అనుసరించారు) చందమామ చీకట్లను కబళిస్తుంది. కాని ఇక్కడ ఇవి రెండు ఒక చోట ఉన్నాయి. అంటే వారి ముఖాలు చంద్రబింబాలు అనీ, ముంగురులు చీకటివలె నలుపని అర్థము.

మదకీరకోకిల మంజుల వాణులై కూడ (మదించిన చిలుక, కోకిలల వంటి మనోహరమైన పలుకులు కలవారై నప్పటికి), పక్వబింబాధర ప్రాప్తి గాంచిరి (పండిన దొండపండు వంటి పెదవులు కలిగి ఉండిరి). కీరములకు కోకిలలకు పక్వబింబములు ఆహారము. కనుక అవి పక్వబింబాలను కబళించాలి. కాని ఇక్కడ రెండూ ఒకేచోట ఉన్నాయి. అంటే ఆ చిగురు బోడుల పలుకులు మిక్కిలి ముద్దుగొలుపునని, వారి పెదవులు దొండపండ్ల వలె ఉన్నాయని అర్థము.

తనరారు మృగరాజు తను మధ్యలై కూడ (వారు సింహము వంటి నడుము కలవారైనప్పటికి) కరికుంభవక్షోజ గరిమను బెంచిరి (ఏనుగు కుంభస్థలమును పోలిన ఎత్తైన స్థనములను కలిగి ఉండిరి). సింహము ఏనుగు కుంభస్థలము మీదికి లంఘిస్తుంది. కాని ఇక్కడ రెండూ ఒక్కచోటే ఉన్నాయి. అంటే వారి నడుము సింహము నడుము వలె సన్నమని, చన్నులు ఏనుగు కుంభస్థలము వలె ఉన్నతములని అర్థము.

బిసనాళ మృదుబాహు లసమానలై కూడ (వారు తామర తూడుల వంటి మృదువైన చేతులు కలిగినప్పటికి), రాజహంస యానంబుల నతిశయించిరి (రాజహంస నడకలతో ఒప్పుచున్నారు). హంసల కాహారము తామర తూడులు. అవి రెండూ ఆమెలో ఇప్పుడు ఒకే చోట ఉన్నాయి. అంటే కరములు మృణాల నాళములవలె ఉన్నాయి. ఆమె నడకలు రాజహంస నడకలవలె మనోహరమని అర్థము.

చంద్రికాస్మిత సాంద్రలైకూడ (వారు వెన్నెలల వంటి చిరునవ్వులు కలిగిన వారైనప్పటికి) చరణనయన వారిజంబుల విలసిల్లిరి (పద్మములవంటి పాదాలతో, కన్నులతో విలసిల్లిరి). వెన్నెలకు, పద్మములకు విరోధము కవిసమయప్రసిద్ధము. పద్మబాంధవుడు

సూర్యుడు, కలువఱేడు చంద్రుడు. అవి రెండు ఆమెలోనే ఉన్నాయి. అంటే వారి నవ్వులు వెన్నెలలని, కన్నులు, పాదాలు పద్మముల వంటివని అర్థము.

ఈవిధంగా ఆ నగరంలోని చిగురుబోడుల చిత్ర లావణ్యగణ్యత (ఆశ్చర్యకరమైన లావణ్యము చేత వన్నెకెక్కి) తో విలాసంగా విహరిస్తూ ఉంటారు.

లావణ్యము – అంటే (Beauty, lovliness; a pearl white color.), సౌందర్యము, ముక్తాఫలచ్ఛాయా వదంగ దృశ్యమాన కాంతి, ముఖ కాంతి విశేషము – అని బ్రౌన్ దొర వివరించాడు.

శబ్దకల్పద్రుమము లావణ్యము అంటే –
**ముక్తాఫలేషు చ్ఛాయాయా, స్తరళత్వమివాంతరా**
**ప్రతిభాతి యదంగేషు, తల్లావణ్యమిహోచ్యతే.**

– అని చెప్పిందని పాండురంగమాహాత్మ్యవ్యాఖ్యలో కీ.శే. వంతరాం రామకృష్ణారావుగారు (3వ ఆశ్వాసము పుట 279) వ్రాశారు. ఈ శ్లోకాన్ని బట్టి – లావణ్యము అంటే ముత్యముల యందువలె నవయవముల యందు ప్రతిఫలించు నట్టి కాంతి విశేషము – అని సూర్యరాయాంధ్ర నిఘంటువు అర్థము చెప్పింది. ధ్వన్యాలోక కర్త ధ్వని గుఱించి చెబుతూ లావణ్యాన్ని ఇలా ప్రస్తావించాడు.

**యత్తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం**
**విభాతి లావణ్యమివాంగనాసు.**

యౌవనంలో ఉన్న స్త్రీ శరీరమంతా వ్యాపించి ఉన్న కాంతి విశేషాన్ని లావణ్యమంటారని చెప్పాడు. బ్రౌనుదొర సరైన అర్థమే చెప్పాడు కాని ముఖకాంతి విశేషము – అని అనకుండా ఉండవలసినది.

సాధారణంగా పురవర్ణనలో పురము, కోటలు, మేడలు, రాజవీథులు, పుష్పలావికలు, ఏనుగులు, గుఱ్ఱాలు మొదలైన వర్ణనలు ఉంటాయి. మన కవులు వీటిని కనీసము ముప్ఫై నలభై పద్యాలలో వర్ణిస్తూ ఉంటారు. కాని మాడభూషి కవి మాత్రము కేవలము 16 పద్యాలలోనే కోసల పురమును వర్ణించాడు. అందులోను పురవర్ణనలో క్రీడాపర్వతాలలో కిన్నరులు విహరిస్తారని ఏ కవీ ప్రస్తావించని కిన్నరులను ప్రత్యేకంగా ఒక పద్యంలో ఇలా వర్ణించాడు.

శా. **నీడాంతస్థిత కేకి కోకిల శుకానీక స్వనానోకహ**
**క్రీడాభూధర కూటకోటి విలసచ్ఛ్రీమంజు కుంజంబులన్**
**జోడుం బాయక కిన్నరుల్ సతులతో సూనాస్త్ర సంప్రీతిగాఁ**
**గ్రీడా తత్పరులై సుఖింతురు గత వ్రీడాత్ములై తత్పురిన్** (వల్లవీ 1–58)

ఆ నగరంలో అందమైన క్రీడా పర్వతాలున్నాయి. వాటిమీద మహావృక్షాలు ఉన్నాయి. ఆ వృక్షాల కొమ్మల మీద ఉన్న గూళ్లలో ఉన్న నెమలి, కోకిల, చిలుకల సమూహాలు మనోహరంగా కూస్తూ ఉంటాయి. అటువంటి క్రీడాపర్వతాల కొండ కొమ్ముల అంచున అందమైన పూపొదరిండ్లు ఉన్నాయి. అందులో కిన్నరులు తన సతులను జంట విడువకుండా సిగ్గువిడిచి మన్మథ క్రీడలలో మునిగి తేలుతూ ఉంటారు – అని అర్థము.

కిన్నరులు – ఒక విధమైన దేవయోని విశేషము. కిన్నరులు, కింపురుషులు, గంధర్వులు మొదలైన వారంతా దివ్యులు. కిన్నరుల స్వరూపము విషయంలో కవులలో రెండు మతాలున్నట్లుగా తెలుస్తున్నది.

కిన్నరుడు అంటే – నరముఖమును, అశ్వశరీరమును గల దేవయోని విశేషమని – సూర్యరాయాంధ్ర నిఘంటువు అర్థము చెప్పి –

**'బింబోష్ఠం బహుమనుతే తురంగవక్త్ర –**
**శ్చుంబంతం ముఖమిహ కిన్నరం ప్రియాయాః'**

– అన్న శిశుపాల వధ (4–38) శ్లోకాన్ని ప్రయోగంగా ఇచ్చింది. ప్రియురాలి దొండపండు వంటి పెదవిని ముద్దాడు కిన్నరుని (మనిషితల, గుఱ్ఱం శరీరం కలవానిని) చూచి, తురంగవక్త్రుడు గంధర్వుడు మెచ్చుకొంటున్నాడు – అని వ్యాఖ్యాతలీ శ్లోకానికి అర్థము చెప్పారు. ఇందువలన గంధర్వులు అశ్వముఖులని, కిన్నరులు నరముఖులని తెలుస్తున్నది.

కాని సూర్యశతకంలో మయూరుడు కిన్నరులను అశ్వముఖులుగా వర్ణించాడు.

**మార్గోపాన్తే సుమేరోర్నువతి కృతనతౌ నాకధామ్నాం నికాయే**
**వీక్ష్య వ్రీడావతీనామ్ ప్రతికుహరముఖం కిన్నరీణాం ముఖాని ।**
**సూతేஉసూయత్యపీషజ్జడగతి వహతాం కంధరాగ్రైర్వలద్భి –**
**ర్వాహానాం వ్యస్యతాద్వస్సమమసమహరేర్హ్రేషితం కల్మషాణి ॥**

సూర్యుని రథం మేరు పర్వత మార్గంలో వస్తూ ఉంది. దేవతలందరు నమస్కరిస్తున్నారు. వారిలో సిగ్గుతో తలవంచుకొన్న కిన్నర స్త్రీలను చూచి సూర్యుని గుఱ్ఱాలు మెడలు పక్కకు తిప్పి మెల్లగా నడుస్తున్నాయి. అప్పుడు సారథి అయిన అనూరుడు కోపించి అదిలించగా ఆ గుఱ్ఱాలు చేయు సకిలింతలు మిమ్ములను రక్షించుగాక – అని మయూరుడు వర్ణించాడు.

ఇక్కడ కిన్నర స్త్రీలు అశ్వముఖులు. కనుక వారిని చూచి సూర్యుని గుఱ్ఱాలు ఆడు గుఱ్ఱాలనుకొని వారివైపు మెడలు తిప్పి మెల్లగా నడిచాయి. కనుక మయూరుని

దృష్టిలో కిన్నరులు అశ్వముఖులే.

అమరసింహుడు – 'స్యాత్కిన్నరః కింపురుషస్తురంగవదనో మయుః' – అనీ, వైజయంతి నిఘంటుకారుడు – కిన్నరాః స్యుః కింపురుషా మయవోఽశ్వముఖాశ్చ తే – అని కిన్నరులను అశ్వముఖులుగానే చెప్పారు.

వీరి ననుసరించి రామరాజ భూషణుడు రఘునాథశౌరి పరాక్రమాన్ని వర్ణించు సందర్భములో కిన్నరులశ్వముఖులుగా, గంధర్వులు మనుష్య ముఖులుగా ఇలా చెప్పాడు.

**మ. హరిమైసాది శిరంబు సాదిమెయి జాత్యశ్వోత్తమాంగంబు గూ**
**డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందార వృ**
**ష్టి రహిం బ్రాణ యుతంబులై గగన వాటిం బర్వ గంధర్వ కి**
**న్నర రూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దచ్ఛౌర్యమున్**

(వసుచరిత్ర 1–.....)

రౌతు తల గుఱ్ఱం మొండెము మీద, గుఱ్ఱం తల రౌతు మొండెము మీద పడి అవి ఆకాశంలో ఎగురునట్లుగా రఘునాథరాయలు యుద్ధంలో రౌతును, గుఱ్ఱాన్ని నరికాడు. ఆ పరాక్రమాన్ని చూసి ఆకాశంలోని దేవతలు మందార పుష్పవర్షం కురిపించారు. ఆ పూలవానలో అవి (రౌతు తల గల గుఱ్ఱం, గుఱ్ఱం తల రౌతు) ప్రాణంతో ఉన్న గంధర్వ కిన్నర రూపాలు దాల్చి, దేవతలతో పాటు అవి కూడ ఆ పరాక్రమాన్ని చూచి ఆనందించాయని రామరాజ భూషణుడు వర్ణించాడు. ఇక్కడ కిన్నరులు అశ్వముఖులుగా, గంధర్వులు మనుష్యముఖులుగా చెప్పబడ్డారు.

ఆప్టే నిఘంటువు కూడ – (A mythical being with a human figure and he head of a horse) (అశ్వముఖః) – అనీ

హలాయుధకోశము కూడ – కిన్నరః స్యాత్కిమ్పురుషో మయురశ్వముఖస్తథా – అని కిన్నరులను అశ్వముఖులుగానే చెప్పాయి.

శబ్దరత్నాకరంలో బహుజనపల్లి సీతారామాచార్యులు మాత్రము –

కిన్నరుఁడు . సం.వి.అ.పుం. అశ్వముఖంబును నరశరీరమును గల దేవయోని విశేషము. "గ. కిమనేన గృహీతేన వా కిన్నర యుగళేన ప్రయోజన మిద ముపశ్రుత మశ్వముఖ ద్వయమ్" కాదంబరి. – నరముఖము నశ్వశరీరమును గల దేవయోని విశేషమని కొందఱు – శ్లో. "బింబోష్ఠం బహుమనుతే తురంగ వక్త్ర శ్చుంబంతం ముఖమిహ కిన్నరం ప్రియాయాః శ్లిష్యంతం ముహురిత రోపితం నిజస్త్రీ ముత్తుంగ స్తనభర భంగ భీరు మధ్యామ్" మాఘము

– అని రెండు విధములున్నట్లుగా తెలిపింది. ఇందువలన కిన్నరుల స్వరూపముగుఱించి కవులలోనే రెండు మతములు ఉన్నట్లుగా తెలుస్తున్నది.

కాని నా మిత్రుడు డా॥ వడ్డేపల్లి శ్రీనివాసరావు దీనిని అంగీకరించలేదు. ఇలా అంటున్నారు.

**"స్యాత్ కిన్నరః కింపురుషస్తురంగ వదనో మయుః"**

'కింనరుడు, కింపురుషుడు, తురంగవదనుడు మయుడు' – ఇవి సమానార్థకాలు. శబ్దరత్నాకర కర్త మాఘ శ్లోకాన్ని చూపి అర్థం వివరించడంలో పాఠకుల్ని అయోమయంలో పడవేశాడు. వల్లభదేవుడు తన సందేహ విషౌషధివ్యాఖ్యలో 'ద్విధా కింపురుషాః కేచిత్ అశ్వముఖాః పురుష శరీరాః, కేచిత్ మనుష్యముఖా అశ్వ దేహాశ్చ' – అని స్పష్టం చేశాడు. అంటే కింనరులు రెండు రకాలవారు. అశ్వముఖం మానవదేహం, మానవ ముఖం అశ్వదేహం గలవారు ఉంటారని అర్థం. వ్యాఖ్యా విశేషం ఏమంటే కింనర పర్యాయమైన కింపురుష శబ్దాన్ని వాడాడు. ఎక్కడన్నా కింనర, కింపురుష అని రెండూ వాడినపుడు పై రెండు రకాల వారిని విడివిడిగా పోల్చడానికని తెలియాలి. సాధారణంగా కింనరులు – అశ్వముఖులు, కింపురుషులు – మానవ ముఖులని పండిత వ్యవహారం. ఇక సూ.ని. ఇచ్చిన అర్థ వివరణ చాలా పేదగా ఉంది. కనీసం శ.ర. ఇచ్చిన రెండు అర్థాలు ఇచ్చినా బాగుండేది. ఇది లోపమే. ఇక వసుచరిత్రకారుడు గంధర్వ శబ్దాన్ని వాడాడు. వ్యాఖ్యాత పోలిక శ్లోకం దొరికిందన్న ఉత్సాహంతో మాఘాన్ని ఉదాహరించి గంధర్వులు అశ్వముఖులని, కిన్నరులు నరముఖులని చెప్పాడు. నిజానికి మాఘ శ్లోకంలో గంధర్వ శబ్దమే లేదు. 'తురంగ వదనః' అని కిన్నర పర్యాయపదమే వాడబడింది. మరి వసుచరిత్రకారుని ప్రయోగానికి సార్థకత ఏదీ? ఇట 'గంధర్వ' శబ్దానికి దేవయోని విశేషం అని మాత్రమే అర్థం. ఆ దేవయోని ఏదంటే కిన్నరుడు అనే అయితే ఆ కిన్నరుడు అశ్వముఖం గల కిన్నరుడు. పద్యంలో కిన్నరుడని చెప్పబడినవాడు మానవ ముఖం గల కిన్నరుడు అని తెలియాలి. ఇంకా వ్యాఖ్యాత వ్యుత్క్రమము అని రాశాడు. అది సరికాదు".

డా॥ శ్రీనివాసరావుగారి వివరణ యుక్తియుక్తముగాను సమంజసంగాను ఉంది.

ఇక ఈ కావ్యములో వర్ణింపబడిన మూడవ పురము ద్వారక. ద్వారకను కూడ కవి కొంత ప్రౌఢంగా మనోహరంగా వర్ణించాడు.

**సీ. వరణాగ్రహిత సుధాకరశిలాదీధితి**
**ప్రకర చంద్రాయిత భాస్కరంబు**
**సౌధాగ్ర కామినీ సంగీత సాహిత్య**
**సమ్మోదితామరీ సముదయంబు**

**కల్పవల్లీ సుమాక్రాంత కాంతామోద**
**వాసితారామ ప్రకాశితంబు**
**లలిత శీతల తోయకలిత ప్రవాహసం**
**శోభిత క్రీడాద్రి సురుచిరంబు**

**గీ. రమ్యసౌదామనీ లతారాజమాన**
**వారకాంతా సమాచార వర్ణితంబు,**
**సరస సుందర నరవరసముదయంబు**
**భువనరుచిరంబు ద్వారకాపురవరంబు.** (వల్లవీ 2-16)

చుట్టు గోడలపైన ఉన్న చంద్రకాంత శిలల కాంతిపుంజములచే చంద్రునిగా వ్యవహరిస్తున్న సూర్యుడు కలిగినది ద్వారకానగరం. అంటే ఆ నగరములో శ్రేష్ఠమైన చంద్రకాంత శిలల చల్లదనము కారణంగా సూర్యుడు కూడ తన తీవ్రతను పోగొట్టుకొని చల్లబడ్డాడని చమత్కారం.

ఎత్తైన సౌధముల పై భాగాలలో కాంతలు ఆలపించు సంగీత సాహిత్యములతో దేవకాంతలను ఆనందింపజేయునది ద్వారకానగరం. అంటే ఆ నగరంలోని సౌధాలు దేవతలు సంచరించే ఆకాశాన్నంటుతున్నాయని, అంటే చాలా ఎత్తైనవని అర్థము.

కల్పలతల పూలతో ఆవరింపబడి మనోహరమైన సువాసనచే వాసితమైన ఆరామములతో విలసిల్లునది ద్వారకానగరము. అంటే ఆ నగరము సువాసనలు విరజిమ్మ ఉద్యానవనాలతో విలసిల్లుచున్నదని భావము.

స్వచ్ఛమైన చల్లని నీటితో కూడిన ప్రవాహములతో శోభిస్తున్న క్రీడా పర్వతాలతో మనోహరమైనది, అందాల మెరుపు తీగెల వలె మెరిసే వారకాంతలతోను, సరసులు సుందరులైన రాజకుమారులతో కూడినది. అందమైనది ద్వారకా నగరమని కవి శోభాయమానంగా వర్ణించాడు.

పురవర్ణనలలో కవి ఎక్కడా వారకాంతలను వదలిపెట్టలేదు. వారకాంతలే నగరానికి అందమన్నంత గొప్పగా సాగింది అతని వర్ణన. 1-12, 18, 54, 55, 57, 58, 60, 67; 2-16, 23, 25 మొదలైన పద్యాల నిండా వాళ్లే కన్పిస్తారు. అది జార ధర్మాసనాలనే నిర్వహించిన కాలము కనుక, వారవనితల సందడి నగరాలలోనే కాదు కావ్యాలలోను తప్పని సరి అయింది. మాడభూషి కవి ద్వారకను శృంగార రసంలో ముంచి తేల్చాడు. ద్వారకలోని రథాలను వర్ణించే సందర్భంలో-

**క. కాంచనపటుకేతనపట**
**సంచలన భవానిల ప్రశాంతభ్రచర**

**చ్చంచన్మిథున రతిశ్రమ**
**మంచిత మణిచక్రమగు రథౌఘుంబచటన్.** (వల్లవీ 2-23)

ఆ నగరంలో మణిచక్రాలతో కూడిన పెద్ద పెద్ద రథాలు ఉన్నాయి. వాటి జెండాలకు గల బంగారు వస్త్రాల రెపరెపల వలన పుట్టిన గాలులు ఆకాశంలో సంచరించే దివ్యదంపతుల రతిశ్రమను తొలగిస్తున్నాయట.

"సమున్నత హర్మ్య సౌధ ప్రాసాద చంద్రశాలాది భవనాంతర నితాంత పుంభావాంత తాంత కాంతాస్తనాంతః ప్రదేశావాంత శ్రమ సలిల సంతాన మలీమ్లుచీ భవద్గగన ధునీశీకర శీతల నందనవన మాకందమందార మంజరీ పరిమళ ఘుమఘుమితాంతర మాధవీ నికుంజ నిర్గళన్మరుత్కందళవిరాజితంబు"

ఎత్తైన హర్మ్యాలు, సౌధాలు, ప్రాసాదాలు, చంద్రశిలలు, భవనాల లోపల ఉన్న అంతఃపుర స్త్రీలు పురుషాయిత రతికేళి చేయుటవలన అలసిన వారి చనుల మధ్య పుట్టిన చెమటలను చల్లబరచు ఆకాశగంగలోని నీటి తుంపురుల చల్లదనము వలన కలిగిన నందన వనములోని మామిడి, మందార పూల పరిమళాలచేత ఘుమఘుమలాడు మాధవీలతల మధ్యనుండి వెలువడు పిల్లగాలులతో విలసిల్లునది ద్వారకానగర సౌధప్రాంతమని వర్ణించాడు. ఇలా ఈ కావ్యంలో భవనాలలోను, సౌధాగ్రాలలోను, ఉద్యానవనాలలోను కావలసినంత శృంగార రసము ఒలికింది. కాని ఆ యుగంలోని ఇతర కావ్యాలలో వలె ఇందులో శృంగార రసము బజారులో పారనందుకు సంతోషించాలి.

నాగ్నజితికి యౌవనము వచ్చినపుడు కవి సందర్భోచితంగా వసంత ఋతువును వర్ణించాడు. పక్షుల మధుర ధ్వనులతో, చివురుటాకులతో, తుమ్మెద ఝంకారాలతో వసంతము వచ్చింది. వనలక్ష్మి పండుటాకులనే అందవిహీనమైన వస్త్రాలను విడచి, ఎఱ్ఱని చివురుటాకు వస్త్రాలను ధరించింది. తుమ్మెదల రవికను ధరించింది. మాధవుని పొందు కోసము వాసక సజ్జికవలే ఎదురు చూస్తూ ఉంది. (1-40).

ఈ కావ్యనాయిక నాగ్నజితిని ధరణి దేవుల రామయమంత్రి అష్టవిధనాయికలలో వాసక సజ్జికగా (దశావతార చరిత్రము 8-260) వర్ణించాడు. వాసక సజ్జిక అంటే ప్రియుడు పడకటింటికి వస్తాడని తెలిసి పడకిల్లును సింగారించి, తాను కూడ అలంకరించుకొని ఉండే నాయిక. ఆ వనలక్ష్మిని కవి యమకంలో ఇలా వర్ణించాడు.

క. **తరుణార్తవ రీతి మనో**
**హర యౌవన రేఖ పల్లవాదృతి నలరెన్**
**దరుణార్తవ రీతి మనో**
**హర యౌవన రేఖన మరునంగన సరియై.** (వల్లవీ 1-112)

కొత్తగా పూచిన పువ్వులతో అందమైన పరువాలతో ఎఱ్ఱని చివురుటాకులతో అలరారుతూ ఉంది. అప్పుడే ఋతుస్నానం చేసి కొత్త యౌవనముతో మిసమిసలాడే మన్మథుని ప్రియురాలు రతీదేవిలాగ వనలక్ష్మి శోభించిందట.

ఆ వనంలోకి నాగ్నజితి చెలులతో వన విహారానికి వచ్చింది. ఆమె తాకగానే మామిడి విరిసింది. నవ్వగానే పొన్న పూచింది. పాడగానే ప్రియాళువు వికసించింది. ఇలా దోహదక్రియలను చేసింది. ఆ పూలన్నీ పూచాయి. ఆ వనంలో వాళ్లు మెరుపు తీగెలలాగ, వనదేవతల లాగ విహరించారు. అలసిపోయారు. ఎదురుగా ఒక సరస్సు కనిపించింది. జలక్రీడలాడుదామనుకొన్నారు. ఒంటిమీద నగలన్నీ తీశారు. అప్పుడు వాళ్లు పూలను త్యజించిన పూల తీగెలలా వున్నారట. చెలులను పిలుస్తూ నాగ్నజితి సరస్సులోకి దిగింది. ఆమెతో పాటు వాళ్లు కూడ సరస్సులోకి ఇలా దిగారు.

గీ. **లలన లవలంబితాన్యోన్య లలితకర స**
**రోజలై తేజరిల్లి సరోజలములఁ**
**జొచ్చి జలకేళి సలుపుచుఁ జోద్యముగను**
**నాటపాటల విహరించి రాదరమున. (వల్లవీ 1-130)**

ఆ జవ్వనులు మృదువైన పద్మముల వంటి చేతులతో ఒకరి నొకరు ఊతగా చేసికొని సరస్సు నీటిలోకి ప్రవేశించి, జగదేక వీరుని కథ సినిమాలోని దేవకన్యల లాగ జలకాలాటలలో ఏమి హాయిలే హలా - అంటూ ఆటపాటలతో విహరించి, చివరికి అంతఃపురానికి వెళ్లారు.

నారదుడు తీర్థయాత్రలు చేస్తూ కోసల నగరానికి వచ్చాడు. నగ్నజిత్తు కోరిక మీద శ్రీకృష్ణుని లీలా విశేషాలను, సౌందర్యాన్ని వర్ణిస్తాడు. శ్రీకృష్ణుని వర్ణించిన ఆ పద్యాలు మధురాతి మధురాలు.

మానవాః మౌళితో వర్ణ్యాః, దేవతాశ్చరణతస్తథా - అని అభిజ్ఞులు చెబుతారు. మానవుల వర్ణన శిరస్సునుండి మొదలుపెడతారు. దేవతల వర్ణన పాదాలనుండి మొదలుపెడతారు. కళాపూర్ణోదయములో పింగళిసూరన శ్రీ వేంకటేశ్వరస్వామి వర్ణనను (2-132) పాదాల నుండి మొదలు పెట్టాడు. కాని మాడభూషి కవి శ్రీకృష్ణుని మానవునిగానే భావించి శిరస్సు నుండే వర్ణన మొదలు పెట్టాడు.

క. **హాటక రుచిర మణిమయ కి**
**రీటము హరి శిరమున స్మరీచులఁ దనరెన్**
**గాటుక గుబ్బలి కొప్పునఁ**
**బాటిలు రవిబింబ మనఁగఁ బాటవమెసఁగన్.** (వల్లవీ 2-37)

బంగారమునందు కాంతులీను మణులతో పొదగబడిన కిరీటము శ్రీకృష్ణుని తలపై నల్లని కాటుక కొండపైన భాసించే భాస్కర బింబము వలె మిరుమిట్లు గొలుపుతూ ప్రకాశించింది.

**క. మృగమద తిలకము నగధరు**
**వగగుల్కు నళికము నందు వాసిగ మెఱసెన్**
**సొగసైన నగుమొగంబునఁ**
**దొగయని పైఁవ్రాలు చిన్ని తుమ్మెద యనఁగన్.** (2–38)

శ్రీకృష్ణుని సొగసైన నుదుటిమీద కస్తూరి తిలకము చిక్కని కాంతులీనుతూ ఉంది. అది ఎలా ఉంది అంటే – నవ్వుతూ కళకళలాడే ఆయన రుచిరమైన ముఖాన్ని చూచి కలువ పువ్వు అనుకొని వ్రాలే చిన్ని తుమ్మెద వలె ఉందట. కస్తూరి ఒకజాతి లేడి యొక్క అండకోశమునుండి పుడుతుంది. ఆ అశ్లీలతను నివారించడానికి దానిని నాభిజము, మృగమదము అని పిలుస్తారు. వేటగాళ్లు ఆ జింకలను చంపి కస్తూరిని సంపాదిస్తారు. అది పచ్చిగా ఉన్నప్పుడే అంటే ఆరక ముందే మంచి పరిమళాన్ని ఇస్తుంది.

**గీ. లలిత చికురాళు లధరహల్లకముపైని**
**వ్రాలునని భీతి నయ్యంతరాళమునను**
**నిశిత శర కార్ముకంబుల నిలిపె ననఁగ**
**నరయఁ గన్నులఁ గనుబొమ్మ లలరె హరికి.** (2–39)

లలితములైన ముంగురులు అనే తుమ్మెదలు క్రిందనున్న కన్ను అనే కలువపై వ్రాలతాయేమో నన్న భయంతో మధ్యలో కనుబొమ అనే విలు, చూపు అనే తూపు నిలిపినట్లుగా అలరినవి. ఇక్కడ అధరహల్లకము అంటే క్రిందనున్న కలువ. అంటే కలువ వంటి కన్ను అని అర్థము.

**గీ. తనరు మీసమ్ములను మిళిందములు దమిని**
**గన్నుఁదమ్ములపై దుముకం దలంప**
**బమ్మ విలుకాఁడు నడుమ సంపంగిములికిఁ**
**గూర్చెనన నాస సోగయై గులికె హరికి.** (2–40)

గుబురుగా పెరిగిన చక్కని మీసాలు అనే తుమ్మెదలు ఆపుకోలేని కోరికతో కన్నులనే తామరలపైకి దూకాలని అనుకొన్నాయి. అప్పుడు బ్రహ్మ అనే విలుకాడు ఆ మీసాలకు, కళ్లకు మధ్య సంపెంగ అనే బాణం సంధించి ఉంచినట్లుగా శ్రీకృష్ణుని ముక్కు పొడవుగా అందంగా శోభిస్తూ ఉంది. సంపంగి పువ్వు వాసన ఘాటుగా ఉంటుందని, అది తుమ్మెదలకు తలదిమ్ము కలిగిస్తుందని చెబుతారు. అందువల్ల తుమ్మెదలు సంపంగి

వద్దకు వెళ్లవు. ఇది చాలా అద్భుతమైన వర్ణన. కాని కృష్ణుని మీసాలు వర్ణించిన తొలి కవి ఇతడేనేమో! భద్రా పరిణయ కావ్యంలో అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి కూడ–

**సీ. హరినీల నీలాభ నలరారు మీసంపు**
**లీలవానిఁ బసిండి చేలవాని...** (3–8)

– అని మీసాలకృష్ణుని వర్ణించాడు. మద్రాసులోని ట్రిప్లికేన్‌లో ఉన్న పార్థసారథి ఆలయంలో గల కృష్ణుని మూర్తికి మీసాలున్నాయి. ఇలా కవి కృష్ణుడిని చాలా మనోహరంగా వర్ణించాడు.

కవి ఇంత అందంగా వర్ణిస్తే, ఏ లతాంగి అయినా మరులుగొనకుండా ఉంటుందా! ఇక్కడ నాగ్నజితి కూడ స్వామివారి మీద మరులుగొన్నది. విరహంలో వడింది. చెలులు శీతలోపచారాలు, ఉపాలంభనలు చేశారు. ఈ సందర్భంలో చెలులు నాగ్నజితిని ఉద్దేశించి చెప్పిన ఈ పద్యం చమత్కార భరితమయినది.

**చ. అలసుఁడు దక్షిణానిలుఁ డనంగుఁడు రాజు మయూర కోకిలల్**
**జిలుకలు పుట్టు గుడ్లు మధుసేవఁ బ్రమత్తము లాద్విరేఫముల్**
**చలువల తేఁడు నిష్కళుఁడు జాలవసంతుఁడు మీఋఁ గాన నా**
**కులతను వీరికై యడలి కొమ్మ మనోవ్యథఁ జెందుటొప్పునే.** (2–111)

మలయానిలుడు వట్టి సోమరిపోతు. అందుకే నెమ్మదిగా వీస్తూ ఉంటాడు. మన్మథుడికి అసలు శరీరమే లేదు. నెమళ్లు, కోకిలలు, చిలుకలు ఇవన్నీ కదలలేని గుడ్లుగా పుడతాయి. తేనెలు త్రాగి తుమ్మెదలు ఎప్పుడూ మత్తులోనే ఉంటాయి. చంద్రుడు వీర్యహీనుడు. కృష్ణపక్షములో రోజుకొక కళ చొప్పున తగ్గుతాడు. వసంతుడు అడవిలో ఆకులలములతో చిడిముడి పడుతూ ఉంటాడు. ఈ బలహీనులను చూసి భయపడ వచ్చునా అని చమత్కారంగా మందలిస్తూ ఓదార్చారు. నాగ్నజితి చెలులు చంద్రుడిని చమత్కారంగా ఇంకా ఇలా ఎత్తిపొడిచారు.

**గీ. లేరె మా చెలి సాటి చెల్లెండ్రు నీకు**
**నింత దయమాలి యేలెద వేల నయయొ!**
**సోదరీగేహ శోషణ చోద్యముగను**
**జేయు నీకిది చిత్రంబె శీతకిరణ!.** (వల్లవీ 2–106)

ఈ పద్యంలో ఒక చక్కని కుటుంబ సంప్రదాయము ఉంది. అన్న చెల్లెలి ఇంటిని ఎప్పుడూ చక్కబెట్టాలనే చూస్తాడు. చంద్రుడు లక్ష్మీదేవి సోదరుడు. లక్ష్మీదేవి విష్ణుమూర్తి ఇల్లాలు. విష్ణువు యొక్క అంశయే కృష్ణుడు. ఆ కృష్ణుని వలచిన నాగ్నజితి కూడా చంద్రునికి చెల్లెలి వరుసలోనిది. అది దృష్టిలో పెట్టుకొని నాగ్నజితి చెలులు ఇలా అంటున్నారు.

మా చెలివంటి చెల్లెళ్లు నీకు లేరా! అయ్యయ్యో! కొంచెము కూడ జాలీ దయలేని చుట్టరికము కదయ్యా నీది. నిజమే. లక్ష్మీదేవి నీ సోదరి. ఆమె ఇల్లు పద్మము. ఆ పద్మాన్నే అంటే ఆమె ఇంటినే చోద్యంగా శుష్కింపజేసే నీకు మా చెలి ఒక లెక్కలోనిది కాదులే – అని చమత్కారంగా ఉపాలంభించారు.

అప్పుడే హంస నాగ్నజితి ఆకులపాటును చూసింది. శ్రీకృష్ణునితో తాను మాట్లాడి, కార్యం చక్కబెడతానని ఓదార్చి వెళ్లిపోయింది. గ్రీష్మఋతువు వచ్చింది. గ్రైష్మములో పగటి సమయం ఎక్కువ. అందుకు కారణాన్ని కవి ఇలా చమత్కరించాడు.

క. **బలిమిని పశ్చిమ వాతం**
**బులకు నెదుర్కొనుచుఁ జనెడి ప్రొద్దు హయంబుల్**
**అలసటచే నల్లనఁ జన**
**నలసములై యహము లమరె నా సమయమునన్.** (2–163)

బలంగా వీస్తున్న పడమటి గాలుల తాకిడిని ఎదుర్కొంటూ వెళుతున్నందు వలన అలసిన సూర్యుని గుఱ్ఱాలు అలా అలా నెమ్మదిగా వెళుతున్నందువలన పగళ్లు అలసము లయ్యాయని కవి వర్ణించాడు. ఇది ఆముక్త మాల్యదలోని 'పడమరవెట్ట నయ్యుడుకు' (2–49) అన్న పద్యాన్ని అనుసరించినది. రాయల పద్యంలోని అందం ఇందులో రాలేదు. రాయలవారు చలివేంద్రాలలో నీళ్లందించే జవ్వనులను గాథాసప్తశతిప్రభావముతో మూడు పద్యాలలో (2–57, 58, 59) పెదాలు తడుపుకొనే టట్లు వర్ణించాడు. మాడభూషికవి కూడ ఒక పద్యంలో చలివేంద్రాన్ని వర్ణించాడు కాని దానిపై ఏ కవి ప్రభావం లేదు. అవి అతని కాలం నాటి చలివేంద్రాలు కాబోలు. రాయలవారు చల్లని మంచి నీరు మాత్రమే పోయించారు. కాని మాడభూషి కవి వట్టివేళ్ల వాసనలు కల చల్లని మంచినీరు, నిమ్మ నారింజ రసాలు, ఉప్పు కలిపిన చల్లని మజ్జిగలు, తియ్యని పానకాలు పోయించాడు. ఇవి నూజివీడు నగరంలో శోభనాద్రి అప్పారావుగారు పెట్టించిన చలివేంద్రాలు కాబోలు.

చ. **కులుకుచుఁ జల్వపందిరులఁ గొమ్మలు పాంథులకున్ బ్రియంబుగా**
**విలసదుసీర వాసనల విశ్రుత శీతల తోయధారలన్**
**సలికుచ నాగరా లవణసార మనోహర గోరసంబులన్**
**సలలిత శర్కరాంబువుల సౌఖ్యముఁ జేయుచు నుందు రెప్పుడున్.**
(2–166)

మాడభూషికవి వర్ణనలు పొదుపుగానే ఉంటాయి. గ్రీష్మాన్ని కేవలం 6 పద్యాలలో వర్ణించాడు. హంస చేసిన నాగ్నజితి వర్ణన 22 పద్యాలలో ముగిసింది. ఇందులో నాగ్నజితి

అందాలే కాదు. శబ్దార్థాలంకారాల సౌందర్యమూ తళుక్కుమంది. అందలి ఒక పద్యము-

చ. **గళమున శంఖము న్నిలిపి కచ్ఛప మంఘ్రులపైనఁ దాల్చి కుం**
**తలముల నీలముంచి సురదమ్ములఁ గుందము నావహించి జం**
**ఘల మకరంబుఁ బూని వరకంజ మహాంబుజముల్ వహించుచున్**
**గులికెడు మోవిఁ గన్నుల ముకుంద! నినుం మదిఁ జేర్చెఁ జూచితే.**

(2-214)

స్వామీ! ఆమె కంఠమున శంఖమును నిలిపింది. పాదాలలో తాబేళ్లను దాల్చింది. వెంట్రుకలందు ఇంద్రనీలమణిని ఉంచింది. దంతములందు మొల్లలు ఉంచింది. పిక్కలందు మొసళ్లను ఉంచింది. కళ్ల యందు పద్మములను ఉంచింది. మనస్సులో నిన్ను నిలుపుకొన్నదని అర్థము. అంటే ఆమె కంఠము శంఖము వంటిదని, పాదాలు తాబేళ్లవంటివని, జంఘలు మకరముల వంటివని, పెదవులు తేనెలూరుతాయని, కన్నులు పద్మముల వంటివని సామాన్యార్థము.

ఈ పద్యంలో ఒక చమత్కారముంది. ఆమె అవయవాలతో ఉపమింపబడిన శంఖము, కచ్ఛపము, నీలము, కుందము, మకరము, కంజము (పద్మము), మహాంబుజము (మహాపద్మము) ఇవన్నీ నవనిధులలోనివి. అందువలన నాగ్నజితి అందము, ఐశ్వర్యముతో బాటు - ఆతర్వాత పద్యంలో నయమొందిన అనుటవలన అణకువ కూడ కలిగినది. అందము, ఐశ్వర్యము, అణకువ కలిగిన స్త్రీ భార్యగా దొరకడం అదృష్టమని హంస భావగర్భితముగా కృష్ణునితో రాయబారం నెరపింది.

ఇందులో ఇంకొక విశేషార్థం కూడ ఉంది. విష్ణువు పాంచజన్యమును శంఖమును ధరించినవాడు. మందర పర్వతాన్ని కూర్మావతారంలో ధరించినవాడు. ఇంద్రనీలము వంటి నల్లని రంగు కలవాడు. కుందము, మకరము, పద్మము, మహా పద్మము అనునవి సంపదలు. సంపదల దేవత లక్ష్మీదేవి. ఆమె ప్రియుడు విష్ణువు. అటువంటి నిన్ను నాగ్నజితి తన మనస్సులో నిలుపుకొన్నది - అన్న విశేషార్థం కూడ ఇందులో ఉంది. ఈ చమత్కారం చేమకూర వేంకటకవి కల్పనా చాతుర్యాన్ని తలపిస్తుంది.

కథాగమనానికి అడ్డంకి అయినప్పటికి మాడభూషి కవి చేసిన వర్ణనలలో ప్రయాణవర్ణన ఒకటి. శ్రీకృష్ణుడు తన బలాలతో స్వయంవరానికి బయలుదేరినపుడు చేసిన ప్రయాణ వర్ణన 14 పద్యాలలో (3-29 నుండి 42 వరకు) కవి విపులంగా వర్ణించాడు. అందులోని ఒక సుదీర్ఘ వచనంలో రైవతక పర్వత వర్ణన (3-42) కూడ గిట్టుబాటు అయింది. రైవతక పర్వతము వద్ద విడిది చేసినపుడు మృగయులు కృష్ణుడిని వేటకు ఆహ్వానించారు. వేట 26 గద్య పద్యాలలో (3-43 నుండి 68 వరకు) విపులంగా సాగింది.

ద్వాపర యుగమునాటి ఈ కథలోని వేటలో, ఈ 19వ శతాబ్ద కవి తుపాకులు పట్టించాడు. పులిని వేటాడించాడు. మన కావ్యాలలోని వేట వర్ణనలలో వేటగాండ్ర చేత తుపాకులు పట్టించిన తొలి కవి కూడ ఇతడే. తుపాకుల ప్రస్తావన మాత్రము మొదట 16వ శతాబ్ది కావ్యాలలోనే కన్పిస్తుంది.

**ద్వి. కోవులు జబురు జంగులు ఫిరంగులును**
**బుసకోవులునుగసాబులు తుపాకులును**

(అష్టమహిషీ కల్యాణము 3-4191)

**వ. .... దంచనంబులుఁ బిరంగులు జబురు జంగులుఁ**
**దుపాకులు మొదలైన సాధనంబుల....**

(కళాపూర్ణోదయం 8-73)

16వ శతాబ్దములోనే కావ్యాలలోకి ప్రవేశించిన తుపాకికి కావ్యస్థాయిలో వేట సాధనము కావడానికి 19వ శతాబ్దము పట్టింది.

నాగ్నజితీ కృష్ణుల పెళ్లిని కవి దాదాపు 50 పద్యాలలో (3-102 నుండి 152 వరకు) వర్ణించాడు. ఇది సాధారణంగా అన్ని ప్రబంధాలలో వలె సాగినా, నాగ్నజితి నడుముకు కవి ఒడిబియ్యం (3-153) కట్టించాడు. ఇది కూడ మన ప్రబంధాల పెళ్లిళ్లలో కన్పించని కొత్త సంగతి. వధువు మెట్టినింటికి వెళ్లేటపుడు ఒడిబియ్యంతో వెళ్లే ఆచారం ఇప్పుడు కూడ ఉంది.

శ్రీనాథయుగ కావ్యాలలో కన్పించని – పెళ్లిలో జరిగే నాగవల్లి సంస్కార విశేషాన్ని మాడభూషి కవి ప్రస్తావించాడు. నాగవల్లి లేదా నాకబలి అన్నది పెళ్లిలో చివరి రోజు జరిపే ఒక సంస్కార విశేషము. ఎఱ్ఱన్నం, నల్లన్నం దిష్టితీసి, ముప్పైమూడు కోట్ల దేవతలను ప్రసన్నం చేసికోవడం కోసం చేసే వసంత మాధవ పూజ ఇది. నాగ అంటే పాము. వల్లి అంటే పూజ. సర్పాకారపు ముగ్గులు వేసి 5 రకాల చూర్ణాలతో దేవతాహ్వానాన్ని జరపడాన్నే నాగవల్లి లేదా నాకబలి అంటారు. శ్రీనాథాదుల కావ్యాలలో దీని ప్రస్తావన లేదు. ఇది 15వ శతాబ్దము ఉత్తరార్ధములో పుట్టిన ఆచారము. మాదయగారి మల్లన దీనిని మొదట (రాజశేఖర చరిత్ర 3-174) ప్రస్తావించాడు. దీనినే పింగళి సూరన నాకబలి (కళాపూర్ణోదయము 7-83) అన్నాడు.

నాగ్నజితీ కృష్ణులు పుట్టినింటినుండి మెట్టినింటికి వెళ్లునపుడు ద్వారక సమీపంలో విడిది చేశారు. నగర ప్రవేశం చేసే ముందు ఊరిబయట కొంతసేపు విశ్రమించడం ఆచారం. భాసుడు కూడ 'అథచ ఉపోపవిశ్య ప్రవేష్టవ్యాని నగరాణీతి సత్సముదాచారః' (ప్రతిమ) అని చెప్పాడు.

ఇక్కడ మాడభూషి కవి యాదవులతో మధుపానము (3-170 నుండి 173) చేయించాడు. ఇది కూడ ఇక్కడ అనవసరమైన వర్ణనమే. అయితే ముచ్చటగా మూడు పెగ్గులలో కాదు కాదు మూడు పద్యాలలో ముగించాడు.

నాగ్నజితీ కృష్ణుల పురప్రవేశము, పెద్దల ఆశీస్సులు, సంబరాలు ముగిశాయి. ఆ రాత్రి వధూవరుల తొలి సమాగమము (3-204 నుండి 212 వరకు) జరిగింది. తెల్లవారింది. సంభోగానంతరము బయటకు వస్తున్న వధూవరులను వర్ణించిన, తెలుగు కావ్యాలు లేవు. కవి కర్ణ రసాయనంలో దీని ఆనవాళ్లు కొన్ని కన్పిస్తాయి. అన్నమయ్య క్షేత్రయ్యలను మినహాయిస్తే మన కావ్యాలలో ఆ వర్ణనలు లేవు. ఈ వర్ణనలను చేసిన తొలి ప్రబంధ కవి కూడ మాడభూషి నరసింహాచార్యులే. కేళీ గృహము నుండి బయటకు వస్తున్న కృష్ణుడిని కవి ఇలా వర్ణించాడు.

సీ. **అతివ చన్బంతుల నలరారు కస్తూరి యురముపై శ్రీవత్స సరణి మెఱయ**
**సురత జాగరముచే సొక్కిన కన్దోయి వారిజాకృతి నొంది వన్నెకెక్కఁ**
**గల్కి పన్మొనలచేఁ గందిన కెమ్మోవి బింబ ఫలస్ఫూర్తి దంబు మీఱఁ**
**గాంత కస్తురి తిలకంబంటి యాననం బేణాంక తులితమై యింపు మీఱ**
**నెలఁత మణిహారముల నొక్కులెలమిమేన,**
**లలిత వనమాలికాచిహ్నములన వెలయఁ**
**గాంతపై మోహసంభృత స్వాంతుఁ డగుచుఁ,**
**గేళి సదనంబు వెడలె గోపాల మౌళి.** (3-217)

నాగ్నజితి చనులపై ఉన్న కస్తూరి కృష్ణుని ఉరము మీద శ్రీవత్సము వలె మెరిసింది. రతికేళిలో రాత్రంతా నిద్రలేకపోవుట వలన అలసిన కనుదోయి ఎరుపెక్కిన పద్మాలవలె ఉన్నాయి. ఆమె పలుగాట్లవలన కందిన ఎఱ్ఱని పెదవి దొండపండు కాంతులను అతిశయించింది. ఆమె నుదుట ధరించిన కస్తూరి తిలకము అంటుకొని ముఖము చందమామ వలె ముచ్చటగా ఉంది. ఆమె మణిహారాల నొక్కులు ఆయన శరీరంపై ధరించిన వనమాలికల గుర్తుల వలె ఉన్నాయి. ఆమె మీద మోహము నిండిన మనస్సుతో కృష్ణుడు కేళీగృహము నుండి వచ్చాడు. కొత్త అందాలతో కృష్ణుడిలా వస్తే, నాగ్నజితి అలసటతో ఎలా వచ్చిందో చూడండి.

ఉ. **వాడిన పూలదండలను వాతెఱ నంటిన పంటి గంటులన్**
**వీడి చెలంగు పెన్నెరుల వేకువనిద్దురఁ దేరు కన్నులన్**
**బ్రోడజెలంగి మన్మథుని పోరున దస్సినరీతిఁ దెల్పుచున్**
**జేడియ యంగభాగములఁ జేతులు వైచుచు వచ్చె సొక్కుచున్.** (3-221)

వాడిపోయిన పూలదండలతో, పెదవిపైన ఉన్న పంటి గాటులతో, కొప్పు వీడి చెల్లాచెదురైన వెంట్రుకలతో, వేకువజాము అరకొర నిద్రతో తేలిపోతున్న కన్నులతో, మన్మథ యుద్ధంలో నేర్పుతో పోరాడి అలసిపోయిన విధము తెలుపుతూ ఉండగా చెలికత్తె భుజాలపై చేతులు వేసి పారవశ్యముతో నాగ్నజితి కేళీ గృహము నుండి వచ్చింది. అవును ఏ పోరాటములోనైనా గెలుపునే కోరుకొంటారు. కాని తియ్యని పోరాటములో ఓటమినే కాంక్షిస్తారు. ఈ శృంగార కావ్యంలో కొత్త కొత్తగా కనిపించే పద్యాలివి.

ప్రబంధ వర్ణనలలో దౌత్యము ఒకటి. కవి దీనిని రెండు చోట్ల నిర్వహించాడు. నాగ్నజితి అందము వర్ణించి, కృష్ణునికి ఆమెపై మరులుగొనునట్లు చేసిన హంసరాయబారము, కృష్ణుడు నగ్నజిత్తు వద్దకు నాగ్నజితిని అడిగించుటకు పంపిన అర్జున రాయబారము. వీటిలో హంస రాయబారము పర్వాలేదు కాని అర్జున రాయబారము పేలవము. అర్జునదౌత్యము లేకపోయినా కథకు లోపము ఉండదు. హంస రాయబారము శృంగారనైషధములోని హంస రాయబారమును పోలినది. అందులో 4 పద్యాలలో (2-214, 216, 218, 219) హంస వాక్చమత్కారాన్ని ప్రదర్శించి, తాను శ్రీనాథుని హంసకే మాత్రము తీసిపోనని నిరూపించుకొంది. ఈ హంస నేర్పరితనమంతా ఈ నాల్గు పద్యాలలోనే కన్పిస్తుంది.

నారద పాత్రను సృష్టించి కవి రెండు ప్రయోజనాలను సాధించాడు. అవి ప్రబంధ వర్ణనలలో ఒకటైన తీర్థయాత్ర వర్ణన, కథానాయకుని వర్ణన. తీర్థయాత్రలలో నారదుడు దర్శించిన పుణ్యక్షేత్రాలన్నీ ఆంధ్రదేశం లోనివే. ఉభయ కావేరుల మధ్య ఉన్న శేషసాయిని, శ్రీరంగనాథుని, కంచి వరదరాజస్వామిని, తిరుమలలోని వేంకటేశ్వరస్వామిని, భద్రాచలంలో రాములవారిని, సింహాచల నరసింహస్వామిని, పూరిలోని జగన్నాథస్వామిని మాత్రమే కాకుండా ఆగిరిపల్లెలో కొలువైన నూజివీడు ప్రభువుల ఇలవేల్పు అయిన శోభనాచల లక్ష్మీనృసింహస్వామిని కూడ నారదుడు దర్శించినట్లుగా కవి వర్ణించాడు. ఇది మాడభూషికవియొక్క స్వస్థాన వేష భాషాభిమానాన్ని తెలియజేస్తుంది.

**సామెతలు పలుకుబడులు :** సామెతలు, పలుకుబడులు భాషకు అందాన్నిస్తాయి. తిక్కన, నాచన సోముడు, పింగళి సూరన, సవరం చిననారాయణ, ఘట్టు ప్రభువు మొదలైన కవులు వీటిని బహుళముగా వాడి తమ కావ్యాలకు జీవదీప్తిని తెచ్చారు. మాడభూషి కవి కొలదిగానే వీటిని ప్రయోగించాడు. అవి –

సిగ్గు నోరెత్తనీయదు (2-62); వికవికలాడుట (2-62); పనులు చక్కసేయంగ నేర్తురే (2-62); చిన్నారి పొన్నారి (1-91); కన్నులఁగట్టిన విధము (2-79); పాలుఁ బోసి త్రాఁచు పాములఁ బెంచిన పగిది (2-108); అందరాని పండ్ల కాసించు (2-153); పెన్నిధిఁ గన్న పేద చందంబున (3-22); అడుగులకు మడువు లొసంగుచు (3-118);

వీనులకు విందు సల్పగ (3-228); తేనె పూసిన తరవారి (2-108); కన్నుల చల్లఁగా (2-58); కన్నులారగ గంటే (2-83); కన్నుల కర్పుదీర (2-140) మొదలగునవి.

అడుగులకు మడుగులొత్తుట - అన్నది ఒక పలుకుబడి. మహానుభావులు నడిచే దారిలో వారి పాదాలు కందకుండా మెత్తని వస్త్రాలు పరిచే సంప్రదాయాన్ని అడుగులకు మడుగులొసగుట అంటారు. తరువాతి కాలంలో అది అతివినయానికి సంబంధించిన పలుకుబడిగా మారింది. కాని ఈ కావ్యంలో6 అది పలుకుబడిగా గాక సంప్రదాయంగానే ప్రయోగింపబడింది.

తేనె పూసిన తరవారి అంటే తేనె పూసిన కత్తి. ఇనుప కత్తికి తుప్పు పోవడానికి తేనె పూస్తారు. తేనె ఉంది కదా అని దానిని నాకితే నాలుక కోసుకు పోతుంది. పైకి తియ్యగా మాట్లాడుతూ లోపల గోతులు తీసేవారిని తేనె పూసిన కత్తి అని అంటుంటారు. అంటే మోసగాళ్లు, నయవంచకులని అర్థం. హరిభట్టుకవి దీనిని మధుచ్ఛన్న సురియ (ఉత్తర నారసింహ పురాణము 5-137) అని సంస్కృతీకరించాడు.

**కవి యొక్క శాస్త్ర వైదుష్యము :** మాడభూషి కవి బహుశాస్త్ర పారంగతుడు. అయినప్పటికి తన శాస్త్ర పాండిత్యాన్ని ప్రబంధము నిండా పులమలేదు. అవసరమైనంత మేరకు మాత్రమే ప్రదర్శించాడు. కావ్యం వ్రాయమని శోభనాద్రి అప్పారావు కవి చేతులను తన చేతులలోకి తీసికొని అర్థించినప్పుడు ఆ రాజు చేతులలో 'కమల శంఖ రథాంగ రేఖల చెలంగు' తున్నాయని కవి వర్ణించాడు.

పురుషుల చేతులలో పద్మ, శంఖ, చక్ర రేఖలుండుట శుభలక్షణము. భోజచంపువులో శ్రీరాముని హస్తరేఖల ప్రస్తావన ఇలా ఉంది.

**రేఖారథాంగసరసీరుహశంఖచిహ్నౌ ।**
**క్షేమంకరే తవ కరే జగతాం త్రయాణామ్ ॥** (అయోధ్య 54)

శంఖము, చక్రము, పద్మము రేఖలు కలిగినది, మూడు లోకాలకు క్షేమంకరమైన నీ కరము' - అని కౌసల్య దుఃఖంతో రాముని స్మరించుకొన్నట్లుగా భోజుడు వర్ణించాడు.

నాగ్నజితి గళాన్ని వర్ణిస్తూ కవి - కలవాణి వగగుల్కు గళదరమ్మునకు మంగళరేఖ లపరంజి కట్లు అయ్యాయని (ఆమె శంఖము వంటి గళమునకు మంగళ రేఖలు బంగారు కట్లు వలె ఉన్నాయని) వర్ణించాడు. కంఠం మీద మూడు రేఖలు ఉండుట" సౌభాగ్య లక్షణమని సాముద్రిక శాస్త్రం చెబుతుంది.

**లలాటే గళే చైవ మధ్యే చాపి వళిత్రయమ్**
**స్త్రీ పుంసయోరిదం జ్ఞేయం మహాసౌభాగ్యసూచకమ్**

నుదుటియందు, కంఠమునందు, నడుమునందు స్త్రీ పురుషులకు మూడు రేఖలుంటే మహాభాగ్యం కలుగుతుందని సాముద్రిక శాస్త్రము. అందువలననే కవులు స్త్రీ పురుషుల గళాలను శంఖంతో పోల్చి, మంగళరేఖలను ప్రస్తావిస్తారు.

శ్రీకృష్ణుని పాదాలకు శంఖ, చక్ర, ధ్వజ, పద్మాది దివ్య చిహ్నాలుంటాయి. కవి ఆ స్వామి వారి పాదాలను ఇలా వర్ణించాడు.

గీ. **దర రథాంగ వరాంకుశ ధ్వజసరోజ**
**కులిశ హల ముఖ్య రేఖలఁ జెలువునొంది**
**సరసిజారుణ కోమల గరిమ నలరి**
**చరణ యుగళంబు తనరారు మురహరునకు.** (2-43)

శంఖ, చక్ర, అంకుశ, ధ్వజ, పద్మ, వజ్ర, హలాది రేఖలతో ఎఱ్ఱని మృదువైన పద్మముల కాంతులతో స్వామివారి పాదాలు ప్రకాశిస్తున్నాయని కవి శాస్త్రము ప్రకారము వర్ణించాడు.

అరికాలిలో వజ్ర, అంకుశ, శంఖ, పద్మాది శుభరేఖలు గలవారు చక్రవర్తులు, సార్వభౌము లవుతారని సాముద్రిక శాస్త్రము చెబుతుంది.

క. **హల కులిశ కలశ తోమర**
**జలచర జలజాత శంఖ చక్రచ్ఛత్రో**
**జ్జ్వల లాంచన కరపదములు**
**గల యాతఁడు ధరణినేలుఁ గడునొప్పారున్.**

– సాముద్రిక శాస్త్రము 1-66.

ప్రబంధకవులు చాలావరకు స్వామివారి అలంకారాలను వర్ణించినవారే కాని మాడభూషి కవివలె అంగాంగ వర్ణన చేసిన వారు కొద్దిమందే. మన కవి స్వామివారిని సంప్రదాయము ప్రకారము మనోహరంగా వర్ణించాడు. ఇందులో అతని సాముద్రిక శాస్త్రజ్ఞానము తెల్లమవుతున్నది. 1 ఆశ్వాసము 61 పద్యము, 2వ ఆశ్వాసము 47 పద్యము, 3వ ఆశ్వాసము 5వ పద్యములలోను మాడభూషి కవి జ్యోతిశ్శాస్త్ర జ్ఞానము కూడ తెల్లమవుతున్నది.

**నాటి సాంఘిక విషయాలు :** ఈ కావ్యము సుమారు 180 సం॥ల క్రితము వ్రాయబడింది. నేటి కాలానికి అది కొంత సమీప కాలమే. పురాణ కథను పురాణ కథగా చెప్పదలుచుకొన్నందున ఆ నాటి సాంఘిక వాతావరణం ఇందులో అంతగా ప్రతిఫలించలేదు. అయినప్పటికి ఇందులో కొన్ని విశేషాంశాలున్నాయి.

మధ్యయుగములో స్త్రీలపై సామాజిక ఆంక్షలు పెరిగాయి. పుత్రుడు పున్నామ నరకాలనుండి తప్పిస్తాడని శాస్త్రాలు చెప్పినందున పుత్రసంతానం పట్ల అపేక్ష పెరిగింది. స్త్రీల పట్ల వివక్ష పెరిగింది. కంటే కొడుకునే కనాలి – అనుకొనే రోజులలో మాడభూషి కవి నగ్నజిత్తు భార్య ద్వార – కొడుకు లెందరున్నా కూతురును కనని కడుపు కడుపే కాదని వాపోయిందని ఇలా చెప్పించాడు.

చ. **తనయులు పెక్కు గల్గినను దన్వికిఁ బుత్రిక పుట్టకున్న ని**
**త్తనువు నిరర్థకంబని యెదం దలపోయుదు రింతులు.** (1–74)

కొడుకులెందరు పుట్టినా స్త్రీకి కూతురు పుట్టకపోతే ఆ శరీరము నిరుపయోగ మని స్త్రీలు తలపోస్తారని బాధపడింది. మహాభారతంలో గాంధారి కూడ నూరుమంది కొడుకులు పుట్టినా కూతురు కావాలని బలంగా కొరుకొంది.

శ్లో॥ **తతో దౌహిత్ర జాల్లో కాద బాహ్యాఽ సౌపతిర్మమ ।**
**అధికా కిల నారీణాం ప్రీతిర్జామాతృజా భవేత్ ॥**

శ్లో॥ **యది నామ మమాపి స్యాద్ దుహితైకా శతాధికా ।**
**కృతకృత్యా భవేయం వై పుత్రదౌహిత్రసంవృతా ॥**

శ్లో॥ **యది సత్యం తపస్తప్తం దత్తం వాప్యథ వాహుతమ్ ।**
**గురవస్తోషితా వాపి తథాస్తు దుహితా మమ ॥**

– ఆదిపర్వము 115 అధ్యాయం 11, 12, 13 శ్లో.

దౌహిత్రులవల్ల తన భర్తకు ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి. ముఖ్యంగా స్త్రీలకు కన్నబిడ్డల మీద కన్నా కూతురు బిడ్డలమీదే ప్రేమ ఎక్కువగా ఉంటుందని, పైగా పుత్ర దౌహిత్రుల మధ్య తాను ఆనందంగా ఉండవచ్చునని అనుకుంటూ తాను ధర్మపరాయణురాలైతే, తపోహోమ దానాసక్తురాలయితే, గురు జనానురక్తి గలదైతే కొమార్తె కలిగి తీరాలి – అని గట్టిగా గాంధారి కోరుకొంది.

కూతురును గుండెలమీద కుంపటిగా భావిస్తున్న ఆధునిక కాలంలో సాంకేతిక పరిజ్ఞానం విచ్చలవిడిగా పెరిగి, పిండదశలోనే స్త్రీ సంతానాన్ని చిదిమేస్తున్న నవనాగరికులకు ప్రాచీన సమాజంలోని ఈ ఉదాత్తభావాలు కనువిప్పును కలిగించాలి.

ఆనాటి సమాజం స్త్రీని వైదికవిద్యలకు, సాధారణ విద్యలకు దూరం చేసింది. అయినా మాడభూషి కవి – నాగ్నజితి కావ్యనాటకాలను నేర్చినట్లు, సంగీత సాహిత్యాలలో నిష్ణాత అయినట్లుగా – స్పష్టంగా స్త్రీ విద్యను సమర్థించాడు.

స్త్రీని ప్రకృతి స్వరూపిణిగా చెబుతారు. ప్రకృతి త్రిగుణాత్మకము. సత్త్వ, రజ,

స్తమో గుణాలు స్త్రీ అన్న పదంలోనే (సకారం, తకారం, రకారం) ఉన్నాయి. ప్రాచీన వైదిక కాలంలోనే స్త్రీలు పరావిద్య, అపరావిద్యలు గురుకులంలోనే అభ్యసించేవారు. యుద్ధ విద్యలలోను ఆరి తేరేవారు. విశ్వల – అన్న వీరవనిత యుద్ధంలో కాలు పోగొట్టుకొంటే అశ్వినులు ఆమెకు ఇనుపకాలు అమర్చారట. ముద్గలుని భార్య యుద్ధంలో భర్తకు రథసారథి అయి విజయాన్ని చేకూర్చింది. ఇలా ఎన్నెన్నో గాథలు.

క్రీ.శ. 7వ శతాబ్దంలో మీమాంసా పండితుడైన మండన మిశ్రుని భార్య ఉభయభారతి – తన భర్తకు ఆదిశంకరాచార్యులతో జరిగిన పండిత వివాదంలో న్యాయనిర్ణేత్రిగా ఉందని చరిత్ర చెబుతుంది.

మధ్యయుగంలో ఆమెపై ఆంక్షలు పెరిగి వైదిక విద్యలకు దూరమయింది. తెలుగు కావ్యాలలో స్త్రీవిద్యా ప్రశంసను మొదట నన్నిచోడుడు (కుమార సంభవం 3–38) చేశాడు. ఉష – సరస కవితఁ జెప్ప జదువనేర్చి సకల కళల యందు జాణ యయ్యె' నని నాచన సోముడు చెప్పాడు. అనంతుడు కూడ (భోజరాజీయము 3–153) స్త్రీ విద్యను చెప్పాడు. రామరాజ భూషణుడు బాలికా పాఠశాలలను (హరిశ్చంద్ర నలోపాఖ్యానము 4–13) ప్రస్తావించాడు. మహాభారతం స్త్రీలు రాజ్యార్హలని (శాంతి పర్వము 1–289) చెప్పింది. క్షీణయుగంలో మల్హణ చరిత్ర, వల్లవీ పల్లవోల్లాసము వంటి కొద్ది కావ్యాలు మాత్రమే స్త్రీ విద్యను ప్రశంసించాయి.

నాగ్నజితి బాల్యంలో ఆడుకున్న ఆటలన్నీ ఆకాలం నాటివే. బొమ్మల పెళ్లిళ్లు, వెన్నెల కుప్పలు, ఓమన గుంటలు, చదరంగము, పావురాల ఆట మొదలుగా ఆమె ఆడిన ఆటలు ఇప్పటికీ సజీవంగానే ఉన్నాయి. పావురాల ఆట నవనాథ చరిత్ర సారంగధర కావ్యాల్లో కన్పిస్తుంది. రసికజనమనోభిరామంలో పావురాల టపా ప్రస్తావన ఉంది. ఆ తర్వాత కావ్యాలలో ఎక్కడా దాని ప్రస్తావన లేదు. వల్లవీ పల్లవోల్లాస కావ్యంలోనే కన్పిస్తుంది.

ఆనాటి వేటగాళ్లు వేటలో తుపాకులను ఉపయోగించేవారు. ఆనాటి చలివేంద్రాలలో దాహం తీరడానికి వట్టివేరు కలిపిన చల్లని మంచినీళ్లే కాక, నిమ్మరసం, ఉప్పు కలిపిన చల్లని మజ్జిగ, పానకాలు కూడ ఇచ్చేవారు. మహతాబు చీరలు, స్త్రీల నాట్యశాలలు, స్త్రీల పావురాల ఆటలు మొదలైన విశేషాలు ఈ కావ్యంలో కన్పిస్తాయి.

వాద్యములు చతుర్విధములు.

**తతం వీణాదికం వాద్య, మానద్ధం మురజాదికమ్**
**వంశాదికం తు సుషిరం, కాంస్య తాళాదికం ఘనమ్**
**చతుర్విధ మిదం వాద్యం, వాది త్రాతోద్య నామకమ్**

తతము, ఆనద్ధము, సుషిరము, ఘనమని వాద్యములు నాలుగు రకాలు. కాని మాడభూషి కవి - 'పంచ వాద్యంబులు పరిఢవిల్ల' (3-116) అని ప్రయోగించాడు. భేరి, కాహళము, పటహము, శంఖము, జయఘంట - ఈ ఐదింటిని పంచమహావాద్యాలంటారని డా॥ వుయ్యూరి లక్ష్మీనరసింహారావుగారి వివరణ.

**లాక్షణికాంశాలు :** వల్లవీ పల్లవోల్లాస రచనా కాలము (1835) నాటికి బాల వ్యాకరణము (1856) పుట్టలేదు. తెలుగు వ్యాకరణానికి మూలమనదగిన ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకము, పాణినీయము మొ॥న సంస్కృత వ్యాకరణ గ్రంథాలు సాహిత్య విద్యార్థులు చదువుకొనేవారు. తెలుగులో అప్పకవీయము ప్రామాణికంగా ఉండేది. ప్రౌఢ వ్యాకరణ ప్రయోగాలు చేయనప్పటికి మాడభూషి కవి పాండిత్యమంతా సంస్కృత వ్యాకరణాల మీద ఆధారపడినదే. అందువలననే ఈ క్యావంలో లాక్షణిక వికారాలు కన్పించవు. అందరు కవులలానే ఒకటి రెండు స్వచ్ఛంద ప్రయోగాలు చేశాడు చూడండి.

1. పన్నగ రాజుకు (నగాగమ లోపము) 1-59. ప్రౌఢవ్యాకరణం దీనిని సమర్థించింది.
2. సుదంతని - అకారసంధి (1-90)
3. ..... సత్త్వముల్, అబ్బురమైన (సంధిలేమి) (2-24); గంగనుకాసె = గంగ+అనుకాసె (తిముక్త 2-9)
4. పైనము (పయనము అనుటకు) 3-17
5. కొంగు ముండ్లు (కొంగు ముడులు అనుటకు) 3-145
6. నీండ్లు (నీరు, నీరులు, నీళులు అనుటకు) 2-122
7. మంగళారతులు 3-149
8. తనయులు పెక్కు (పెక్కురు అనుటకు) 1-74
9. కడిమిన్, ఆ చుక్కల దొర (సంధిలేమి) 2-114
10. మీఱన్, అవ్వనితామణి (సంధిలేమి) 2-212
11. సన్నుతించుచున్ (సన్నుతింపుచున్ అనుటకు) 1-75
12. సరము (సరస్సు అనుటకు) 2-20

**యతులు :**

గీ. **రాగములఁ బాడుచుం దనరారు నెపుడు** (1-95) అఖండయతి.

రేఫ ఱకారాలకు యతిప్రాసమైత్రులు లాక్షణిక సమ్మతం కాదు. 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం, రయోస్తు నిత్యం స్యాత్' - అని ఆంధ్రశబ్ద

చింతామణి. మాడభూషి కవి రేఫలను కలిపాడు.

గీ. **మఱియు పాయని దేగల మురిపెములను** (3-59)

అభేదయతిలో 'ర-ల' యతిని కూడ లాక్షణికులు అంగీకరించరు. మాడభూషి కవి ఈ యతిని కూడ ప్రయోగించాడు.

క. **రంగల రఁగ శౌరి కిరుగెలంకుల వేడ్కన్** (3-34)

క. **సా, రథులు నడుప రవుల వలెఁ జెలంగి భోజ మహా, రథికులు** (3-35)

సీ.పా. **లేమకు గడియలారీతిఁ దోఁచె** (3-82)

ఈ యతులు మాడభూషి కవియే కాదు. ప్రసిద్ధులైన రామరాజ భూషణుడు, శ్రీనాథాదులే ప్రయోగించి ఉన్నారు.

1. **రాయంచ కాళ్లఁ దౌలకయ మున్న** (వసుచరిత్ర 4-25)

2. **లీలాహాస్య కళాప్రసంగముల నుద్రేకించి** (కాశీఖండము 6-20)

"రలయోరభేదః" - అన్న ప్రమాణాన్ననుసరించి కవులీ ప్రయోగాలను చేశారు.

భావుకత, రసపోషణ, వర్ణనా చమత్కృతి, పదవిన్యాసము - వీటన్నిటి కలయికను కవితాశైలిగా భావించవచ్చును. ఇటువంటి రసపోషితమైన శైలి మనుచరిత్ర తొలి మూడాశ్వాసాలలో నిండుగా కనిపిస్తుంది. మనువును మించవలెనన్న సంకల్పముతో పుట్టిన వసుచరిత్రలో రసపుష్టి, పదపటిమ, శ్రావ్యత మనువుకన్నా మిన్నగా ఉన్నా, అనవసరమైన శ్లేషలు, సంగీతం కోసం పుట్టిన అక్షర నియమాలు వంటి అసహజములైనవి చోటు చేసుకోవడం వలన అందులో ఉత్తమస్థాయి కవిత్వము మసకమసకగా కన్పిస్తుంది. అయినా పండితులలో మనువు కన్నా వసువు పైనే పిసరంత ఎక్కువ ఆధారము కన్పిస్తుంది. కవిజనరంజనము, కవిరాజ మనోరంజనము, రసికజనమనోభిరామము, శకుంతలా పరిణయము మొదలైన పిల్లవసుచరిత్రలు పుట్టాయి.

మనుచరిత్రలోని రసస్ఫోరకమైన కవిత్వశైలికి ముచ్చటపడి పుట్టిన కావ్యాలు కూడ కొన్ని కన్పిస్తాయి. అవి అనిరుద్ధచరిత్రము (కనపర్తి అబ్బయ్య), పాంచాలీ పరిణయము (కాకమాని మూర్తికవి), శశాంక విజయము (శేషము వేంకటపతి) మొదలైనవి. వీటిని పిల్లమనుచరిత్ర లనవచ్చును. వీటిలో వల్లవీపల్లవోల్లాసము కూడా చేర్చవచ్చును. ఇవి మనుచరిత్ర కవితాశైలిని పుణికిపుచ్చుకొన్నాయి. కాని అందలి పద్యరచనలోని జిగిబిగిని శశాంకవిజయము తప్ప మిగిలినవి అందుకోలేకపోయాయి.

మనుచరిత్ర తొలి మూడాశ్వాసాలలో కన్పించే రసపోషితమైన శైలి

వల్లవీపల్లవోల్లాసములో ఆద్యంతమూ కన్పిస్తుంది. రసనిర్భరమైన వర్ణనలు, వర్ణనలకు తగిన పదబంధాలు, పదబంధాలలో సౌకుమార్యము, మార్దవము, శ్రావ్యతలు ఈ కావ్యంలో సొగసుగా విచ్చుకొన్నాయి. ఉవిద మేనిలతకు వయసు వసంతకాలంబు కాఁగ (2-181) వంటి భావగర్భిత చరణాలు మనస్సును మురిపిస్తాయి.

ఇంత చక్కని కావ్యంలో నాకు ఒందురెండు చోట్ల సందేహాలు కలిగాయి. కోసలపురవర్ణనలో కవి – మధ్యాహ్నమును వర్ణించిన తర్వాత వెనువెంటనే శరత్తులోని నక్షత్రాలు ముత్యాలరాశిలాగ సాలవృక్షపు కొమ్మల మధ్యనుండి కన్పిస్తాయని (1-63) రాత్రిని స్ఫురింపజేశాడు. తర్వాత పద్యంలో ప్రాకారాలు స్పష్టంగా సారివృక్షపు కొమ్మలచేత విభజించబడడం వలన సూర్యుని రథము ఏ అడ్డంకి లేకుండా వెళుతుందని వర్ణించాడు. ఇక్కడ క్రమము తప్పింది.

అట్లే పెండ్లిపీటలమీద నాగ్నజితీ కృష్ణులను కవి –

**పొంగుచున్ హరి పెండిపీటను బొల్తితో వసియింపఁగా** (3-149)

అని వర్ణించాడు. ఇక్కడ పొలతి నవవధువైన నాగ్నజితి పొలఁతి అంటే పదవ్యుత్పత్తి ప్రకారము రజస్వల, అశూచితమైన ఆడుది అని అర్థము. కనుక ఇక్కడ ఈ పదానికి సందర్భశుద్ధి లేదు.

**ప్రతులు – ముద్రణ – పరిష్కరణ :** మాడభూషి వారి వల్లవీ పల్లవోల్లాస కావ్యానికి చాలా ప్రసిద్ధి వచ్చింది. పైగా రాజాశ్రయం లభించుట వలన ప్రతులు కూడ పుట్టాయి. ఆ కీర్తి బ్రౌన్ దొరగారి కాలేజిని తాకింది. ఆ రసజ్ఞుడు దీనికి కాగితపు ప్రతులు వ్రాయించాడు. ఇప్పుడా వ్రాత ప్రతులు రెండు మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉన్నాయి.

ఈ కావ్యం మొదట శ్రీవైజయంతి పత్రికలో సీరియల్‌గా వచ్చింది. ప్రాచీన తాళపత్ర గ్రంథాలను అచ్చువేసి లోకానికి అందించాలన్న తపనతో పుట్టిన పత్రికలలో వైజయంతి పత్రిక ఒకటి. దక్షిణాది నుండి మొదటిసారి కాంగ్రెస్ అధ్యక్ష పదవిని అధిష్ఠించిన పనప్పాకం అనంతాచార్యులవారు దీనిని 1892 జనవరిలో ప్రారంభించారు. మానవల్లి రామకృష్ణకవి ఇందులో గ్రంథసమీక్షలు చేసేవారు. నృసింహ పురాణము (ఎఱ్ఱన), అనిరుద్ధ చరిత్ర (కనపర్తి అబ్బయ), శకుంతలా పరిణయము (కృష్ణకవి), రుక్మిణీ పరిణయము (కూచిమంచి తిమ్మకవి) మొదలగు కావ్యాలను తాళపత్ర ప్రతుల నుంచి తొలిసారిగా ముద్రించిన దీపత్రికయే.

వైజయంతిలో సీరియల్‌గా వచ్చాక అనంతాచార్యులవారు 1894లో

జి.రామస్వామి శెట్టి అండు కంపెనీవారి ముద్రాక్షరశాలలో అచ్చువేసి గ్రంథంగా ప్రకటించారు. ఇది సలక్షణమైన ముద్రణ. చాలా వరకు అచ్చుతప్పులు లేకుండా ముద్రించారు. సమీపకాల ప్రబంధం కావడంతో పాఠాంతరాలు కూడ లేవు. కొందఱు విమర్శకులు ఉదాహరించిన పద్యాలలో ఒకటి రెండు పాఠాంతరాలు కన్పిస్తాయి కాని అవి గణించదగినవి కావు.

అయినప్పటికీ ఒందురెండు జారుపాటులు కన్పించాయి.
షష్ఠ్యంతాలలో ఒక పద్యంలో రెండు మాత్రలు లోపించాయి.

క. **శోభన ఘృణిశోభిత మణి**
**శోభన మందిరునకు సురసేవ్యునకున్** (1-48)

ఇందులో రెండవ పాదంలో రెండు లఘువులు లోపించాయి. దానిని శోభన మందిరునకు (శ్రిత) సురసేవ్యునకున్ - అని పూరించాను. నా పూరణను బ్రాకెట్లులో ఉంచాను.

నాగ్నజితీ కృష్ణుల సంభోగ శృంగారంలో-

గీ. **కలికిరో! కౌతుకమున లేఁగౌను నంద**
**గులుకు పుక్కిటఁ బిరుదులఁ గోర్కెదీరఁ**
**గరము కరమూన కున్నను గలదె నాకుఁ**
**దలఁప భువనత్రయాధిపత్యము మృగాక్షి!.** 3-209

నీ లేత నడుము, అందలి కులుకుబొడ్డు, పిరుదులు తనివితీర తాకనిచో నాకు భువనత్రయాధిపత్యము ఉండదు - అని కృష్ణుడు అంటున్నాడు. నాయిక నడుము, పొక్కిలి, పిరుదులను - స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలతో పోల్చాడు కవి.

ఇక్కడ కులుకు పుక్కిట - అన్న పాఠము అర్థరహితము. దీనిని కులుకు పొక్కిట - అని దిద్దాను.

కృష్ణుడు నాగ్నజితిని పెండ్లి చేసికొన్న సందర్భంలో శత్రురాజులు దండెత్తారు. యాదవ సైన్యము సిద్ధమైన సందర్భంలో -

క. **వచ్చి బలమ్ములు గదిమి వి**
**యచ్చురు లత్యంత విస్మయము నొంది** (3-158)

బలమ్ములు గదిమి - అన్న పాఠము అసందర్భము. బలమ్ములు గదిసి - అని దిద్దాను. అంటే సైన్యములు మొహరించి అని అర్థము.

శోభనాద్రి అప్పారావు పరాక్రమాన్ని వర్ణించు సందర్భంలో-

**సీ. తన తీక్ష్ణ ధారాక తరవారి పన్నగం**
**బరిజీవ మారుతం బారగింప** (1-69)

దీనిని తన తీక్ష్ణ ధారాగ్ర తరవారి - అని దిద్దాను.

ఇటువంటి సవరణలు ఇంకొన్ని చేశాను. నా సవరణలు ప్రధాన పాఠంగా చూపినచోట, పూర్వపాఠమును పూర్వ ముద్రణ పాఠము (పూము.పా) అని అడుగున చూపించాను. కనుక నా పాఠము నచ్చని వారు తమకు నచ్చిన పాఠం స్వీకరించ వచ్చును.

ఈ ముద్రణలో కొన్నిచోట్ల వలపలగిలక రూపాలు కొన్ని కన్పిస్తాయి. వాటిని ఇప్పటి వ్రాత కనుగుణంగా మార్చి ముద్రించాను. వాటిలో కొన్నిటిని చూపిస్తాను.

దోర్బఁలము - దోర్బలము (2-33)
వర్ణిఁంచెద - వర్ణించెద (2-36)
శర్కఁరాంబువులు - శర్కరాంబువులు (2-166)
ఎదుర్కొఁనుచు - ఎదుర్కొనుచు (2-163) మొదలైనవి.

పూర్వ ముద్రణలో ఆటవెలదులు తేటగీతులుగా గుర్తించబడ్డాయి. వాటిని ఆటవెలదులుగా మార్చి ముద్రించాను. చాలాచోట్ల ప కారము సకారముగాను, సకారము నకారముగాను, వకారముగాను; ముద్రితమయ్యాయి. వాటిని సవరించాను. అచ్చుతప్పులు దిద్దాను.

**మేలు తలపు :** శతాధిక సంస్కృతాంధ్ర గ్రంథప్రకాశకులు, విశ్రాంత భూగర్భ శాస్త్రోపన్యాసకులు శ్రీ రావి మోహనరావుగారి దృష్టి అదృష్టవశాత్తు వల్లవీ పల్లవోల్లాసముపై ప్రసరించింది. వెంటనే ఆయన నాకు ఫోన్ చేసి ప్రతిని సిద్ధము చేసి, పీఠిక వ్రాయమని ఆదేశించారు. నావద్ద ఉన్న 1894 ముద్రిత ప్రతియొక్క జెరాక్స్ ప్రతిలోని అక్షరాలు ముద్దలు ముద్దలుగా పడి పఠనయోగ్యంగా లేదు. మిత్రులు శ్రీ కె. శ్రీనివాసులు (చారిత్రకోపన్యాసకులు), నడింపల్లి లక్ష్మీనారాయణలు స్ఫుటమైన అక్షరాలు గల జెరాక్స్ ప్రతులు పంపించారు. వాటి రెంటి సహాయంతో ఒక సమగ్ర ప్రతి తయారయింది. కాని ఆనాటి అచ్చు ప్రతులలో ముద్రణ సరిగా లేక చాలా చోట్ల అక్షరాలు ఈ జెరాక్స్ ప్రతులలోకి కూడ రాలేదు. మిత్రులు డా॥ వడ్డేపల్లి శ్రీనివాసరావు కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో తన తండ్రిగారి పేరిట స్థాపించిన శ్రీ వడ్డేపల్లి చినపుల్లయ్య గ్రంథాలయం నుండి 1894 నాటి అచ్చు ప్రతిని పంపించారు. ఇది నాకు చాలా ఉపయోగపడింది. పీఠిక వ్రాస్తున్నప్పుడు నాకు ఏర్పడిన సందేహాలను తీర్చిన విద్యామిత్రులు డా॥ ఉయ్యూరు లక్ష్మీనరసింహారావు

గారికి, డా॥ వడ్డేపల్లి శ్రీనివాసరావు గారికి నా కృతజ్ఞతలు. పీఠిక వ్రాస్తున్నప్పుడు కొన్ని విలువైన సూచనలు చేసిన ప్రాకృత భాషా పండితులు శ్రీ ఇప్పగుంట సాయిబాబా గారికి నా కృతజ్ఞతలు.

రావి మోహనరావుగారి ఇల్లు గీర్దేవి నిలయము. సరస్వతీ దేవి కాలి అందెలు నిత్యము సంస్కృతంలోను, అప్పుడప్పుడు తెలుగులోను ధ్వనించు చదువుల కొలువది. కాళిదాసుని మేఘసందేశ, కుమార సంభవాది కావ్యాలకు లాక్షణిక సమ్మతమైన బృహద్వ్యాఖ్యలు సంతరించిన విద్వాంసులు వారు. ఇప్పటికి ఆయన 120 గ్రంథాలను ప్రచురించారు. ఇన్ని గ్రంథాలు ప్రచురించుటలో ఆయన ధర్మపత్ని శ్రీమతి కృష్ణకుమారి గారి సహకారమే ప్రధాన కారణము. ఈ పెళ్లి కావ్యానికి మరలా సూర్యాలోక భాగ్యాన్ని కలిగించిన ఆ పుణ్యదంపతులకు ఆగిరిపల్లెలో కొలువున్న శోభనాచల లక్ష్మీనృసింహ స్వామివారు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక! అస్తు!

**ఉన్నం జ్యోతివాసు**
**వేములపాడు.**

**జయనామకార్తికము**
**6-11-2014**
**కార్తిక పూర్ణిమ**

శుభమస్తు

# వల్లవీపల్లవోల్లాసము.

## ప్రథమాశ్వాసము.

### : ఇష్టదేవతా స్తుతి :

శా॥ శ్రీలక్ష్మీకరకర్ణభూషణములై చెన్నొందుపద్మోత్పలో
ద్వేలోల్లాసనిదాన నేత్రయుగళీదివ్యార్క చంద్రద్యుతిన్
ద్రైలోక్యాఘతమోనివారణముఁ జిత్రంబొప్పఁ గావించునా
శ్రీలక్ష్మీనరసింహనామకశుభాద్రిస్వామిని న్గొల్చెదన్ 1

చ॥ సురుచిరపాణి పల్లవముసొంపునఁ గన్గవతేఁటినీటునన్
గురుకుచయుగ్మరమ్యసుమగుచ్ఛములన్ మధురాధరప్రధా
సరసఫలద్యుతిన్ దనరి శౌరిమహీజము చుట్టుకొన్న మా
హరిసఖికల్పవల్లి సకలార్థసమృద్ధినొసంగి ప్రోవుతన్ 2

చ॥ నిజపదకంజభావనల నిర్జరకోటి సుఖంబునొందుటల్
గజవదనాదిపార్షదనికాయము దెల్పుచుఁ గొల్వఁ గొల్వునన్
విజయముఁజేయుచున్ దనదువేత్ర శిఖాచల నాస్పదంబుగాఁ
ద్రిజగము నేలు విష్ణుభటదేవుని సూత్రవతీశుఁ గొల్చెదన్ 3

ఉ॥ ఎవ్వఁడు శ్రీమనోహరున కింపుగ వాహనమై చెలంగుచున్
నివ్వటిలెన్ ధ్వజవ్యజన నిత్యసుహృన్మణిపీఠలీలఁ దా
నెవ్వఁడు సర్వవేదమయుఁ డెవ్వనిఁగొల్చు సుపర్వ భూవిభుం
డవ్విహగాధినాథుని సమగ్రసుఖస్థితికై నుతించెదన్ 4

చ॥ విపులఫణామణిప్రభల వేమఱు భానుకృశానుతారకా
దిపతనుకాంతులన్ దెగడి తేజము మీఱఁగఁ జక్రపాణికై
యపరిమితాతపత్ర శయనాంశుకపీఠ నివాసపాదుకా
దిపరికరంబులన్ దనరు దివ్యమనీషుని శేషుఁ గొల్చెదన్ 5

ఉ॥ భూతసరోమహన్మునుల భూరికృపానిధి భట్టనాథునిన్
శ్రీతతభక్తిసార కులశేఖర సత్పదరేణుమిశ్ర వి
ఖ్యాతమునీంద్రవాహపరకాల పరాంకుశ భాష్యకారులన్
జేతులఁ జాచి మ్రొక్కి మదిఁ జేర్చెదఁ దత్పదసారసంబులన్ 6

గీ॥ సర్వతంత్ర స్వతంత్రులై జగమునందుఁ
దేజరిల్లిన వేదాంత దేశికులను
మాటిమాటికి సేవింతు మదిఁ దలంతుఁ
బూని నేఁ జేయుకావ్య సంపూర్తికొఱకు 7

గీ॥ జగతి శ్రీశైలవంశసంజాతులగుచు
సకలవేదపురాణ శాస్త్రములు చదివి
బ్రహ్మవిద్వంద్య చరణులౌ రంగనాథ
దేశికులఁ గొల్తు మత్కృతి తేజమునకు 8

క॥ అతిశయమతిసంయుత సం
స్కృతవైకృతకవిసమాజ కీర్తితులను మ
త్కృతిముఖమున నుతియించెద
నతులితవాల్మీకినన్నపాహ్వయకృతులన్ 9

గీ॥ వృత్తనియమాశయాభావవృత్తిఁ దాల్చి
కపటవాక్యపదార్థసంగ్రహమొనర్చి
మలయుకుటిలాళి మాన్యసామాన్యవంతి
కుకవికృతిఁ జూడనొల్లరు సుకవులెపుడు 10

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబును, స్వాచార్య ప్రముఖ గురు పరంపరాభి వందనంబును, సుకవిసత్కారంబును, గుకవి తిరస్కారంబునుం గావించి యనంతరంబ. 11

## : కృతి ప్రోత్సాహకుని ప్రశంస :

సీ॥ ద్విజరాజకేతన ద్విజరాజధరసిత ద్విజవాహసన్నిభ ద్విజగణంబు
కార్తవీర్యార్జున కార్తికేయార్జున కీర్తితక్షత్రియవర్తనంబు
రాజీవదరమహా రాజీవనిధిరాజ రాజసమ్మిత వణిగ్రాజితంబు
కర్షణాంచితబాహు ధర్షితవైరిసంకర్షణామిత సత్వకర్షకంబు

గీ॥ చటులవిక్రమపటురటద్భటచయంబు
నటవిట శ్రేణిరంజిత నరచయంబు
మత్తవేదండతండంబు మహితచక్రి
తురగనికరంబు నూజివీట్పురవరంబు 12

ద్వంద్వప్రాసకందము :

ఆపుర మవనిరమణిమణి । నూపురమై ఖేచరీవినోదకరమహా
గోపురమై నృపకోటికిఁ । గాపురమై తనరు రాజ్య కమలాకరమై 13

గీ॥ ఆపురంబున విలసిల్లు భూపమౌళి
రత్ననిచయప్రభాపుంజరంజితాంఘ్రి
రమ్యుఁడౌ శోభనాద్ర్యప్పరాయరాజ
శేఖరుఁడు తేజమున నిందుశేఖరుండు 14

సీ॥ ఎవ్వానిమందిరం బిందిరామందిరానందమై లోచనానందమయ్యె
నెవ్వాని ఘనయశం బిందుబింబోపమంబై లోకసంతోషమాచరించె
నెవ్వానిసౌందర్య మిక్షుధన్వసమానమై మానినీమాన మపహరించె
నెవ్వాని విక్రమం బినమండలాకారమై వైరితాపదంబై చెలంగె
నతఁడు రథభటకరితురగాభిరామ
విపులపృతనాధినాథ సంవృతమదేభ
గమనుఁడయి యేకచక్రముగాను బృథ్వి
నేలుచుండెను శోభనాద్రీశ్వరుండు 15

క॥ ఆజగతీరమణుఁడు సుర । భూజమువలె సకల మనుజపుంగవులకు వి
భ్రాజిత ధనముల నొసఁగుచు । రాజిల్లుచు నుండు రాజరాజై జగతిన్ 16

వ॥ ఇవ్విధంబున నుండుచు నొక్కనాఁడు. 17

**: కృతి నిర్మాణ ప్రస్తావన :**

సీ॥ సకలాగమపురాణశాస్త్రజ్ఞు లొకచెంతఁ గర్కశోక్తులఁ బ్రసంగములు సేయ
సంగీతసాహిత్యసారజ్ఞు లొకచెంత శృంగారకావ్యముల్ చెలఁగి చదువ
వరకంకణారావకరకాంత లొకచెంత విమలానుపమ చామరములు వీవ
రమణీయసౌందర్యరాజన్యులొకచెంత రాజకార్యప్రచారములు దెలుప

గీ॥ వారకామిను లొకచెంతఁ జేరియాడ
వందిమాగధు లొకచెంత వరుసఁ గొలువ
సకలసామ్రాజ్య లక్ష్మీప్రసన్నుఁడగుచు
నివ్వటిల్లుచుఁ గొల్వున నవ్విభుండు 18

మ॥ నను గోపాలదయాసముల్లసితనానాశాస్త్రవిజ్ఞాన నై
పుణశీలాంచితశేముషీ విలసితున్ భూరిప్రభావోన్నతున్
వినతాసూనుకటాక్షలబ్ధకవితావిఖ్యాతచాతుర్యుఁ జ
య్యన రారమ్మని చేరఁబిల్చి రమణీయాహ్లాదచేతస్కుఁడై 19

గీ॥ కమలశంఖరథాంగరేఖలఁ జెలంగు
తనదు కరమున నాదు కేల్దనరఁబూని
సరసమోచారసస్వాదుచతురవాక్య
ములఁ నిటులఁ బల్కె నాన్నృపతిలక మెలమి 20

చ॥ మృదుపదవాక్యగుంభనల మేదురమై శ్రవణాతిశాయి స
మ్మద మొదవంగఁజేయ రసమంజులమై సదలంకృతిన్ మహో
యదమగు నవ్యకావ్యము శుభాద్రినృకేసరి కర్పితంబుగా
మదిఁ దులకింప సత్కవిసమాజ మొనర్పుము నేర్పుమీఱఁగాన్ 21

వ॥ అనిపలికి బహుమానపురస్సరంబుగాఁ దాంబూలం బొసంగినం గైకొని మదనగోపాలచరిత్ర చిత్రితంబగు నొక్కశృంగారకావ్యంబు రచియింపంబూని కవిసమయ సుప్రసిద్ధంబు గావున నిజవంశానుక్రమం బెఱింగించెద. 22

## : కృతికర్త వంశానుక్రమము :

సీ॥ మహనీయ గుణరత్న మాడభూష్యన్వయకలశాంబురాశి శీతలకరుండు
కమనీయనైధ్రువకాశ్యపగోత్రుఁ డాపస్తంబసూత్రుండు పరమయశుఁడు
వేదశాస్త్రపురాణ విద్యానవద్యుండు సకలధర్మాధర్మ సారవిదుఁడు
సంస్కృతప్రాకృతశౌరసేన్యాది సద్భాషావిశేషప్రబంధకరుఁడు

గీ॥ అతఁడు మద్వంశకూటస్థుఁ డఖిలరాజ
పూజనీయాంఘ్రిరాజీవరాజితుండు
వాదివేదండ పంచాస్య వైఖరీ స
మంచితుఁడు వేంకటాచార్యుఁ డార్యవిభుఁడు 23

క॥ ఆ వేంకటగురుచంద్రుఁడు
పావనగుణ శేషమాఖ్య భామామణితో
శ్రీవెలయఁగ గార్హస్థ్యము
భావింపుచునుండె విబుధపరిబృఢుఁ డగుచున్ 24

కII నవసేవధిసమ్మితసుత । నవకం బాదంపతులకు నయమొందఁగ ను
ద్భవమై గుణగణమణిసం । భవమై విలసిల్లె సర్వవైభవహితమై 25

ఉII ఆ నవకంబునం దనరె నాగమశాస్త్ర విశారదుండు శ్రీ
సూనుసమానసుందరుఁడు శోభితభూరియశోంచితుండు సం
తాన మహీరుహోపమిత దాన మహీసుర కోటిమోద సం
ధానుఁడు శ్రీనివాసుఁడు బుధస్తవనీయ కళావిలాసుఁడై 26

గీII శ్రీనివాసార్యుఁ డిలయందు శ్రీనివాసు
డనఁగఁ జెలువొంది వేంకటమ్మాఖ్యసాధ్వి
తోడ గృహమేధియై కడు ప్రోడ యగుటఁ
బండితాఖండలుండనఁ బరఁగెనతఁడు 27

కII ఆ పండితజనశేఖరుఁ । డాపన్నగశాయి ఘనదయన్ వంశసము
ద్దీపకతనూజరత్నముఁ । బ్రాపించెను వేంకటార్య భాస్వదభిఖ్యన్ 28

కII కృష్ణాంగజన్మవిలస । త్కృష్ణాలహరీసమాన కృత్యాంచితయౌ
కృష్ణాంబతోడ రమతో । విష్ణువువలె వేంకటార్య విబుధుండలరెన్ 29

గీII పంచరత్నంబులో లేక పంచబాణు
పంచశరములో యన సుతపంచకంబు
వారిసుకృతంబు లెల్లను వన్నెకెక్క
నుదయమయ్యెఁ దదన్వయాభ్యుదయమునకు 30

గీII అయిదుగురిలోనఁ దండ్రికి దయితుఁ డగుచు
సకలవేదపురాణశాస్త్రములఁ జదివి
యమితభాషావిశేషము లభ్యసించి
తేజరిల్లెను వేదాంతదేశికుండు 31

కII వేదాంతవేద్యవిలస । త్పాదాంబుజసక్తషట్పదాయితఘన స
మ్మోదాంతరంగుఁడై భువి । వేదాంతాచార్యుఁ డలరె విద్వద్ఘనుఁడై 32

కII అనసూయారుంధతులను
ఘనపాతివ్రత్యమునను గదుముచుఁ గృష్ణ

మ్మనువెలయు సతీమణితోఁ
దనరెన్ వేదాంతగురుఁడు దద్దయువేడ్కన్ 33

వ॥ అమ్మహాత్ముండు లక్ష్మీనృసింహకటాక్షలబ్ధ సమస్తవిభవుండును, సకల విద్యానవద్య సారామృత హృదయకనకకలశ విరాజితుండును, వితతవిచిత్ర వసువసన వితరణసమ్మోదిత దీనజనమండలుండును, సర్వతంత్ర స్వతంత్రుండును, బతంజలికరణి సరసపద విజృంభణారంభణుండును, నక్షపాదునిపగిదిఁ బదార్థ శోధనదక్షుండును, జైమినికరణిఁ గర్మకాండ విచారణనిపుణుండును, వేదవ్యాసునివలె సమస్తవేదవేదాంగపురాణేతిహాసాది విజ్ఞానుండునై, సత్యంబున హరిశ్చంద్రుండు, సౌభ్రాత్రంబున ధర్మనందనుండు, కల్యాణగుణాశ్రయంబునఁ గమలామనోహరుండని సమస్తవిద్వద్వరులు దన్ను వినుతింప శ్రీకృష్ణమాంబా మనోరంజనుండై, వేదాంతాచార్యుం డార్యశిరోభూషణుం డయ్యె నంత. 34

సీ॥ ఎవ్వండు విశ్వంభరేంద్రులసభలందు నఖిలవిద్వద్గజంబనఁ జెలంగె
నెవ్వండు యవనక్షితీశుల చదరులోఁ బండితరాజని ప్రౌఢికెక్కె
నెవ్వండు హూణావనీంద్రులకోర్టులో సదరమీనని ఖ్యాతిఁ జాలనొందె
నెవ్వండు భూదేవతేంద్రులగోష్ఠిలో వజ్రిపూజ్యుండన వన్నెమీఱె
నతఁడు సురధేనుకల్పవిఖ్యాతదాన
సముదయంబున జనులను సంతసింపఁ
జేయుచును సర్వసంపద్విశేషములను
దేజరిల్లెను వేదాంతదేశికుండు 35

క॥ ఆ వేదాంతాచార్యుఁడు
భూవలయమునందు సకలబుధసన్నుతుఁడై
శ్రీవెలయఁ గనియె మమ్ముల
నేవురఁ దనయులను బండితేంద్రచరితులన్ 36

క॥ వారిజలోచను కరుణన । వారితసురవాహినీప్రవాహసుకవితా
ధోరణిఁగల్గి చెలంగితి । ధీరుల్ శ్రీనారసింహదేశికుఁడనఁగన్ 37

వ॥ మఱియు వైనతేయకటాక్షలబ్ధ విద్వత్కవిరాజ సమాజ మనోరంజక సంగీత సాహిత్య పాండిత్య విచిత్రకవిత్వ నిర్మాణనిపుణుండనై, నే రచియింపం బూనిన ప్రబంధమున కధీశ్వరుండైన శ్రీశుభాద్రిస్వామినిన్ వర్ణించెద 38

## : కృతి భర్త శుభాద్రి స్వామి వర్ణన :

సీ॥ మహనీయవిజ్ఞానమహిమయుగ్వైష్ణవనిత్యసూరిశ్రేణి నివ్వటిలఁగ
దివ్యపద్మోత్పలదేదీప్యమాన వారాహపుష్కరిణీవిరజ జెలంగ
వేదశాస్త్రపురాణవేదాంతవిద్ధనస్మార్తమౌనీశ్వరసమితి మెలఁగ
శుకపికారావసంశోభితానోకహసురుచిరక్రీడాద్రి సొంపుగణఁగ
విధి శివాదిసమస్తవిబుధవరేణ్య
సేవితాంబుజపదనారసింహమూర్తి
సంగతావాసమై శ్రీశ సదన మనఁగఁ
బరఁగు మేదిని నాగిరిపల్లిపురము 39

క॥ ఆపుర పరిసరమునఁ దగె । గోపురమంటపవితానగురుతరసుశ్రీ
దాపరమై శుభశైలము । శ్రీపరమానందదాయి శిఖరాంచితమై 40

సీ॥ లక్ష్మీలతాశ్లేషలసమానతనుకాండభుజశాఖసంతానభూజమగుచు
శార్ఙ్గనందకజిష్ణుచాపసౌదామినీరారాజదసితాభ్రరాజమగుచు
వృత్తివేత్రద్వంద్వవిధుచండకరబింబభాసుర శ్రీవిష్ణుపదమునగుచు
భువనదుష్కృతతమఃపుంజాపనోదనోదీర్ణమహాదివ్యతేజమగుచుఁ
దనరి శ్రీరాజ్యలక్ష్మీశతను వహించి
భక్తజనులను సంపత్ప్రసక్తిఘనులఁ
జేయుచును శోభనాచలశిఖరమునను
జెన్నుమీఱును శ్రీనారసింహమూర్తి 41

సీ॥ రాజ్యలక్ష్మీసముద్రాభాజితుండయ్యును బరహిరణ్యక్షేత్రహరణుఁడగుచు
శంఖచక్రగదాసిశార్ఙ్గసంయుతుఁడయ్యుఁగరరుహాయుధసమాకలితుఁడగుచుఁ
గందర్పశతకోటికల్పగాత్రుండయ్యు జ్వాలాకరాళాంగజాలుఁడగుచు
సంపూర్ణవిధుబింబసదృశాననుండయ్యు దంష్ట్రోల్లసన్మృగేంద్రముఖుఁడగుచు
సకలసురనరమునిజనాశ్చర్యకర వి
చిత్రచారిత్రయుక్తిచేఁ జెన్నుమీఱ
సిద్ధసంసేవ్యశుభగిరిశిఖరమునను
సిరులఁ జెలువొందు లక్ష్మీనృసింహవిభుఁడు 42

## షష్ఠ్యంతములు

కు॥ ఏతాదృశానుపమవి । ఖ్యాతాద్భుతవితతచరితకలితునకు సమా
ధూతసురవ్రాతమనో । జాతామితసాధ్వసునకు జగదాత్మునకున్ 43

కు॥ గాఢాశ్లిష్టరమాకుచ । లీఢమృగీనాభిమంజులితవక్షునకున్
ద్రూఢఫణిప్రౌఢఖగ । వ్యూఢునకునుదూఢమందరోర్వీధ్రునకున్ 44

కు॥ పుణ్యజనావళిగణ్యహి । రణ్యకశిపుభూధరభిదురకరరుహునకున్
బుణ్యౌఘవరేణ్యార్తశ । రణ్యసరోజాతచరణరంరమ్యునకున్ 45

కు॥ కుక్షిస్థితప్రపంచున । కక్షీకృతచండభాస్వదమృతాంశునకున్
రక్షోధిపవక్షోరుధి । రక్షోదితనఖరశిఖరరమ్యకరునకున్ 46

కు॥ నక్రపరాక్రమనిర్జిత । విక్రమగజరాజవరదవిశ్వాత్మునకున్
శక్రదమనచక్రశమన । చక్రగదానందకాబ్జశార్ఙ్గధరునకున్ 47

కు॥ శ్రీభూనీళాదేవీ । శోభోల్లసదుభయపార్శ్వశుభవక్షునకున్
శోభనఘృణిశోభితమణి । [1]శోభనమందిరునకు(శ్రిత)సురసేవ్యునకున్ 48

కు॥ లక్ష్మీనయననవోత్పల । లక్ష్మీకరపార్శ్వికైణలక్ష్మాస్యునకున్
లక్ష్మీకృతవిక్ష్మాపతి । లక్ష్మీనరసింహునకువిలక్షణఘృణికిన్ 49

వ॥ సమర్పితంబుగా నా రచియింపంబూనిన వల్లవీపల్లవోల్లాసంబను
సత్యాపరిణయాఖ్యాన ప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన. 50

### : కథాప్రారంభము :

చ॥ సలలితనైమిశాటవిని శౌనకముఖ్యులు సత్రయాగమున్
సలుపుచు రౌమహర్షణిని సంతసమొందఁగఁ గాంచిమున్న కో
సలవిభుకన్య నేకరణి సత్యను శ్రీహరిపెండ్లియాడె ని
శ్చలమతిఁ దెల్పుమన్న మునిచంద్రులతో నతఁ డిట్లనెం దయన్ 51

### : కృతి ప్రోత్సాహకుని ప్రశంస :

సీ॥ లసదాగమస్ఫూర్తి వెసఁబూని హంసార్వసరణులై తనరు భూసురులు హరులు
తేజోబలోద్ధతి దిక్కుంభినీశుల కెరలిరంజిల్లు భూవరులు కరులు

కమనీయ నవరత్న కాంచన చక్రకోటులను శోభిల్లు వైశ్యులు రథములు
పరమధర్మాభాతిపరజీవనక్షేత్ర దారతఁ దగినపాదజులు భటులు
రమ్యసుమనః ప్రమోదాంగ రాగలలిత
పల్లవావాప్తిచే మించు ప్రౌఢవార
కాంత లారామములు గల్గి ఘనతనొందె
భూస్థలిఁ గరంబు కోసలపురవరంబు 52

గీ॥ భవ్యగుణరత్న బహుసుధా భవనరాజ
మండలోదయసదనంత మహితభోగ
లసితపురుషోత్తమ శ్రీవిలాసలలిత
మగుచు విలసిల్లె నప్పుర మబ్ధికరణి 53

సీ॥ కస్తూరికారేణు కలితపన్నీరాంబు శీకరానీక సంసేవితంబు
తారాఫలస్ఫూర్తితరళముక్తాజాల రంగవల్లీసముద్రాజితంబు
విద్రుమస్తంభాగ్ర వికచనీలోత్పల శ్రీరాజదంభోజతోరణంబు
ఘనతరసామోద కర్పూరచందనాగరుధూప ధూపితాంగణచయంబు
వారకాంతాదృగంచల వర్ధమాన
విటజనశ్రేణిచిత్తజ విలసనంబు
సకలశృంగారకేళికాసౌధహర్మ్య
రాజమానంబు తన్మహారాజపథము 54

చ॥ శుకమధురానులాపగతి సుందరపల్లవరాగసంపదన్
వికచసుమాభిరామసురభిన్ హరిచందనసంగతిన్ లస
త్పికకలరావసంయుతి రతిప్రియవృత్తుల వారకామినీ
నికరమురీతి నప్పురవనీనివహం బలరారు రమ్యమై 55

సీ॥ శారదపూర్ణిమాచంద్రబింబాస్యలై యలకాంధతమసంబు ననుకరించి
మదకీరకోకిలమంజులవాణులై పక్వబింబాధరప్రాప్తిఁ గాంచి
తనరారు మృగరాజతనుమధ్యసీమలై కరికుంభవక్షోజగరిమఁ బెంచి
బిసనాళమృదుబాహులసమానలై రాజహంసయానంబుల నతిశయించి
చంద్రికాస్మితసాంద్రలై చరణనయన
వారిజంబుల విలసిల్లి వన్నెకెక్కి

చిత్రలావణ్యగణ్యతఁ జిగురుబోణు
లాపురంబున విహరింతు రేఁపుమీఱి 56

సీ॥ పడఁతిరో వెలకుఁ జూపవదేమి పొన్న పువ్వది యనంటుల దీవినయ్యెఁగాదె
చేఁడె కల్వసరంబుఁ [2]జూడనీయవదేల నది యగాధసరోరుహంబుగాదె
యింతిరో విరిబంతు లిందులప్రియమటే యవి హేమవల్లీనయములుగావె
మగువరో దాఁచెదు మల్లెలు గోప్యమే యవి సుధారసపూరభవములయ్యె
ననుచు సరసోక్తి సరణుల నలరి పుష్ప
లావిక లుషిద్ధసముదయభావమెలమి
నుల్లసిల్లంగఁ జేయుచు నుల్లసమునఁ
బువ్వులమ్ముచు నుందు రప్పురమునందు 57

శా॥ నీడాంతస్థితకేకికోకిలశుకానీకస్వనానోకహ
క్రీడాభూధరకూటకోటివిలసచ్ఛీమంజుకుంజంబులన్
జోడుంబాయక కిన్నరుల్ సతులతో సూనాస్త్రసంప్రీతిగాఁ
గ్రీడాతత్పరులై సుఖింతురు గతవ్రీడాత్ములై తత్పురిన్ 58

ఉ॥ అన్నగరంబునం దనరు హైమసముజ్జ్వలహర్మ్యసీమలన్
సన్నుతగాత్రుఁడై గతివశంబునఁ జంద్రుఁడు సంచరింపఁగా
సన్నలు చంద్రశాలలును సౌధము లంచును దేజరిల్లె నా
పన్నగరాజుకైనఁ దెలుపన్వశమే భవనప్రభావముల్ 59

ఉ॥ ఆపురసౌధభాగముల నంబుజనేత్రలు కామికోటితో
శ్రీపతిసూనుకేళివివశీకృతలై మరుదాపగాసరో
జాపృతమంజుగంధవహహాపితతచ్ఛమవారిధారలై
దీపితకామభోగములఁ దేజము నొందుదు రందమొందఁగన్ 60

చ॥ ఇనుఁడుదయాద్రి నెక్కి మదికింపగు మేడల గొప్పఁ గాంచివా
హనమున కడ్డమౌ ననుచు నంబరవీధికి నేగి సౌధభా
జ్మణిమయసింహరాశి తన మందిర మన్మతి నిల్చి మెల్లనే
చనుటను గాదె మధ్యదివసంబున మందత నొందె నాతనిన్ 61

క॥ ఆపురగోపురమణి నిజ । రూపము లీక్షించి రవిహరుప్రృతిహయధీఁ
గోపించి హీరహరులన । నాపట్టునఁ జూచికాదె యటునిటు తొలఁగున్ 62

కII సాలాభిరామనగరీ । సాలాంచలశాఖలందు శారదతారా
జాలము విలసితముక్తా । జాలము పగిదిన్ వసించుఁ జతురత మిగులన్ 63

కII ప్రాకారసీమ లందునఁ । బ్రాకటశాఖాంతరములు భాగించుటచే
భాకరరథము నిరోధము । లేక వెడలుఁ దత్సరణి నిలింపులు సూడన్ 64

కII అరయఁగఁ దత్పురకాంచన । వరుణాంచలఖచితరత్నవరకాంతులఁ దా
నరుణాయుతుఁడై గా ఖర । కిరణుం డరుణాభిధాన కీర్తితుఁడయ్యెన్ 65

గీII కనకమయకూటకలితమై కాంచనాద్రి
కరణి రంజిల్లు తత్పురీవరణమునకు
వారినిధిసప్తకము చుట్టువారె ననఁగఁ
గరమలరెఁ బరిఖా సప్తకంబుజుట్టి 66

సీII రాజహంసవిలాసరాజమానాంగమై బహుజీవనావాప్తిభవ్యమగుచు
లసమానపల్లవోల్లాససంవాసమై సమదానురాగిణీసదనమగుచు
రమణీయగుణశాలిరామాభిరామమై భరతగోష్ఠీసమాభరితమగుచుఁ
బురుహూతగణనీయపురుషోత్తమహితమై లక్ష్మీవిహారాభిలలితమగుచు
మానససరో వసంత రామాయణాంబు
నిధులతో సామ్యమొంది సేవధివిశేష
మహితగోపురసౌధహర్మ్యప్రసక్తి
నలరు నన్నగరీవర మనవరతము 67

### : కోసల నగర విభుఁడు నగ్నజిత్తు :

కII ఆపురమున విపులయశో । భూపకిరీటాగ్రఖచితభూరిమణివిభా
దీపితచరణుఁడు సుగుణ । శ్రీపరిబృఢసముఁడు నగ్నజిద్విభుఁ డలరెన్ 68

సీII తనదీర్ఘబాహుసంతానభూరుహశాఖ వసుమతీవల్లికాస్పదముగాఁగఁ
దనయశోమండలంబనుఘనసారంబు దిగ్వధూతనువులఁ దేజరిల్లఁ
దనప్రతాపము దిజ్మదావళఘనకర్ణ తాళవృంతములవర్ధనము నొందఁ
దనతీక్ష్ణ [3]ధారాగ్రతరవారిపన్నగం బరిజీవమారుతంబారగింప
ధరణివితరణమునకు సురతరుపయోధి
చంద్ర సురధేను సురమణి సదృశుఁడగుచు

మదనశతకోటిలావణ్యమహితగాత్రుఁ
డగుచు విలసిల్లెఁ గోసలనగరవిభుఁడు 69

ఉ॥ ఆవసుధాధినాథుఁ డమరాధిపసమ్మితవైభవంబునన్
భూవలయంబు నేలుచును భూవిబుధామరభూజమై కడున్
భావజకేళులందు నిజభామినులన్ దనియంగఁ జేయుచున్
శ్రీవెలయంగ రాజమణిశేఖరుఁడై విలసిల్లుచుండఁగాన్ 70

క॥ అంతటఁ గోసలధరణీ । కాంతునకు జగత్త్రయాదికారణలక్ష్మీ
కాంతకరుణ నలకంతువ । సంతజయంతాభపుత్రసంతతి కలిగెన్ 71

వ॥ ఇవ్విధంబున నవ్వసుంధరాధురంధరుండు, విబుధాధినాథసభామధ్యసురవధూ జేగీయమానయశోవిశాలుండై, శర్వునికరణి సర్వమంగళావాసశరీరుండయ్యు సమదృష్టిసమేతుండును, శ్రీమన్నారాయణునిపగిదిఁ గమలాలంకృతుండయ్యుఁ బుణ్యజనమిత్రుండును, గళానిధిసరణి నమృతహృదయుండయ్యు నిష్కలంకుండును, దివాకరునివలె స్వప్రకాశితలోకనికరుండయ్యు నపంకజ బంధుండును, ధనంజయురీతి సుభద్రాభిరాముఁడయ్యు నిస్సహాయు విజయుండును, హరిశ్చంద్రునివలె సత్యవాక్యవిశారదుండయ్యు నిత్త్యైశ్వర్యుండును, నధునాతనపురాతనవసుమతీరమణాతిశాయి వైభవాలంకృతుండై, యవార్యశౌర్య ధైర్యాదిగుణమణివిరాజితుండై, ధరామండలంబుఁ బరిపాలనంబుసేయు సమయంబున. 72

**: పుత్త్రికకై రాజు పట్టమహిషి చింతించుట :**

క॥ ఆరాజోత్తమునిమహిషి । శ్రీరాజీవాయతాక్షి సితకరబింబ
శ్రీరాజమానముఖియై । శ్రీరంజిల్లంగ నిట్లు చింతించె మదిన్ 73

చ॥ తనయులు పెక్కుగల్గినను దన్వికిఁ బుత్రిక పుట్టకున్న ని
త్తనువు నిరర్థకంబని యెదం దలపోయుదు రింతులంచుఁ దా
మనమునఁ గొంతసేపు నృపమానిని చింతయొనర్చి యేమి సా
ధనమునఁ గన్యకావదనదర్శనజన్యముదంబు గల్గునో 74

చ॥ అనిమదిలోఁ దలంచి సతి యబ్జసుమంబుల వేడ్కతోఁ బయో
వనధిసుతాంఘ్రిపూజనము వాసిగఁ జేయుచు సద్వ్రతోపవా

సనియమమాచరించి సురసత్తములన్ గడు సన్నుతించుచున్
మనుజులు వింతనొంద నృపమానిని యుండె నభీష్టసిద్ధికై 75

కII ఈవిధమున భామామణి
భావంబున నిందిరాంఘ్రిపద్మము లెపుడున్
భావించుచుఁ బూజించుచు
వేవిధముల మ్రొక్కులిడుచు వేఁడుచు నుండెన్ 76

కII ఈకరణి నుండి యొకనాఁ । డాకమలదళాక్షి సలలితాంతఃపురశ
య్యాకల్పితాంగలతయై । చేకొని యుండంగ నిదుర సిరిచెలువొందెన్ 77

వII అప్పుడు. 78

**: లక్ష్మీదేవి ఆమెకు పుత్త్రిక ననుగ్రహించుట :**

సీII సోము గోమున గెల్చు మోమునఁ జిఱునవ్వు చిన్ని వెన్నెలలీలఁ జెన్నుమీఱ
సిరిమించు కెంగేలఁ జెలువొందు కెందమ్మి పైనిజూపులు తేంట్లపగిది మెఱయఁ
గ్రొమ్మించు హొయలుతో దొమ్మిసేయఁదలంచు మేనికడానిమేల్ మెఱుఁగులలరఁ
గావిపావడపసల్ గదిమి తెల్లనికాంతి చెలువొందు మహతాబు చీరదనరఁ
బైఁటపైఠాణి ఱవికపైఁ బరిఢవిల్లఁ
దళుకుతళ్కను రతనంపుఁ గుల్కు చిల్కు
మేల్మి బంగరు సొమ్ములు మేన నమరఁ
గల్మలనెలంత చూపట్టెఁ గలను సతికి 79

కII కలలోనఁ గమలఁ గని య । క్కలవాణి నతాంగి యగుచు గౌరవమొదవన్
గలవాక్సుమములఁ బూజా । కలనం బొనరించి పల్కె గద్గదగళయై 80

ఆ.వె. ఎవరి మగువ వమ్మ యీ యంతిపురమున
కేమి పనికి వచ్చితిపుడు తెలుపు
మనఁగ నిట్టు పలికె నారాజభామిని
తోడ గరుడగమనుతోయజాక్షి 81

ఉII క్షీరపయోధిగర్భమున శీతమయూఖుని తోడఁబుట్టి దై
త్యారిహృదంతరాళగృహమందు వసించిన దాననమ్మ నా

పేరలకల్మికల్కియని వేల్పులు పల్కుదు రమ్మ నేఁడు నీ
కోరికిఁ దీర్పగాఁ దలఁచి కూరిమి వచ్చితినమ్మ కోమలీ 82

సీ॥ ఆమాటవిని రాజభామిని హర్షించి వినమితాంగంబుతో వేడ్కమీఱఁ
గూర్మి నీసరియైన కూఁతు నిమ్మనుచును నతిభక్తి నడిగిన నబ్జవదన
సఫలమౌ నీకోర్కి సత్యంబు లెమ్మని పల్కిన మేల్కాంచి కల్కి మదిని
వింతనొందుచుఁ దనవిభున కీవిధ మంతరంగంబునను దెల్పి రంగుచెలఁగ
సిద్ధసంకల్పయై తపస్సిద్ధి నొంది
సంతతానందసంభృతస్వాంతయగుచు
విపుల సౌధాంతరములందు విభునితోడ
నిండువేడుక విహరించుచుండె నపుడు 83

క॥ ఈకరణిఁ దేజరిల్లిన । యాకమలదళాయతాక్షి కనురూపంబై
శ్రీకరుణను జూలమరెన్ । శ్రీకరముగఁ గడుఁ దదీయచిహ్నములలరెన్ 84

సీ॥ నల్లకల్వలరీతి నలుపైన కందోయి తెలిదమ్మిఱేకుల తెలివినొందె
బంగారుపసిమిచే రంగైన చన్దోయిమొనల నల్లనికాంతి మొలకలెత్తెఁ
గలదులేదనుమాట కలవైన లేఁగౌను కన్నులకుం జూడ ఘనతనొందె
సొగసైనపెన్నీటిసుడివన్నె నలరారు పొక్కిలి మెరకయై పొలుపుమీఱె
వళులు మెల్లనఁ జనుటకు సెలవులడిగెఁ
దెలుపు మించిన పసిమిచేఁ జెలఁగె మేను
గతుల మందత మిక్కిలి యతిశయించె
నంతకంతకు దౌహృదం బతివ కలరె 85

**: నాగ్నజితి జననము :**

గీ॥ ఈవిధంబున విలసిల్లి యిందువదన
సంతసంబున నొకమంచి సమయమునను
గలిమి చెలి సాటి కూఁతుఁ దాఁ గనఁజెలంగె
దివ్యశశిరేఖశుక్లద్వితీయకరణి 86

క॥ బాలిక గల్గిన జగతీ । పాలుఁడు ముదమంది శాంతిపౌష్టికవిధులన్
మేలుగఁ జేసి ధరామర । మౌళుల కొసఁగెన్మహార్ఘమణివసనములన్ 87

కII ఈకరణిఁ దేజరిల్లుచు । నేకాదశ దినమునందు నింతియుఁ దానున్
జేకొని బాలన్ ముదమునఁ । బైకొని పీఁటలను భేరిభాంకృతులలరన్ 88

కII సత్యంబీచెలి కమలా । ప్రత్యవయవసురుచిరాంగభాసుర యనుచున్
సత్యానామమునిడి మది । నత్యానందమునఁ బొంగి రాదంపతులున్ 89

గీII నాగ్నజితియని జనులెల్ల నయముగాను
దల్లిదండ్రులు సత్యనా దయఁ జెలంగిఁ
జెల్మిమీఱ సుదంతని చెలులు పిలువ
నలరె నబ్బాలికారత్న మనుపమముగ 90

సీII ఈలీలఁ బొత్తిళ్ల నింపుగాఁ గొన్నాళ్లు తల్లిచన్నులపాలఁ ద్రావిపెరిగి
అత్తత్తయని పిల్చి యడుగువేయఁగ నేర్చి యెత్తుకొమ్మని చేతులెత్తిపిలిచి
చిలుకపల్కులు నేర్చి చిన్నారిపొన్నారి పాటలఁ బాడుచుఁ బరిఢవిల్లి
బొమ్మలపెండ్లిండ్లు పొలుపొందఁగాఁ జేసివెలఁదులతోడఁ దా వియ్యమంది
విరులఁగోయుచుఁ బరువంపుసరులుఁగూర్ప
నేర్చి యుయ్యలనూఁగుచు నెయ్యముగను
మీఱి శైశవ బాల్య కౌమార దశలఁ
దేజరిల్లుచు బాలికాతిలక మలరె 91

వII ఇట్లు దినదినప్రవర్ధమానయై. 92

సీII కన్నెలతోమణుల్ దిన్నెల ఘటియించి వెన్నెలకుప్పల వెలఁది యాడుఁ
బదములందెలుమ్రోయఁ గుదిసి పయ్యెద దూఁగఁ బడఁతి చేడియలతో బంతులాడు
రమణీయమణిపద్మరాగమౌక్తికములఁ గోమలి యోమనగుంట లాడు
రాజమంత్రులఁ గూర్చి రహిమించు బలముతో నంగనామణి చదరంగమాడు
మఱియు మగువలతోఁ గూడి విరులపొదల
వెలయు పొన్నల నీడల వేదికలను
విపులసౌధాంతరంబుల వేడ్కమీఱి
యాటపాటల విహరించు నతివ యపుడు 93

ఉII ఇంపుగఁ జల్వవల్వకటినించియెదన్ బలుకెంపురాల్నిగా
రింపుమెఱుంగుఁ గంచెల ధరించి చొకారపు వేణిదూల వ

క్రంపుఁ జకచ్చకల్ దనరి రంజిలు సొమ్ములు దాల్చి వేడ్కతో
సొంపుగ సంచరించు నతిచోద్యము మీఱఁగ రంగశాలలన్ 94

గీ॥ లలన ఘనకావ్యనాటకాలంకృతులను
జదివి వీణానుపాణియై సరసముగను
లాటకర్ణాటనాటవరాటముఖ్య
రాగములఁ బాడుచుం దనరారు నెపుడు 95

గీ॥ కలికి కరకంకణక్వణత్క్వణన మెసఁగఁ
బావురముఁ బట్టి మింటికి వైవ నది వి
విధగతులఁ దనరుచుఁ దనవెలఁదిఁ గలసి
చెలువుమీరంగఁ జిఱునవ్వు వెలయఁ జేయు 96

గీ॥ ఇవ్విధంబునఁ గ్రీడించు పువ్వుఁబోణి
మెఱుపుఁదీవియకున్ హొయల్ గఱపఁజాలు
మేన దినదిన మొకవింతగాను జూడ
నివ్వటిల్లెను సరసంపుజవ్వనంబు 97

సీ॥ చామరంబులనంగఁజాలెను నెఱికురుల్ ముంగురు లలరె సారంగములనఁ
గంతువిండ్లనుజాడఁ గనుబొమల్ విలసిల్లెఁ గలువతేకు లనంగఁ గన్నులమరెఁ
బున్నమచందురు పొలుపునొందె మొగంబు దరసుందరంబయి దనరెగళము
చెండ్లతో గజనిమ్మపండ్లతో సరిదూఁగెఁ గుచములు నడుము సంకోచమయ్యె
శ్రోణి భరమయ్యె సైకతశ్రేణి సమము
ఊరువు లనంట్లబీరముల్ దూఱసాగెఁ
గల్కిగమనంబు రాయంచ నుల్కఁజేసె
నిటులు నవయౌవనంబున నింతియలరె 98

వ॥ అంత.

క॥ శ్రీలలనామణితో సరి । పోలిన బాలికను గాంచి భూవరుఁడు ఘన
శ్రీలక్షణములుగల వరుఁ । డేలీల లభించునంచు నెదఁజింతింపన్ 99

**: గిత్తల నణఁచినవానికి తన కూఁతు నిచ్చెదనని నగ్నజిత్తు చాటించుట :**

క॥ అరయఁగఁ దన మందను గుల
గిరులవలెన్ దనరె నేడుగిబ్బలు పుడమిన్

గెరలుచు ఱంకెలువైచుచు
నుఱుమాడుచుఁ బంటచేల నొరులఁ బొడుచుచున్ 100

కII ఆవిధము జనులు దెలుపఁగ । భూవలయాధిపుఁడు తనదు భూరిబలముతో
నావృషభంబులఁ బట్టఁగ । భావించుచు వచ్చి చుట్టువాఱఁగ నంతన్ 101

కII గొల్లలు గములై పెల్లునఁ
బల్లియలను వల్లెత్రాళ్లు పలుపులు నెల్లన్
మొల్లముగఁ బూని గిబ్బల
నుల్లసమునఁ బట్టుకొనఁగ నుబ్బుచునుండన్ 102

గీII పగ్గములుద్రెంచి గొల్లలనుగ్గడించి
భటులఁ బడఁద్రోచి కొందఱి ప్రక్కలవియఁ
ద్రొక్కి కొందఱి తలల నెత్తురులు దొరలఁ
దాఁకి యాఁబోతు లమ్మందతావుఁ జేరె 103

వII ఇత్తెఱంగున రంగుమీఱు నయ్యాఁబోతుసింగంబులకుఁ దురంగ మాతంగంబులు పొంగణింగి మెలంగినం గనుంగొని యజ్జగతీరమణుండు వృషభసంశిక్షణంబునం బలాధ్యక్షుల నియమించి వెండియు. 104

కII ఎవ్వండేని ధరాధిపుఁ । డివ్వసుమతిలోన నొక్కఁడీ వృషభములన్
నివ్వటిలఁ బట్టికట్టిన । నవ్వరునకు నాదుతనయ నర్పింతు ననన్ 105

గీII ఆప్రతిజ్ఞ సమస్తధరాధినాథు
లాదరంబున విని వచ్చి హర్షమునను
గిబ్బలను గాంచి మదిలోని యుబ్బణంగి
చనిరి వారలు నిజనివాసముల కపుడు 106

వII ఇవ్విధంబున నవ్విశ్వంభరాభరణు లావృషభశ్రేష్ఠంబులఁ జూడంజాలక చనుచున్న సమయంబునఁ గోసలధరారమణుండు నిజప్రతిజ్ఞానిర్వాహక వరాన్వేషణతత్పరుండై యున్నయెడ. 107

## : వసంతాగమము :

కII అంత వసంతాగమము శ । కుంతరవాక్రాంత మమలకోమలదళమ
శ్రాంతమనోభవ మళిరవ । దంతురితదిగంతరాళతలమై యలరెన్ 108

వ॥ అప్పుడు. 109

ఉ॥ అందముగాని జీర్ణదళనాంబరము న్విడనాడి వేడుకన్
గెందలిరాకువల్వఁ దులకింప ధరించి మిళిందచోళమున్
బొందుగఁ దాల్చి మాధవుని పొందున వాసకసజ్జ లీలనా
నందమొసంగ వన్యరమ నవ్యరుచిం దనరారె నత్తఱిన్ 110

చ॥ కనదళిపాళి చూచుక వికస్వర గుచ్ఛకుశప్రకాశతన్
ఘనశుకరావవాక్పటిమఁ గాంతఫలావళిభూషణంబులన్
దనరి పరాగగంధమును దాల్చి వనావనికాంత యా వసం
తున కనురాగమొప్పఁగను దోఁచెను దత్సమయాగమంబునన్ 111

క॥ తరుణార్తవరీతి మనో । హరయౌవనరేఖపల్లవాదృతి నలరెన్
దరుణార్తవరీతి మనో । హరయౌవనరేఖన మరునంగన సరియై 112

గీ॥ అవ్వసంతుని వితరణం బతిశయించె
వివిధఫలభోజనంబుల విప్రతతుల
సకలసుమహితమధురసాశనపరంప
రాప్తి నభ్యాగతాళులు నలరుచుండ 113

గీ॥ లేఁత నెలవంకలై కెంపులీల నమరి
పొలుపునొందిన మోదుగుమొగ్గలమరె
మధుసమాగమము నవనిమగువ కపుడు
కరరుహక్షతశృంగారకళలువోలె 114

ఉ॥ మాధవనూతనాగమనమంగళతూర్యరవంబులో రతీ
నాథుని వందిమాగధఘనధ్వనులో విపినాభిరామ ల
క్ష్మీధృతరమ్యభూషణసమీరితశింజితరీతులో యనన్
మాధవమాసమందుఁ బికమంజులరావము లొప్పె నెల్లెడన్ 115

వ॥ అప్పుడు. 116

## : నాగ్నజితి వనవిహారము :

క॥ కోసలవిభునందన మధు । మాసంబున సరసమృదులమంజులసుమనో
వాసితవనకేళికి సవి । లాసగతిన్ జనియె సద్విలాసవతులతోన్ 117

వ॥ చని యయ్యారామంబున రామామణులతో నక్కుమారీరత్నంబు వనకేళీలోలయై విలసిల్లుచున్న సమయంబున లీలావతు లాబాలామణితో హేలాగతులఁ జనుచు.

సీ॥ వెలఁదికేలంటిన విరిసె మాకందంబు సన్నుతాంగివాసింపఁబొన్నమీఱెఁ
గనకాంగి పాటపాడినఁ బ్రేంకణముపూచెఁ దిలకిని జూచినఁ దిలకమలరెఁ
గల్కిపల్కినఁ బూలఁగుల్కె గోఁగుసెలంగెఁ జానమోమెత్తినఁ జంపకంబు
కోమలియెదఁజేర్పఁ గురవకం బలరారెఁ గాంతతన్నిన నశోకంబు దనరె
వనితనిట్టూర్పునను సింధువారమొనరె
నువిదపుక్కిటిమధువుపైనుమియ మిగులఁ
బొగడ విలసిల్లె విరులతోఁ బొలుపుమీఱె
ననుచు దోహదములు సల్పి రతివలపుడు 119

రగడ॥ తరుణివనాంతలతాతరుజాలము । తరుణిమఁ గన్గొనఁ దలపంజాలము
ముదితచూడుమిదె మొల్లలబృందము । ముదితమధుకరామోదమరందము
కదళినటించు చొకాటపుదళములఁ । గదలిచూడు వేగమె దృగ్దళములఁ
బొగడల నెల్లను బొలుపగు నీడలు । పొగడఁ దరమటె పొన్నలజాడలు
నగములలోనున్నతిఁ బాపించిన । నగమనరే పున్నాగముఁ గాంచిన
సరసిజముల మధుసారము నిండెను । సరసములై కాసారము లుండెను
వరసహకారము వకుళపరాగము । వరుసఁజూడనే వలనుసరాగము
కలభాషిణి నీగళరవమామరు । కలికంఖాణము గదుమున్వేమఱు
కుందము మనపల్కుదురున కందము । కందమటవె యిక్కడ నాచందము 120

సీ॥ తరుణిరో తనుసమ్మితలతామతల్లులఁ బదకరాధరసామ్యపల్లవములఁ
జికురపుంజాంచితశ్రీమిళిందమ్ములఁ గుచయుగోపమసూనగుచ్ఛములను
వదనబింబసమానవారిజాతమ్ముల సరసనాసాసమచంపకములఁ
గమనీయనేత్రాభఖంజరీటంబులఁ బొక్కిలి కెనయైన పొన్నవిరుల
సరసవాక్సమశుకపికశారికలను
గమనసన్నిభఘనమరాళములగములఁ
దొడలనిగనిగఁగల యంటితోఁటలగమి
నెలఁత కనవమ్మ మదికింపుఁ దలఁపవమ్మ 121

క॥ అని యనురాగంబున ఘన । వనరుహమధ్యంబులం దవారితలీలన్
వనదేవతలో సౌదా । మనులో యననుల్లసిలుచు మానినులు చనన్ 122

సీ॥ శ్రమవారికణజాలలసదురోజములందు రహిమించెనుబయోధరక్రమంబు
బంగారుకాంతులఁ బరిఢవిల్లిన మేనుదీఁగెల బడలికల్ దేజరిల్లె
ఖరకరప్రభలచేఁ గందిన నెమ్మోము నందమ్ము కెందమ్మి నపహరించెఁ
దలిరుటాకులఁ బోలి తనరారు చరణముల్ రక్తోత్పలంబులైరహిఁజెలంగె
సరససారసకాసారజలతరంగ
సంగతాంబుకణాభ్యంతరంగలలిత
మారుతంబులపైఁ దోచె మానసములు
సతుల కారామవిహరణశ్రమమువలన 123

క॥ ఈలీలను లీలావతు । లాలోలలతాసమంచితారామవనీ
కేళుల జాతశ్రమలై । యాలో జలకేళిలోలలై చని యెదుటన్ 124

క॥ సారస కువలయ కైరవ । సారస కలహంస చక్ర సారంగ రవా
సారసమాక్రాంతమహా । సారసముల్ కాంచిరచట సంరంభమునన్ 125

**: చెలులతో నాగ్నజితి జలకేళిసలుపుట :**

వ॥ అంత. 126

క॥ తరుణీమణు లయ్యెడఁ దమ । సరసోజ్జ్వలభూషణములు సడలించు నెడన్
బరువంపు విరుల నెడసిన । విరితీవెలొ యనఁగఁ జూడ విలసిల్లిరొగిన్ 127

క॥ ఆకొలను సొచ్చి ముదమున । నీకీయింతికిని జోడు నీలాలకతో
నాకొమ్మఁ జూడ సరియౌ । నీకమలదళాక్షియుద్ది యింపుగఁ దనకున్ 128

చ॥ చిలుకలకొల్కి! కొమ్మ! సఖి! చేడియ! ముద్దియ! మచ్చెకంటి! తొ
య్యలి! యెలనాగ! బిత్తరి! వయస్య! పణంతి! కురంగనేత్ర! యో
యలికులవేణి! యింతి! జవరాల! నెలంతరొ! రమ్మటంచు నె
చ్చెలియలఁగూడి సత్య విలసిల్లుచు సారస కేళికై చనెన్ 129

గీ॥ లలనలవలంబితాన్యోన్యలలితకరస
రోజలై తేజరిల్లి సరోజలములఁ
జొచ్చి జలకేళిసలుపుచుఁ జోద్యముగను
నాటపాటల విహరించి రాదరమున 130

మ॥ వనకేళిశ్రమవారణంబునకు నవ్వామాక్షులాసత్యతో
వనకేళిన్ విలసిల్లి రత్తఱిని శైవాలంబులన్ జిమ్ముచున్
వనజాతమ్ములఁ ద్రుంచుచున్ జలచరవ్రాతంబులన్ దోలుచున్
వనజాలమ్ముల నోలలాడుచుఁ గడున్ వాటమ్ముగా నీఁదుచున్ 131

మత్తకోకిల॥ ఓల యోమృదువాగ్ధురంధర! యోల యోదరకంధరా
యోల యోనవపల్లవాధర! యోల యోసుపయోధరా
యోల యోజితకామభామిని! యోల యోగజగామినీ
యోల యోవనితామతల్లిక ! యోల యోతనువల్లికా 132

క॥ అళినీలాలక లీగతి
జలకేళియొనర్ప నెఱులు జాఱి కటితటిన్
మెలఁగుచు నుండఁగఁ దాండవ
ములుసల్పెడి కేకిపింఛములగతి నలరెన్ 133

ఉ॥ వారిజగంధులత్తఱిని వారిజకేళులవెన్కనీఁదుచో
వారక పైఁటచాటునను వాటిలు చన్నులు తేజరిల్లె బం
గారపుఁదీఁగెలందుఁ గవగాఁదగివ్రాలిన చక్రవాకముల్
మారుఁడనుగ్గిరాతు వలమాటునఁ జిక్కి మెలంగుకైవడిన్ 134

వ॥ ఈలీలనమ్మరాళగమన చేడియలుం దానును జలకేళుల విలసిల్లి సరోవరమ్ము
వెడలి 135

చ॥ జలరుహనేత్ర యత్తఱిని సారసతీరముఁ జేరి యుండుచో
వలిపము మేననంటి మెయివాటిలు కాంతులు వల్వపైని రం
జిలఁగను మించుబోణి కడుఁ జెన్నలరారెను జూడవేడ్కఁగా
మెలపునఁ బల్కనేరిచిన మేలిమి బంగరుబొమ్మ కైవడిన్ 136

వ॥ అంత. 137

సీ॥ తడివల్వ సడలించి తరుణియొక్కతె కావిపావడ ధరియించెదేవమీఱె
జిల్గువల్వము మేనఁ జెలియయొక్కతె కట్టి రవికరోపమమైన అవికఁదొడిగె
నెఱికురుల్ తడియార్చి నివిరికొప్పునమర్చి విరిసరుల్ వెసనిల్పె వెలఁదియొకతె
నుదుటఁ గస్తురిబొట్టుఁ గదియించి నెమ్మేన రతనంపుసొమ్ములు రమణియునిచెఁ

గులుకుఁ బన్నీట మెలఁదిన కలపమెదను
గలికియొక్కతె యలఁదె నాకలువకంటు
లటు లలంకృతగాత్రలై యలరి చనిరి
సత్యతోఁ గూడి మణిమయసౌధములకు 138

తే.గీ॥ చని సరసభోజ్యము లఖండశర్కరాది
కలితపానీయములఁ గాంచికాంచి చంద్ర
కాంతవేదికలను సూనకలితతల్ప
ములను సుఖియించుచుండె నమ్ముదిత యపుడు 139

వ॥ అని తెల్పినఁ బరితుష్టాంతరంగులై శౌనకాదిమహామునులు రోమహర్షణ తనూభవు నవ్వలి వృత్తాంతంబుఁ దెల్పుమని యడుగుటయును. 140

**: ఆశ్వాసాంతము :**

మ॥ గజరాజావనదక్షదక్షతనయాగ్రైవేయకత్వస్ఫుర
న్నిజనామోత్కటధామధామనిచయోద్వేలోల్లసత్కౌస్తుభా
శ్మజితోద్యద్రవిబింబబింబసదృగోష్ఠశ్రేష్ఠగోష్ఠాంగనా
వ్రజరుచ్యాననశోభశోభనమహాగ్రావాగ్రజాగ్రద్గృహా 141

మాలిని॥ దినమణిశతతేజా! దీనమందారభూజా!
సనయగుణసమాజా! శంబరద్విట్తనూజా!
మునిమధుపసరోజా! ముక్తిసంధాయిపూజా!
వినతవిధిబిడౌజా! విశ్వలోకాధిరాజా! 142

గద్య॥ ఇది శ్రీమాడభూషికులపయోవారాశిసుధాకరవేదాంతాచార్యతనూభవవైన తేయకటాక్షలబ్ధవిద్వత్కవిరాజమనోరంజకసంగీతసాహిత్యకవిత్వచతుర నరసింహాచార్య ప్రణీతంబైన వల్లవీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యాన ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

---

*1. శోభనమందిరునకు సురసేవ్యునకున్ – పూ.ము.పా.*

*2. జూడనీవవదేల – పూ.ము.పా.*

*3. ధారాక – పూ.ము.పా.*

శుభమస్తు

# వల్లవీపల్లవోల్లాసము

## ద్వితీయాశ్వాసము.

కII శ్రీలక్ష్మీతటిదంచిత । నీలాంబుదరుచిరదేహనిరుపమమణిపుం
జాలంకృతనిర్జరమకు । టాలంకృతచరణ శోభనాచలరమణా 1

వII అవధరింపుము మదనగోపాలచరిత్ర శ్రవణసంజాతకుతూహలులగు శౌనకాది మునీంద్రులకుఁ దత్కథాసీధుపరిమళితహృదయకమలుండై సూతుండిట్లనియె, నివ్విధంబున నక్కోసల రాజనందనారత్నంబు విలసిల్లుచున్న సమయంబున నొక్కనాఁడు. 2

### : నగ్నజిత్తు కొలువునకు నారదుఁడు వచ్చుట :

సీII మగువ యొక్కతె సూనమంజరీవ్యజనంబుఁ గేఁల దాలిచి గాలిఁ గీలుకొలుపఁ
గలవాణి యొక్కతె కర్పూరబాగముల్ దనరారు తాంబూలదళములొసఁగ
జలజాక్షు లిరుగెలంకులఁ జామరంబులఁ బూని రంజిల్లియింపుగను వీవఁ
గనకాంగి యొక్కతె కనకదండంబుచే వగఁగుల్కు గొడుగుఁ జేఁబట్టి మెఱయఁ
దగిన బంధుజనంబు లత్తఱిఁ జెలంగఁ
దనయులొకచెంతఁ జెల్వొందఁ దనదు తన్వి
తోడ నిష్టానులాపము లాడుకొనుచు
నంతిపురిఁ గొల్వుఁదీర్చె నయ్యవనివిభుఁడు 3

కII ఈకరణిఁ దల్లిదండ్రులు । ప్రాకటముగఁ గొల్వునందు భాసిలుచుండన్
రాకేందుముఖులతోడను । శ్రీకరముగ సత్యయునటఁ జేరెను వేడ్కన్ 4

కII వచ్చిన కూఁతుంగని మది । నెచ్చిన వేడ్కను వసుంధరేశుఁ డపుడు తా
నిచ్చం దొడపై నిడుకొని । యచ్చో నిటుపల్కె సుజను లచ్చెరువందన్ 5

కII ఈజగమునఁ దగిన వరుం । డీజలజాననకుఁ జూడనెవ్వం డనియా
రాజేంద్రుఁ డనఁగ బంధువు । లాజాడను బెండ్లిమాటలాడుచునుండన్ 6

కII శారదనీరదపారద । శారదలఁ దిరస్కరించు శారీరరుచిన్ ।
నారదుఁ డాత్మవిచారవి । శారదుఁడా సమయమునను జనుదేరంగన్ 7

ఆ॥ నగ్నజిద్విభుండు నయమొప్పఁగా మౌని । చంద్రు నెదురుకొనుచు సరసమైన
పూజలొసఁగితెచ్చి భూరిపీఠంబున । నునిచి యిట్టులనియె నుచితలీల 8

శా॥ ఏదైవంబులఁ బూజచేసి సతతంబేమేమిధర్మంబులన్
మోదంబొప్ప నొనర్చినారమొకొ మిమ్ముంజూడఁగాఁ గల్గె మీ
పాదాంభోజపరాగసంగతి మహాపాపంబులంబాపు మీ
రేదేశంబుల సంచరించి యిటకిట్లేతెంచుటల్ నారదా 9

వ॥ అనిన నమ్మానవేంద్రునకు దేవమునీంద్రుండిట్లనియె. 10

గీ॥ శ్రీనివాసుని యర్చావిశేషదివ్య
దేశముల రమ్యపుష్కరతీర్థములను
సత్రయాగాదిసత్కర్మసముదయముల
నలరుచున్నట్టి వసుమతీతలమునందు 11

సీ॥ శ్రీరాజదుభయకావేరీధునీమధ్యసీమను మహనీయశేషశాయి
శ్రీరంగనాథుని సేవించి కాంచీవరదరాజుల భజించి రమ్యశేష
గిరియందు వేంకటేశ్వరునంఘ్రులకు మ్రొక్కి శోభనాచలమందు సొంపుగాను
సిరులఁ జెల్వొందు లక్ష్మీనారసింహుని భక్తిపూర్వంబుగాఁ బ్రస్తుతించి
భద్రశైలంబునను రామభద్రుఁ గాంచి
చెలగి సింహాద్రిపై నరసింహుఁ జూచి
యటులఁ బురుషోత్తమక్షేత్రమందు విబుధ
సేవ్యుఁడైన జగన్నాథు సేవఁజేసి 12

వ॥ మఱియుందక్కిన దివ్యక్షేత్రంబుల సంచరించుచు గంగా కావేరీ కృష్ణవేణి గౌతమీ యమునాది పుణ్యతీర్థంబుల స్నానంబుసేయుచుఁ దద్దర్శనమజ్జన విశేషకౌతుక పులకితగాత్రుండనై కొన్నిదినంబులీరీతి వర్తించుచు బదరికాశ్రమ వాసి నారాయణ చరణసేవా కుతూహలుండనై వచ్చుచు ద్వారకానగరంబున లీలాగృహీత శరీరుండైన హరింగాంచి తదీయ విలాసావలోకనపరవశుండనై కొంతకాలంబా పురంబున నుండి తదనుజ్ఞాలంకృత శిరస్కుండనై మరలివచ్చుచో నిన్నుంగాంచితినని తెలిపిన నక్కోసలవిభుండు వినమితాంగుండై యిట్లనియె. 13

క॥ ద్వారక చక్కఁదనంబున్ । వారక నానగరమేలు వసుదేవజు సు
శ్రీరమ్యచరితమున్వినఁ । గోరితి మౌనీంద్ర తెల్పు కూరిమిమీఱన్ 14

వ॥ అనియడిగిన మౌనీంద్రుండిట్లనియె. 15

## : ద్వారకానగర వర్ణన :

సీ॥ వరణాగ్రహితసుధాకరశిలాదీధితి ప్రకరచంద్రాయితభాస్కరంబు
సౌధాగ్ర కామినీ సంగీత సాహిత్య సమ్మోదితామరీ సముదయంబు
కల్పవల్లీ సుమాక్రాంత కాంతామోద వాసితారామ ప్రకాశితంబు
లలితశీతలతోయకలిత ప్రవాహ సంశోభిత క్రీడాద్రి సురుచిరంబు
రమ్యసౌదామనీ లతారాజమాన
వారకాంతా సమాచార వర్ణితంబు
సరస సుందర నరవర సముదయంబు
భువనరుచిరంబు ద్వారకాపురవరంబు 16

చ॥ అఖిలపురాణ శాస్త్రనిగమాగమ మంత్రసమాజ పద్ధతిన్
ముఖరితవక్త్రులై దివిజపుంగవమాన్యు నిరాకరించి స
న్మఖబహుళర్ధి నల్లశతమన్యు హసించి వసింతు రాత్మ భూ
ముఖభవు లప్పురీవరసమున్నతహర్మ్యములన్ ముదంబునన్ 17

ఉ॥ పౌరవిరోధమున్ గఠినభావసమన్విత పక్షపాతమున్
వైరుల ధాటికోడి యొరుపంచ వసించి శరమ్ములేయుటన్
సారెకు సత్రపుతానము వెసన్మదిఁ దల్పని రుద్రులద్రులా
గౌరతురంగు లర్కు లరికర్కశు లప్పురి రాజశేఖరుల్ 18

మ॥ ధనపాలుండు కుబేరుఁడాయెననుచుం దర్కించి తత్సర్వ ది
వ్యనిధివ్రాతము లాతనివ్వదలి తత్పుణ్యస్థలిం జేరెనో
యన వైశ్యోన్నతరమ్యగేహముల ధాన్యస్వాంబరానర్ఘనూ
తనరత్నావళు లొప్పె శంఖములు పద్మంబుల్ మహాపద్మముల్ 19

ఆ.వె॥ హలముఁ గేలఁ బూని బలరాముఁ డిలనేమి
ఫలము జనులకొసఁగి యలరెననుచుఁ
జెఱకురాజనంబుఁ దఱుచుపండింపుచు
మోదదాయు లచటి పాదభవులు 20

చ॥ హరిహయుధాటికోడి కలశాంబుధిఁ జొచ్చిన భూధరంబు లీ
పురిఁదిరుగన్ దలంచి శరపూరమగడ్తగఁ గాపువెట్టి తా

మరయఁగఁ గుంభినీధరములై చెలువొందఁగ నిర్ఝరంబుల
య్యురుమదధారలై యలరెనో యనఁ బొల్చుఁ బురిం గరీంద్రముల్ 21

గీ॥ శుభఫలప్రదచణదివ్యశుక్తియుక్తి
మహితసంపత్తికరదేవమణులు గలిగి
రోచమానమహావర్తరుచులఁ దనరె
సింధువులనంగఁ దత్పురి సైంధవములు 22

క॥ కాంచనపటుకేతనపట । సంచలన భవానిలప్రశాంతాభ్రచర
చ్ఛంచన్మిథునరతిశ్రమ । మంచితమణిచక్రమగు రథౌఘం బచటన్ 23

ఉ॥ బెబ్బులిమీసముల్ వడిసి పేరిమి నుయ్యలనూఁగు నోపికల్
గొబ్బున మత్తవారణము కొమ్ములఁ బట్టుచుఁ ద్రోయుసత్వముల్
అబ్బురమైన సింహములనైన నెదుర్కొను సాహసంబులున్
జొబ్బిలుచుందు రెల్లపుడు చోద్యమెలర్పఁగఁ దత్పురీభటుల్ 24

వ॥ మఱియు నప్పురవరంబు మధ్యమభువనదర్శనకుతూహలాగత పాతాళనిలయ భోగిభోగాంచదరుణమణిప్రభాపుంజరంజితసలిలమీనకర్కట మకరఖరకర సుధాకరసముల్లాససంజాత గగనోపమాన శరనిధిపరిఖాసమావృతంబును, మేరుధారుణీధరడంబరాధరీకరణ చణసమున్నత వరణాచలఖచితరత్న ప్రభాపటల ధగద్ధగాయిత గీర్వాణపట్టణప్రాకారగోపురంబును, సమున్నతహర్మ్య సౌధప్రాసాద చంద్రశాలాది భవనాంతరనితాంత పుంభావాంత తాంతకాంతాస్త నాంతఃప్రదేశావాంత శ్రమసలిలసంతాన మలిమ్లుచీభవద్గగనధునీశీకర శీతల నందనవన మాకంద మందార మంజరీ పరిమళ ఘుమఘుమితాంతర మాధవీనికుంజ నిర్గళ న్మరుత్కందళ విరాజితంబును, నరుణకోమల పల్లవరాగ శుకపిక వాణీవిలాస కాముకగేహాయిత సముల్లసిత వకుళవంజులపున్నాగ మాకందకుంద మందారాది భూరుహ విరాజమానోపవన మధ్యభాగభాసమాన క్రీడాగిరి పరిసరశశికర ప్రాసాదనిష్యంద కాంచనమయ వితర్దికాస్థగిత చంద్రకాంత జలపూరిత కమలకల్హార సుగంధబంధుర దీర్ఘికా క్రీడదమందానంద పౌరజన బృందంబును, గార్త్స్వరదండకేతన శతవిరాజమా నాట్టాలక గోపురాలంకృతం బును, లసమానశోభాపుంజ నిగనిగాయమానోదార శశిశునాసీర శిలాతల భాసమానవేదికావిలాసంబును, ముక్తారత్నశ్రేణీ ధుర్యగేహాళీ సౌందర్యలసిత గారుత్మతమణినిర్మితాగ్ర సముదగ్రప్రవాళ స్తంభాంచిత ద్వారరాజద్వజ్రమయ

కవాటంబును, సరసహీరమణిమంజుల సాలభంజి కాపుంజరంజిత బలభిన్మణిస్థగిత శాతకుంభస్తంభ సహస్రభాసిత రాజసభానికేతనంబును, గైలాసనగరముపగిది నీలకంఠాభిరామంబును, శ్రీరామసైన్యంబువలె సుగ్రీవగజాభిరామంబును, శ్వేతద్వీపంబుకరణిఁ బరమ పురుషవిరాజితంబును, శ్రీపతివక్షఃస్తలసమంబై వనమాలికారంజితంబును, చతుర్ముఖసదనంబుకైవడి బహుశ్రుతివిశ్రుతంబును, రాజరాజనివాసంబు పోలికఁ బుణ్యజనానంద కరంబును, సంక్రందన నగరంబువైఖరి సుమనో విలాసితంబై, యయోధ్యానగరంబు మాడ్కిఁ బంక్తిరథాంచితంబై, సమస్త సంపదాకరంబై, సకలభూచరఖేచర లోచనానందకరంబై, బ్రహ్మాండంబున మెండుమీఱి యొప్పుచుండు. 25

కః ఆనగరంబున కధిపతి । యై నగసమధైర్యుఁడంబుజాక్షుఁడు కమలా
జాని పరాక్రమనిర్జిత । గోనగరీవిభుఁడు దనరె గోపాలుఁ డనన్ 26

వః అమ్మహానుభావుని యవతారక్రమంబును, లీలావిశేషంబును, బలపరాక్రమాతి శయంబును, ననుపమానసౌందర్యంబును, గల్యాణగుణాకరత్వంబును, విచిత్ర చరిత్రంబును వివరించెద సావధానచిత్తుండవై యాకర్ణింపుము. 27

## : శ్రీకృష్ణుని లీలా విశేషములు :

సీః క్షీరాంబునిధియందు శేషతల్పంబున విలసిల్లుచున్న శ్రీవిష్ణుమూర్తి
వసుమతీభారంబు వారింపఁగఁ దలంచి వసుదేవతనయుఁడై వన్నెమీఱఁ
బొత్తిళ్లలోనుండి పూతన హింసించి శకటంబుఁ బడవైచి ప్రకటముగను
సుడిగాలియై పైనఁబడిన తృణావర్తు నేడాదిబాలుఁడై యెగసిచదిమి
తల్లి తనుఱోలఁ గట్టిన నుల్లసమున
మద్దులను గూల్చి చెలువొంది మహి ఖరాది
రాత్రిచరులను దునిమి పర్వతము కేలఁ
దాల్చి దేవేంద్రు నోడించె దానవారి 28

సీః బృందావనమున నాభీరసుందరులతోఁ గందర్పకేళుల ఘనతనొందె
హింసాపరోత్తంసుఁ గంసుని ఖండించి యుగ్రసేనుని దా ననుగ్రహించె
సకలరాజన్యమస్తకములఁ దనపాదకమలంబు లునిచి లోకంబులేలెఁ
గర్మనైపుణవిశ్వకర్మసృష్ట ద్వారకాపురమ్మున నుండెఁ గాపురముగ
సనకముఖ్యచతుఃపంచషట్సహస్ర । వదనగణనీయగుణగణవరసుకీర్తి
సార్వభౌమసమున్నతచక్రవర్తి । హృతనతప్రకరార్తి శ్రీకృష్ణమూర్తి 29

ఆ॥ ఆమహానుభావుఁ డఖిలలోకేశ్వరుం । డట్లు ద్వారకాపురాధినాథుఁ
డగుచు మిగుల సిరుల నలరారుచును సర్వ । విబుధకోటి నేలువేళయందు 30

## : రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళిందీ కన్యలను శ్రీకృష్ణుఁడు పెండ్లియాడుట :

ఉ॥ భండనమందు రుక్మి శిశుపాల జరాసుతులం జయించి యా
కుండినపట్టణాధిపుని కూరిమిపుత్రిక వాసుదేవుఁ డా
ఖండలుఁ బాఱఁదోలి సుధఁ గైకొను పన్నగవైరి కైవడిన్
మెండుగఁ దెచ్చి లోకములు మెచ్చఁగఁ బెండిలియయ్యె నర్మిలిన్ 31

గీ॥ జాంబవంతున కనిఁ బరాజయము నొసఁగి
జాంబవతికన్యఁ దెచ్చి యాశార్ఙ్గధరుఁడు
పెండ్లియాడెను సురలెల్ల వెల్లిగొనెడి
సంతసంబునఁ గడువిరుల్ చల్లి యలర 32

చ॥ మునుకొని సత్యభామను సముజ్జ్వలగాత్రినిఁ బెండ్లియాడి యా
వనిత మనోరథంబుఁ బరిపాలనసేయఁ దలంచి దేవనా
థుని సబలుం జయించి హరి దోర్బల ముల్లసిలంగఁ గల్పశా
ఖినిఁ దననిష్కుటంబున సఖీప్రతతుల్ గన నిల్పె వేడుకన్ 33

ఉ॥ అందముమీఱఁ బాండుతనయాచరితంబగు రాజసూయమున్
బొందుగ నిర్వహించి మహిఁ బొల్పగు ఖాండవమున్ దహించి సం
క్రందను పొంగణంచి వనిఁ గవ్వడితో విహరించుచున్ మహా
నందమునన్ మురారి రవినందనఁ బెండిలియయ్యెఁ గూరిమిన్ 34

క॥ విందానువిందులను గో । విందుఁడు నిర్జించి జగతి విశ్రుతకీర్తిన్
బృందారకు లగ్గింపఁగ । నందంబున మిత్రవింద నటు పెండ్లాడెన్ 35

వ॥ ఇవ్విధంబున సతులతో రతులవిలసిల్లుచున్న వెన్నుని సౌందర్యాతిశయంబు
వర్ణించెద వినుము. 36

## : శ్రీకృష్ణుని సౌందర్యవర్ణనము :

క॥ హాటకరుచిరమణిమయకి । రీటము హరిశిరమున న్మరీచులఁ దనరెన్
గాటుకగుబ్బలి కొప్పునఁ । బాటిలు రవిబింబమనఁగఁ బాటవమెసఁగన్ 37

క॥ మృగమదతిలకము నగధరు । వగగుల్కు నళికమునందు వాసిగ మెఱసెన్
సొగసైన నగుమొగంబునఁ । దొగయని పైవ్రాలు చిన్నితుమ్మెద యనఁగన్ 38

గీ॥ లలితచికురాళు లధరహల్లకము పైని
వ్రాలునని భీతి నయ్యంతరాళమునను
నిశితశరకార్ముకంబుల నిలిపెననఁగ
నరయఁ గన్నులుఁ గనుబొమ్మ లలరె హరికి 39

గీ॥ తనరు మీసమ్ములను మిళిందములు దమిని
గన్నుఁదమ్ములపై దుముకం దలంప
బమ్మవిలుకాఁడు నడుమ సంపంగిములికిఁ
గూర్చెనన నాస సోగయై గులికె హరికి 40

గీ॥ బవిరిగడ్డంబు మీసంబుఁ బరిఢవిల్ల
శౌరివదనంబు విలసిల్లె సరసముగను
మబ్బుతునియల మాటున మసలుచుండి
డంబుమీఱిన చంద్రబింబంబుపగిది 41

సీ॥ శ్రీకారములతీరు చెలువొందుఁ జెవులందుఁ జెక్కుటద్దమ్ము లేచెక్కులందు
బింబరాగంబుచే డంబుమీఱును మోవిరదనముల్ రాజీవరాగమణులు
చిరునవ్వుచంద్రిక సిరులచే విలసిల్లు దరసుందరతచేతఁ దనరుగళము
ఆజానులంబి బాహాదండములు మత్తవేదండతుండరమోదయములు
కాంతవనమాలికాకౌస్తుభాంతరాళ
వాసలక్ష్మీపయోధరభాసమాన
మృగమదోపమలాంఛనమిళిత మగుచు
వక్ష మమరెను బుండరీకాక్షునకును 42

సీ॥ నిఖిలపద్మభవాండనీడమౌను దరంబు గగనంబు కౌనుసోయగముఁజూడఁ
వరనాభికంజంబుపై వ్రాలు తుమ్మెదబారు చెన్నలరారు నారుహొయలు
కరితుండములఁగేరు కనదూరువులతీరు కమఠంబులనఁ బ్రపదములు దనరు
ఘనజంఘలలనిషంగములు నావిలసిల్లు హల్లక చ్ఛదనంబు లంగుళములు
దర రథాంగ వరాంకుశ ధ్వజసరోజ
కులిశ హల ముఖ్యరేఖలఁ జెలువునొంది

సరసిజారుణకోమలగరిమ నలరి
చరణయుగళంబు తనరారు మురహరునకు 43

గీ॥ నల్లని బలాహకము లీల నుల్లసిల్లు
మేనఁ బచ్చని వలిపెంబు మెఱుపుదీఁగె
కరణి నొప్పారు నెట్టని కలపమరుణ
కిరణఘృణికాంతి యనఁగ నాదరధరునకు 44

గీ॥ పంచశిరముల విలసిల్లు పన్నగముల
మాడ్కి రాజిల్లె భుజములు మధుహరునకు
మౌళులందున వెలుఁగొందు మణుల కరణి
నంగుళంబులఁ జెలువొందె నుంగరములు 45

గీ॥ గళభుజభ్రూకటులతోడఁ గదరియెదురు
కొనినవని బల్మిచేఁ బట్టికొనె ననంగ
నంచితదరారిముఖ్యపంచాయుధములఁ
గరముఁ దనరారు శ్రీహరికరము లెలమి 46

గీ॥ తనరె నిరత మనంతాసితవిబుధుండు
ఘనతులోచ్చావినీచభావనల ననుచు
మనుజు లెన్నంగ గోపకుమారుఁ డెలమి
శ్రవణసంగత మకరాంక సహితుఁ డయ్యె 47

చ॥ మణికనకప్రభాకలితమంజులభూషణదీధితుల్ మహా
ఘననిభశౌరిదేహమునఁ గ్రమ్ముకొనన్ విలసిల్లుచుండె నం
జనధరణీధరంబున విసారివిభావసుపాటలీభవ
ద్ఘృణిగణదీప్తులో యనఁగఁ దేజమునొందుచు మాటిమాటికిన్ 48

సీ॥ శౌరిప్రతాపతేజోరాశియెదుట ఖద్యోతబింబంబు ఖద్యోతమయ్యె
హరియశోరాశిముందరఁ జంద్రబింబంబు తారకాకాంతి కాధారమయ్యె
వసుదేవసుతదయారససుధావృష్టిచేఁ దనరె లోకము లౌషధములకరణి
గోవిందకళ్యాణగుణకల్పశాఖికి సురలు కోరకముల సొంపునొందెఁ
బత్రిహయు చిత్రనాటకసూత్రమునకు । బొంగరమురీతి విశ్వంబు పొరలితిరిగె
నట్టి శౌరిని నెన్నంగ నలవియగునె । నలువకైనను వేనోళ్లచిలువ కైన 49

సీ॥ సూనబాణునితండ్రియైన గోపాలుని యందలి సౌందర్య మడుగనేల
పుండరీకాక్షుఁడై పొలుపునొందినవాని యవయవాతిశయంబు లడుగనేల
లక్ష్మీసమాశ్లేషలసమానుఁడౌ వాని యైశ్వర్యసంతతు లడుగనేల
వాసుదేవాఖ్యచే వన్నెమీఱినవాని యఖిలాధిపత్యంబు నడుగనేల
విశ్వసృష్ట్యాదికర్తయై వెలయువాని
యందు లీలాతిశయముల నడుగనేల
సచ్చిదానందమయుఁడైన శార్ఙ్గపాణి
యమితకళ్యాణగుణముల నడుగనేల 50

సీ॥ రుక్మిణీకమనీయలోచనోత్పలపూర్ణరాకాసుధాకరరమ్యవక్త్రు
జాంబవతీవక్త్రజలజాంచితమరందలోలుపమధుకరీలోలనేత్రు
సత్యభామాసతీసౌదామనీలసన్నీలనీరదరమాశాలిగాత్రు
మిత్రవిందామిత్రపుత్రీమయూరీవినోదగర్జితతుల్యనాదపాత్రు
మదనశతకోటిలావణ్యు మఘవదాది । దివిజగణనీయగుణగణ్యు భవశరణ్యు
దివ్యచారిత్రు దేవకీదేవిపుత్రు । నెన్నశక్యంబె జగమందు నెవరికైన 51

గీ॥ ఆమనోహరసౌందర్య మావిచిత్ర
చరిత మారూపయౌవనసంపదయును
నామహౌదార్యగుణగణ మామహాప
రాక్రమముఁ జూడ నెవరియందైనఁ గలదె 52

క॥ అని యనిమిషముని తెల్పిన
విని హరికథ మనుజవిభుఁడు వేడుకతో నా
మునిచంద్రుని వినుతించుచు
ననుపమముగఁ బూజఁజేసె నతిహర్షమునన్ 53

వ॥ అంత నారదుండు శ్రీకృష్ణలీలావిశేషవర్ణనంబువలన నచ్చటిజనుల నభినందింపం జేసి నగ్నజిద్వల్లభునాజ్ఞవడసి బదరికాశ్రమంబునకుం జనియె నక్కోసలధరా రమణుండును శౌరిచరిత్రశ్రవణ కుతూహలితాంతరంగుండై కొలువుడిగ్గి శుద్ధాంతంబునకుం జనిన యనంతరంబ 54

## : శ్రీకృష్ణునిపై నాగ్నజితి మరులుఁగొనుట :

గీ॥ శౌరిసౌందర్యసద్గుణసరసచరిత
ము ల్విని తలంచుచున్ సత్య మోహజలధి

మగ్నయై చేడియలతోడ మరలి దివ్య
భవనమున సూనశయ్యపైఁ బవ్వళించి 55

వ॥ ఇట్లని వితర్కించె. 56

ఉ॥ నారదమౌని యేల నరనాథునిఁ జేరఁగ వచ్చె వచ్చినన్
నీరజనాభుదివ్యకథ నేర్పున నేటికిఁ దెల్పెఁ దెల్పినన్
గూరిమిమీఱఁ దద్గరిమఁ గోరిక నేటికి వింటి విన్న న
మ్మరుని బారి కేల నను గ్రమ్మఁజేసెను దైవ మక్కటా 57

ఉ॥ వెన్నెలరాయనిం దెగడు వెన్నుని ముద్దులుగుల్కు మోము నా
కన్నులచల్లఁగా నెపుడు కన్గొనఁగల్గునో వానికౌఁగిటన్
బన్నుగఁజేర్చి మోవి మునిపంటఁ జుఱుక్కున నొక్కుటెన్నఁడో
క్రొన్ననవిల్తుకేళులను గూరిమిమీఱ సుఖించుటెట్లొకో 58

గీ॥ నందనందనుఁడీ పట్టణమున కేల
వచ్చు వచ్చిన గిబ్బల యెచ్చుణంచి
యలరి ననుఁ గౌఁగిటను జేర్చుననుచుఁ గొంత
సేపు చింతించి మదిలోనఁ జిగురుఁబోణి 59

మ॥ తమకం బగ్గలమాయె డెందమున నేఁ దాళంగలే నేయుపా
యము నాకెవ్వరు దిక్కు తాపమున దేహంబేమి గానున్నదో
కమలాలోలుని చెంతకేగి యెవ రేకాంతంబునం దెల్పి యీ
శ్రమఁదీర్పన్ దమకింతు రంబుజనిభూసంకల్ప మెట్లున్నదో 60

గీ॥ తల్లిదండ్రులతోడ నీతలఁపుఁ దెలుప
వలెనటంచుఁ దలంచి యావలను జూడ
సిగ్గునోరెత్తనియ దేమిసేయుదానఁ
గన్నె లొరుచాటు వారలు గారె పుడమి 61

గీ॥ చెలిమిచే మంచిచెడ్డలు చెలులు నుడువఁ
దగినవారని నమ్మిచెప్పఁగఁ దలంతు
నేని వికవికలాడుటే కాని పనులు
చక్కసేయంగ నేర్తురే నిక్కముగను 62

వ॥ అని వితర్కించుసమయంబున 63

## : నాగ్నజితి విరహము :

ఆ.వె॥ మచ్చరమున నెచ్చి మారుండు పచ్చని । వింటతేఁటినారి వేగనెక్కు
వెట్టి బెట్టిదంబునెట్టిగోలలఁ గూర్చి । తిగిచి యెదచుఱుక్కనఁగఁ దగిల్చె 64

క॥ మరుశరములు సతిగురుకుచ । గిరులదవుల నపుడది శరగిరియోగమనన్
బరగెన్ శ్రమజలవర్షము । కురిసె న్నిట్టూర్పుగాలి గుబ్బున వీచెన్ 65

సీ॥ చంద్రాననకుఁ బూర్ణచంద్రాతపము మహోఘోర్మోష్ణకరకాంతికరణిఁ దోఁచె
మృగరాజమధ్యకు మృగనాభికలితమౌకలపమ్ము వసనాభివలెను దోఁచెఁ
బల్లవాధరకు మేల్‌చల్లనితెమ్మెరల్ వజ్రాంకురమ్ముల పగిదిఁ దోఁచె
జలజాయతాక్షికుజ్జ్వలసూనజాలముల్ పటుసూచికాతతిభంగిఁ దోఁచెఁ
గుటిలచికురకు శుకపికార్భటులరుంతు
దములుగాఁ దోఁచెఁ జెలులవాక్యములు వీను
లకు నసహ్యములయ్యె బాలిక కయోగ
విప్రలంభంబువలన నవ్వేళలందు 66

చ॥ చిలుకలరావముల్ చెలికిఁ జిల్కులుగాఁ గనిపించె నత్తఱిన్
మలయనగాశుగమ్ము లటు మానిని కొప్పె శితాశుగంబులై
లలితసుగంధచందనశరమ్ములు చూడ శరంబులయ్యె న
య్యలికులవేణికి న్మరుశరావళిఁగా జగమెల్లఁ దోఁపఁగన్ 67

వ॥ ఆసమయంబున. 68

చ॥ పిలువకమున్నె తాఁ బలుకు బేలతనంబున మాటలాడుచున్
గలఁచుచుఁ గల్వరించుఁ గడుఁ గౌఁగిటఁ జేర్చు బయల్దనంతనే
కులుకుచు నవ్వు సొమ్మసిలుఁ గూరిమిచేఁ దలయూచు నల్కు న
వ్వలమురిదాల్పుపై వలపువాసిగ నిల్పి లతాంగి వింతగన్ 69

గీ॥ చెలుల నరచూపులన చూచి చెలిమి మాని
చిమ్మి కొనగోటఁ గన్నీరుఁ దమ్మికంటి
వేల్పు మదిఁ దల్చి వేమఱు వెలఁది మిగుల
వగలఁ బొగలుచు మరుబారిఁ దగిలియుండె 70

## : చెలులు నాగ్నజితి స్థితినిఁ జూఁచి కారణమడుగుట :

కII లీలావతు లాలీలను । బాలామణి చెందుచున్న పరితాపముఁ దా
రాలోకించుచు గములై । యాలోచనచేసి పల్కిరా సమయమునన్ 71

చII కిసలయపాణి వేడుకను గీరము పిల్చినఁ బల్క వేమి నీ
దెస విలసిల్లు నెచ్చెలులఁ దేరి కనుంగొన వేలకొమ్మ యీ
పసగలగంధమీవు మెయిపాటిలఁ జేయవదేమి కోమలీ
కుసుమసరమ్ములందినను గొప్పునఁ గూర్పవదేమి నెచ్చెలీ 72

సీII సొంపొందు బల్తేటిగుంపులౌ తగుకురులింపుగాఁ గొప్పుఁ గావింపవేల
నుదుటఁ గస్తురిబొట్టుఁ గదియించి మేననందమ్ముగా సొమ్ములు దాల్పవేల
దళ్కుచెక్కులను గంధముఁ బూసి నెఱతావివిరిసరుల్ వేడుకఁ దురుమవేల
కన్నుఁదమ్ములఁ గాటుకనొసంగి యడుగుకెందమ్ముల లత్తుకఁ దాల్పవేల
గుల్కు కపురంపుఁబల్కులు వల్కవేల
కోర్కిదీరంగ నన్నంబుఁ గుడువవేల
విడెము పుక్కిటనిండఁ గావింపవేల
తెఱవ నీకేటి కీలాటితెఱఁగు చెపుమ 73

ఉII కోమలి యేమె నీచెలిమిఁ గూడినవారము గామ మాపయిన్
బ్రేమయొకింతలేక యిటు భేదమొనర్చెదవేల వేమఱున్
గాముని పువ్వుటమ్ములకుఁ గందెఁగదే మృదువైనమేను నీ
కేమనుజేంద్రుపైనివల పింతటనైనను దెల్పవే సఖీ 74

గీII వెలఁది నీచనుబంతు లుద్వేలమదన
తాపమును జెంది కసుగందెఁ దలిరుటాకు
కాదనన్‌జాలి రంజిల్లు నీదుమోవి
వేఁడినిట్టూర్పుపైసోఁకి వాడెనమ్మ 75

ఉII పున్నమినాఁటిచందురుని బోలెడి నీదుమొగంబు నందు లే
వెన్నెలవంటినవ్వు కడువేడుకమీఱఁగఁ గానరా దయో
కన్నియ నీదు చెక్కులవికాసము వీడెను వెంటవెంటనే
కన్నుల నీరునిండి నునుకాటుక జాఱెనిదేమె కోమలీ 76

గీ॥ ఈవిధంబునఁ జేడియ లింపుమీఱఁ
బలుకరింపఁగఁ గోసలపతితనూజ
భావమున మీఱు భావజుబాధఁ జెలుల
తోడ సిగ్గున మెల్లనఁ దొడరిపల్కె 77

ఉ॥ దేవమునీంద్రుఁ డిచ్చటికిఁ దేజము మీఱఁగ వచ్చి కొల్వునన్
భావజుతండ్రిదివ్యకథ భాసిలఁ దెల్పిన నాఁటనుండి తా
నావిభుపైని నాదుహృదయంబు నిరూఢిగ నాటియున్న దిం
కేవిధినైన వాని మదికింపుగఁ జేడియలార కూర్పరే 78

క॥ కన్నియలార మనోవ్యథ। పన్నుగఁ దెల్పెదను దాఁపఁబనియేమిఁక నే
విన్నదిమొదలుగ వెన్నుఁడు। కన్నులఁగట్టిన విధంబుగాఁ గనుపట్టెన్ 79

గీ॥ హరిమనోహరరూపంబు సరసచరిత
మమితకల్యాణగుణములు నపుడు దేవ
మౌని తెల్పిన విధమెల్ల మదిని నాటి
మరపురా దేమిసేయుదు మగువలార 80

ఆ.వె॥ చిన్ననాఁటనుండి చెలఁగి యేనొనరించు। నేస్తమెదఁ దలంచి నేర్పుమీఱ
నాదుకోర్కిదీర్చి నన్నుపాలింపరే। మీకృతంబు మరువ మెలఁతలార 81

**: చెలులు నాగ్నజితికి హితవు చెప్పుట :**

క॥ అనిపల్కి పణఁతి మరువే। దనచేఁ బొగలుచును మిగులఁ దల్లడపడ న
వ్వనితలు గములై మానినిఁ। గనుఁగొని యారీతి హితముగాఁ బల్కిరొగిన్ 82

క॥ నీవెన్నఁడైనఁ బన్నుగ। నా వెన్నుని మున్ను కన్నులారఁగఁ గంటే
నీవింతవగలఁ బొగిలెద। వీవింతలు నృపతివిన్న నేమనునో సుమీ 83

క॥ పాయను బరితాపంబు ను। పాయముఁ జింతింపవమ్మ పణఁతులకెపుడున్
బాయము పరికింపఁగ నన। పాయముకాదమ్మ కొమ్మ బంగరుబొమ్మా 84

గీ॥ బోటిరో నీవు పెద్దలచాటుదాన। వాటపాటలు మాని యానాఁటికిటుల
హాటకాంబరుపై బుద్ధి నాటఁజేయ। సాటివారలు నగరె యోపాటలోష్ఠి 85

వ॥ ఇవ్విధంబునఁ బల్కునెడ నక్కాంతారత్నంబు రతికాంతజనకస్మరణసంజాత
వేదనాతిరేకచలితస్వాంతయైకుసుమకోదండనిష్యందామందమరందబిందు

సందోహానందితమిళింద శింజినీమంజుఝంకారటంకారసంకలితకందర్ప శరాసారంబువలన నరుంతుద శుకపికశారికానికరారావంబువలన నప్పల్లవాధర డిల్లఁబోయియున్న సమయంబునఁ జెలులన్నెలఁతం గనుంగొని దురంత చింతాక్రాంతలై యుపవనాంతరసంచారంబువలన సంతాపంబు విశ్రాంతిం జెందునని భ్రాంతింబొందించి బలాత్కారంబున నయ్యింతిం దోడ్కొని యా రామంబునకుం జని యచ్చట హంసకారండవ చక్రవాకాది విహగ కూజితాక్రాంతవికచకమలకల్హారపరిమళ ఘుమఘుమితశీతల సలిలపూరిత సరస్తీరవిరాజమానసుధామయ సౌధపరిసరంబున విచికలనిచయ మంజు కుంజాయతవితానంబుదిగువ శశికాంతమణికీలితవితర్దికోపరి భాగంబునఁ గిసలయవిరచితశయ్యపై నక్కోమలి నునిచి నెలరాల గిన్నెలచలువలూరు పన్నీట మెలందిన కలపమ్ము వలుదగుబ్బల నల్లన నలఁదుచు, నలరుననఁటులవలన జాఱిన కపురంపు రజంబుపయిం జల్లుచు, సరసపరిమళసుమసముదయనిర్మిత వ్యజనంబులఁ జల్లగా విసరుచు, లలితశైత్యోపచారంబులు నేర్పుమీఱ సలుపుచున్న సమయంబున. 86

క॥ సూనశరాహతి నొగిలిన<br>చానవెతల్ గానలేక జాఱినపగిదిన్<br>భానుఁడు గ్రుంకెను సదయుల్<br>మానవతీపరిభవంబు మహిఁ జూతురొకో 87

వ॥ అప్పుడు. 88

## : సూర్యాస్తమయము :

గీ॥ ద్యుమణిరథనేమిహరిఖురోద్ధూతచరమ<br>శైలగైరికరేణువుల్ చదలుగప్పె<br>ననఁగఁ బడమరఁ బద్మరాగతిశాయి<br>డంబరంబైన సాంధ్యరాగంబు వొడమె 89

గీ॥ వెలఁది యెదనుండు విరహాగ్ని విపులధూమ<br>మడరె నిట్టూర్పులననంగ నమరెఁదమము<br>కణఁగి యెగసిన విస్ఫులింగములకరణి<br>దఱుచు తారక లంతనంతటను దోఁచె 90

ఉ॥ మారుఁడు పూలగోలలను మాటికిమాటికి నేయసాగినన్
వారక కన్నుఁదమ్మి తరవారిని ద్రుంచునటంచుఁ దోడుగా
నీరజవైరి పొల్చికడు నింగిఁజెలంగి సతీవిలాపమున్
గూరిమిఁగాంచి నవ్వెననఁ గ్రొన్నెలవెన్నెల మించె నత్తఱిన్ 91

క॥ చెలి యెదఁబొల్చిన విరహా । నలమను చెలువుని విలోకనముచేయుటకై
చెలరేఁగి వచ్చెనో యన । మలయానిలుఁ డలరుఁ బొదలమరువున వీచెన్ 92

ఉ॥ అంతఁ గొఱంతలేక జగమంతయు వెన్నెల నిండియుండఁగా
వింతగఁ జల్వతెమ్మెరలు వీవఁగఁ గోకిలకీరశారికల్
పంతమెలర్పఁ గూయ మధుపమ్ములు ఝుమ్మనిమ్రోయుచుండఁగాఁ
గంతుఁడు చిల్కనెక్కి సుమకార్ముకమున్ ధరియించి నెమ్మదిన్ 93

గీ॥ గండుతుమ్మెద గొనయంబు మెండుమీఱఁ
బెట్టి కట్టల్కఁ గోలలఁ బెట్టిదముగఁ
దిగిచి చేకొలఁది మరుండు మగువచన్నుఁ
గవ నడుమనేసి డాసినఁ గలికియులికి 94

గీ॥ కమ్మవిలుకాని నెఱపువ్వుటమ్ము లెదను
గ్రమ్ముకొని చిమ్మగను గొమ్మ సొమ్మసిలుచు
మూర్ఛనొందినఁ గనుఁగొని ముదితలపుడు
నేమితోఁపక యిఁకఁ గర్జమేదియనుచు 95

వ॥ ఇత్తెఱంగునఁ జింతాక్రాంతలై యవ్వలంతులు కంతుంగొలువకున్న నిన్నెలంతకు
సంతాపంబు విశ్రాంతినొందదని తలంచుచు వెండియు. 96

**: మన్మథ పూజ :**

సీ॥ గంధంబు పన్నీటఁగలిపి యంతట నల్కి చెఱుకుకంబంబులు చెలువుమీఱ
విరిజాజి గొజ్జంగివిరులు పందిలివైచి కప్రంపుమ్రుగ్గు లగ్గలికఁ బెట్టి
పరువంపుఁబూలతో మరువంపుఁ దడిగట్టి పొలుపైన వగగుల్కు చలువజగతి
పైనఁ గెందమ్మి చప్పరమువన్నెనమర్చి యగరుధూపములిచ్చి మృగమదమున
మదను రతియుక్తునిఁగఁ జేసి యెదుట మెట్ట
తామరపుగద్దెపై నిల్పి తరుణులెలమి

గంధమాల్యాక్షతలు పూజగా నొసంగి
యొప్పుగా నుపహారమ్ము లొసఁగియపుడు 97

కII పుట్టితి విందిర కడుపునఁ
బట్టితివి సుమాయుధంబుఁ బ్రమథాధిపునిన్
గొట్టితివి యశము జగమునఁ
జుట్టితివి సురల్ నుతింప సొంపున మదనా 98

గీII శంకరవిరించిహరులు నిశ్శంకముగను
జంచలాక్షీదృగంచలచలితమాన
సాంచితులు గారె నీదు మాహాత్మ్యముసను
బంచశర! మార! చిల్క బాబావజీర 99

గీII చందురుఁడు మేనమామ వసంత మలయ
మారుతంబులు మిత్రులు మాత లక్ష్మి
తండ్రి హరి గాన నీకీవిధమున మేము
సోదరులమయ్య! మము దయఁజూడవయ్య ! 100

వII ఇత్తెఱంగున వినుతించుచుఁ గంతునివలన నావంతైన సంతసంబుచేకూరమికి నవ్వలంతులు వింతనొందుచు నవ్వసంతసఖు సపరివారంబుగా నుద్దేశించి మఱియు నిట్లనిరి. 101

## : ఉపాలంభనములు :

సీII అందమా యేచుట మందమారుతమా మిళిందమా పున్నమచందమామ
వైరమా మాతో మయూరమా వాచాలకీరమా తగునె నీ మేరమాన
గోపమా లేక మాపాపమా పరభృత్కలాపమా మీకుఁ బ్రలాపమాన
వింత మాచెలితోడఁ బంతమా తగునా వసంతమా కరుణార్ద్రచింతమాన
మదన సుదతులచెంతనా కదనగరిమ
పదరి యరపది శరముల బొదవి తయయొ
మదనగోపాలుఁ గవగూడి ముదిత నీదు
మదమణంగించుఁ దాళు నెమ్మదిఁ జెలంగి 102

గీII పాలమున్నీటిలోపల బాడబాగ్ని
కరణి జగదీశుకడుపునఁ బరిఢవిల్లి

మగిడి హరుకంటిమంటల మండిపడియుఁ
బణఁతుల నలంచెదవు నీవు పంచబాణ 103

ఉ॥ తియ్యనివిల్లుఁ దాల్చి కడుతేనియ లీనెడు పువ్వుటమ్ములన్
జయ్యనఁ బూని మేటిబలశాలివజీరుఁడనంచుఁ జిల్కపై
నెయ్యముమీఱ నుల్లసిలు నీమనమెంతయుఁ గ్రూరమయ్యె నీ
కయ్యమునన్ విషాగఫలకల్పుఁడవైతివి చూడ మన్మథా 104

గీ॥ మంచివాఁడవటంచుఁ బ్రపంచమునను । నిన్నుఁగొల్చెద రింతులు నేర్పులేక
తేనె బూసినతరవారితీక్ష్ణధార । కరణి విలసిల్లు నీచిత్తసరణి మదన 105

గీ॥ లేరె మాచెలి సాటి చెల్లెండ్రు నీకు । నింత దయమాలి యేలెదవేల నయయొ
సోదరీగేహశోషణచోద్యముగను । జేయు నీకిది చిత్రంబె శీతకిరణ 106

క॥ పన్నగము నిన్నుఁ గఱచినఁ । బన్నుగ బ్రతికిన విధంబు పరికింపఁగ నా
పన్నసతీదుష్కృతమని । పన్నగపతినైనఁ గేలఁ బట్టెదఁ బవనా 107

ఆ.వె॥ పాలువోసి త్రాఁచుపాములఁ బెంచిన
పగిది మిమ్ము నిలిపి పంజరములఁ
బెంచినందుల కిటు వంచింపఁ దగున శా
రికలఁ గూడి హంసశుకములార 108

ఉ॥ చల్లనివాఁడవై యిటుల చానల నేచెదవేల చంద్ర నీ
వల్లనవీవ మేను మలయానిలతాపమునొందెఁ గీరమా
మెల్లన నీవు గూయఁ జెలిమిక్కిలి సొక్కెనుజూడఁగా రతీ
వల్లభుతోడఁ జేయు సహవాసమునన్ ఖలులైతి రక్కటా 109

వ॥ అని కందర్పచంద్ర మందమారుతమిళింద శుకపికశారికాదుల నిందించి
యమ్మందయానలు మగిడి మగువ నుద్దేశించి యిట్లనిరి. 110

చ॥ అలసుఁడుదక్షిణానిలుఁ డనంగుఁడురాజు మయూరకోకిలల్
చిలుకలు పుట్టుగుడ్లు మధుసేవఁ బ్రమత్తము లాద్విరేఫముల్
చలువలఱేఁడు నిష్కళుఁడు జాలవసంతుఁడు మీఱుఁ గాన నా
కులతను వీరికై యడలి కొమ్మమనోవ్యథఁ జెందుటొప్పునే 111

వ॥ అని చతురవచనంబులఁ బలుకుచున్న సమయంబున. 112

## : ప్రభాత వర్ణన :

గీ॥ అరుణకిరుణుఁడు పద్మినీవరణమునకు
వచ్చునెడఁ గాలమనియెడు బాణకారి
తారకామండలమునేయఁ దనరె ననఁగఁ
జక్కఁగాఁ దూర్పునను వేగుఁజుక్క వొడమె 113

గీ॥ అత్తఱి విరాళినొందు నయ్యతివ వెతలఁ
గాంచి తనప్రేయసి ప్రతీచి కంతుబాధ
నిక్కరణిఁ జెందునని తోఁచి వెక్కసముగ
నస్తగిరిచాటునకు నేగె నమృతకరుఁడు 114

చ॥ కలువలఱేఁడు రేయి నిజకంజినిపైనికరప్రసారమున్
బలిమినిజేసి పర్వెనని భానుఁడు రోషకషాయితాంగుఁడై
యలరుచువచ్చెనో యనఁగ నంబుజరాగసరాగదీధితుల్
బలపరిపంథిదిక్కునఁ బ్రభాతమునన్ బ్రభవించె నత్తఱిన్ 115

క॥ భ్రమరావళి సరసిజనీ। రమణికి ఝుంకారమిషను రవినాథాభ్యా
గమముఁ దెలుపు నద్దూతిక। క్రమమునఁ గాసారదీర్ఘికల భాసిల్లెన్ 116

క॥ జక్కవలు రతికి డాసెను। ఱిక్కలగమి మిసిమిమానె ఱేపులుఁగులకున్
మక్కువలువాసెఁ జీకటి। దిక్కులకుందూసెఁ దొగలు తెలివిన్‌బాసెన్ 117

ఉ॥ భానుఁడు పూర్వభూధరముపై విలసిల్లఁగఁ దన్మయూఖముల్
మానవతీకచాగ్రకుచమండలకర్ణకరాంతరంబులన్
మానుగ హల్లకచ్ఛదనమంజులకుంకుమపంకపల్లవ
శ్రీనలినాయితంబులయి చెన్నలరారుచు నుండె నత్తఱిన్ 118

వ॥ అప్పుడు. 119

గీ॥ చెలులు సత్యను మేల్కొల్పి తలిరుజొంప
ములఁ గుసుమములఁ దద్దయుఁ బొలుపుమీఱు
పొదల నడుమను మెల్లన బోటిఁదోడి
కొనుచుఁ జనునెడ నిల్చి రక్కొలను చెంత 120

వ॥ అంతట. 121

గీ॥ సరససారసమైన యాసరసిసరస
మెలఁత నత్తన్వి నిలిపిన మేనిసెగను
నీండ్లు సలసలమనికాగె నీరజములు
స్రుక్కె నచ్చటి మధుపమ్ము లెక్కె దిశల 122

## : నాగ్నజితి విరహమును రాజహంసి చూచుట :

వ॥ ఇవ్విధంబున నెన్నిరాని మనోజపరితాపమునఁ బొగలుచుఁ దిరుగుచున్న నయ్యింతికిఁ బడంతులు శ్రమోపశాంతికరోపచారంబులు సలుపుచు మోచారస సరసవచనంబుల నూరడించుచున్న సమయంబున. 123

సీ॥ ద్వారకాపురవరోద్యానవాటికదివ్యకమలకల్హారాదికలితమైన
కాసారమున నిత్యవాసియైన మరాళరాజంబు దన రమ్యరమణితోడ
సరసంబుగా మానససరంబు మొదలైన కొలఁకుల విహరించి కోర్కిమీఱ
మరలివచ్చునపు డా సరసీవరంబున వ్రాలి వారిజగంధవాసితంబుఁ
గ్రోలి విశ్రాంతి నొంది సరోజనాళ
ములు నిజప్రియురాలితో సలలితముగ
ననుభవించుచు నచ్చట నతిశయములు
గనియు విహరించుచుండెఁ దాఁ గౌతుకమున 124

వ॥ ఆసమయంబున. 125

సీ॥ కురులు నున్నగదువ్వి కొప్పుఁబెట్టక పూలసరములు సడలించి సరభసమున
శ్రమవారిశీకరసందోహకలితమై వాడిన నెమ్మోము వంచి వగల
చెక్కిటఁ జెయిఁజేర్చి చిన్నఁబోయి మనోజవేదన నొందుచు వెచ్చనైన
నిట్టూర్పు వేమఱు నిగుడించి నెచ్చెలులుల్సల్పెడి యుచితోపచారములకు
మనసుగొలుపక దైవమా యనుచుఁ గన్ను
దమ్మిగవనీరుఁ గొనగోటఁ జిమ్మికొనుచు
మారుఁడను బోయవలలోనఁ జేరియున్న
మృగియనాఁ దల్లడిల్లు నమ్మగువఁ గాంచి 126

వ॥ ఇత్తెఱంగున ననంగవేదనను మెలంగుచున్న నక్కురంగనయనంగాంచి మరాళాంగన మనంబునఁ గటకటంబడి తనవిభునితో నిట్లనియె. 127

క॥ అక్కట యీవనితామణి । చక్కఁదనము మనము తిరుగు జగమందున మీ
రెక్కడనేనియుఁ గంటిరె । మక్కువతీరంగఁ జూడమనసై చెలఁగున్ 128

కII కిన్నరలలనామణియో । క్రొన్ననవిలుకానిముద్దుగుమ్మయొ మఱియున్
బన్నగరమణియొ నరపతి । కన్నెయొ యెన్నంగఁ గమలగర్భునివశమే 129

వII అయినను. 130

కII నీరజనాభునికరుణన్ । మీర లెఱుంగనిది కలదె మేదినిలో నీ
చారుతరగాత్రి విపులవి । చారము నొందుటకు నేమిసంగతి కనుఁడీ 131

చII అనిన మరాళరాజము నిజాంగనతో నిటుపల్కెఁ గల్కిరో
వినుమిది నగ్నజిద్విభుని విశ్రుతనిష్కుటసీమ చూడ నీ
వనిత నృపాలపుత్రి మరుబాధలఁ జెందిన రీతిఁ దోఁచు నీ
వనరుహనేత్రలం గనిన వాసిగ వీరల చర్యఁ జూచినన్ 132

వII అనిన హంసాంగన యిట్లనియె. 133

గీII లలితకోమలపల్లవకలితమైన । పువ్వుఁదీఁగనఁదగిన యీపువ్వుబోణి
మేను విరహానలంబున గ్లానిఁ జెందె । నకట దైవమజేయమౌ నజునకైన 134

వII అని వెండియు. 135

కII ఈకాంతామణి మదిలో । నేకాంతునిపైన మోహమిడి పొగలునొ నే
నేకాంతంబునఁ దెలిసెద । నీకాంతల వలననుచు నేగె నచటికిన్ 136

**: నాగ్నజితి చెలులు విరహమునకు కారణము దెలుపుట :**

కII కలహంసాబ్జవరట యా । కలవాణుల చెంతకేగి కలరవముల న
క్కలకంఠివార్త నడిగినఁ । గలకలవాక్కులను దెలుపఁ గణఁగిరి చెలియల్ 137

సీII వినవమ్మ రాయంచవెలఁదిరో యీకొమ్మ కోసలధరణీశు కూర్మిబిడ్డ
సత్యయనెడిపేర సతులలోఁ జెలువొంది సౌందర్యమున కల్మిసతిని మించి
తనరు నందనఁ గాంచి తండ్రి యీజగమందుఁ దగినయల్లుని జూడఁదలఁచునంతఁ
దనదుమంద దురాసదత నేడుగిబ్బలు వెలయంగ నెవ్వండు వీనిఁ బొదవి
పట్టికట్టునో వాని కీపడఁతి నిత్తు
నని ప్రతిజ్ఞనొనర్చిన వెనుకనొక్క
నాఁడు నరపతి చెలులతో వేడుకలర
నంతిపురిఁ గొల్వుదీర్చు నయ్యవసరమున 138

గీII నారదుఁడు వచ్చి నీరజనాభుకథలఁ
దెలిపె నవివిన్నగోలె నిత్తెఱవ మిగుల

నతనుతాపమ్మునం దనులతిక స్రుక్కc
జేయుచున్నది మేమేమిసేయcగలము 139

ఉ॥ వెన్నుcడు మాపురంబునకు వేడుకమీఱcగ వచ్చుటెన్నcడో
పన్నుగc బంతగించి వృషభప్రకరంబులc గట్టుటెన్నcడో
కన్నియకోర్కెదీర నలకౌస్తుభధారిని గూడుటెన్నcడో
కన్నులకర్వుదీర నిcకc [1]గౌతుకమొప్పcగc గాంచుటెన్నcడో 140

**: నాగ్నజితి కోర్కె తీర్తునని హంసాంగన పలుకుట :**

క॥ అని చెలులు చెప్ప సత్యం । గనుగొని రాయంచచాన కరుణన్ బలికెన్
వినవమ్మ నీదుకోరికెc । దనరcగ నేcదీర్ప నేర్తుc దథ్యము కొమ్మా 141

వ॥ అది యెట్లంటేని. 142

చ॥ వనజదళాయతాక్షి వినువారక ద్వారకవాసభూమి మా
కనిశము నందనందనునియంచలమేము ధరాతలంబునన్
దనరు విచిత్రముల్ గని ముదంబున వచ్చుచు వేడ్కమీఱ నీ
వనమున నిన్నుc జూచితిమి వావిరి నీకథ వింటి మంతయున్ 143

క॥ ఓచెలి నీచక్కcదనం । బీచక్కెరవింటివాని యెగుపున్ గడిమిన్
ఆచుక్కలదొర పోడిమి । నాచక్రధరునకుc దెల్పి యనువుగc దెత్తున్ 144

క॥ కనవమ్మ నన్నుc గన్నుల । వినవమ్మా నాదుమనవి వేడుకమీఱన్
మనవమ్మ కొమ్మనెమ్మదిc । జనవమ్మా సౌధమునకుc జక్కెరబొమ్మా 145

వ॥ అనిపలుకుచున్న నమ్మరాళాంగన పలుకులు చెవులకుc గపురంపుcబలుకులై గులుక నక్కలికి చెఱకువిలుకాని ములుకులవలన నులుకక రాయంచకలికి నుద్దేశించి యిట్లనియె. 146

గీ॥ ప్రాణదానంబు కన్నను బ్రబలమైన
దానమిట లేదcటందురు ధన్యులకట
నందనందనుc దోడ్తెచ్చి యందముగను
నన్ను బ్రతికింపుము మరాళసన్నుతాంగి 147

ఆ.వె॥ వెన్నుc డిటకు వచ్చి వేడ్కనీశుల్కంబు । నిర్వహించి మించి నేర్పుమీఱ
నన్నుc గౌcగిలించి నావెతc దీర్చునా । బమ్మవారువంపుపద్మగంధి 148

వ॥ అనిపలికి బాష్పపూరితనేత్రయైన నయ్యింతిం గాంచి హంసాంగన యిట్లనియె. 149

క॥ మాటికిమాటికి మఱినా। మాటలు వినివచ్చి వృషభమణులఁ దిగిచి ము
మ్మాటికి బంధించును వల। మాటున మృగములను బట్టుమాడ్కిం జెలియా 150

చ॥ కలికిరొ మేరమీఱు మరుకమ్మనితేనియ లొల్కుముల్కులన్
జిలుకలుగుల్కు పల్కుల శశిద్యుతికాకల గాలిధాకలన్
దలఁకకుమమ్మ నిన్ను హరి తద్దయుఁ గౌఁగిటఁ జేర్చునమ్మ నా
పలుకు నిజమ్ము కొమ్మరొ శుభమ్మొనఁగూడును నమ్ము నెమ్మదిన్ 151

వ॥ ఇవ్విధంబున నమ్మధురాధరనూరడించి యమ్మరాళమిథునంబు ఖేచర మార్గంబున ద్వారకానగరంబునకుంజనియె. అంతట సత్యయుఁ జెలులంగూడి మరాళీ వచనంబులఁ గించిదాగతధ్రుతియై సౌధాంతరంబునకుంజని చిత్తంబు కాంచనాంబరాయత్తంబుగావునఁ జిత్తజవేదనాక్రాంతయైయున్న కూఁతుంగని తల్లిదండ్రులు విషాదదందహ్యమానహృదయులై యిది యేమని తొయ్యలుల నడిగిన నచ్చెలియలుధీరచిత్తలై తద్వృత్తాంతంబంతయు నుడివిన నా రాజమహిషి యొయ్యనఁ దనయ నుద్దేశించి యిట్లనియె. 152

ఆ.వె॥ అందరానిపండ్ల కాసించు తెలియని। వారిపగదిఁ గంసవైరి కొఱకుఁ
జింతనొంది యిటులు కంతువేదనఁ జెంద। నాయమటనె నీకు నలిననేత్ర 153

వ॥ అను తల్లిపలుకులకు నప్పల్లవాధర డిల్లఁబోయిన నవ్వసుమతీ వల్లభుండు గాంచి యిట్లనియె. 154

గీ॥ తల్లి నీహృదయంబంత దల్లడిల్ల
నేటికమ్మ మురాంతకుం డిటకు వచ్చి
ముదముమీఱ స్వయంవరమునను నిన్నుఁ
బెండ్లియాడు విధంబు నే ప్రేమఁ దలఁతు 155

క॥ ఈవిధమునఁ గోసలధర। ణీవల్లభుఁ డూరడించి నేర్పునఁ గూఁతున్
శ్రీవిభుసందర్శనమును। భావింపుచునుండె జనకపరిబృఢుపగిదిన్ 156

వ॥ అంత. 157

## : గ్రీష్మఋతువర్ణన :

గీ॥ రాజహంసలు ద్వారకారాజధానిఁ
జేరి వగమీఱి మురవైరి చెన్నుమీఱు
నిష్కుటాభ్యంతరాంచితపుష్కరిణుల
నిండువేడ్కను విహరించు చుండె నంత 158

క॥ అప్పుడు గ్రీష్మసమాగమ । మొప్పెను జగమద్రువ నెండ లుప్పతిలంగా
నప్పతి దిగ్వాతంబులు । గుప్పున వీవంగ నధ్వగులు తల్లడిలన్ 159

వ॥ మఱియును. 160

ఉ॥ న్యూనములయ్యె యామిను లనూనములయ్యెఁ బగళ్లు తాపసం
ధానములయ్యె నెండ లతిదారుణ శీలములయ్యె గాడుపుల్
మ్లానములయ్యె జంతువులు మల్లెలుజాజులు కొల్లలయ్యె ను
ద్యానములన్ బ్రపాంచితము లయ్యెను రాజపథంబు లత్తఱిన్ 161

క॥ బాడబవహ్నిజ్వాలల । వేఁడిమిచే జడతనొంది వేసవితఱినిన్
దాడిని నపరపయోనిధి । వీడిన నిట్టూర్పులనఁగ వెలసెన్ గాడ్పుల్ 162

క॥ బలిమిని బశ్చిమవాతం । బులకు నెదుర్కొనుచుఁ జనెడి ప్రొద్దుహయంబుల్
అలసటచే నల్లనఁజన । నలసములై యహములమరె నాసమయమునన్ 163

చ॥ సిరిచరణంబు లొత్తఁగను సింధువు లింపుగ జోలఁబాడఁగా
వరుసను వేదముల్విభవవర్ణనసేయఁగ వేత్రపాణులున్
బరువడి సద్దుసద్దనుచు భాసిలుచుండఁగా శార్ఙ్గిక్షీరసా
గరహితశేషతల్పమునఁ గామ్యమునన్ బవళించె నత్తఱిన్ 164

వ॥ వెండియు. 165

చ॥ కులుకుచుఁ జల్వపందిరులఁ గొమ్మలు పాంథులకున్ బ్రియంబుగా
విలసదుసీరవాసనల విశ్రుతశీతలతోయధారలన్
సలికుచనాగరాలవణసారమనోహరగోరసంబులన్
సలలితశర్కరాంబువుల సౌఖ్యముఁజేయుచు నుందు రెప్పుడున్ 166

వ॥ అట్టిసమయంబున. 167

ఉ॥ సారసకేళులన్ గులుకు సన్నపుఁజేలములన్ మనోజ్ఞపా
టీరజలంబులన్ రుచిఘటించు సుభోజ్యములన్ విడెమ్ములన్
సారసరమ్యపేయముల సారసశయ్యల సాంద్రచంద్రికా
సారములన్ బ్రియంబెసఁగ శౌరిసఖించుచునుండె నయ్యెడన్ 168

వ॥ ఇవ్విధంబున భీష్మంబైన గ్రీష్మంబున విలసిల్లుచు వెండియు. 169

**: హంసాంగన కృష్ణునకు తను కన్న విశేషంబులు తెల్పుట :**

సీ॥ నందనందనుం డొక్కనాఁడుకవ్వడిఁగూడి యారామవిహరణం బాచరించి
కాసారకేళి సౌఖ్యంబుగాఁ గావించి వలిపెంపుఁ బచ్చనివలువఁ దాల్చి
నుదుటఁగస్తురిబొట్టుఁ గదియించి నెమ్మేనఁ బన్నీరపాటీర పంకమలఁది
విరజాజిగొజ్జంగి విరులపందిరులచే మరువంపు దళ్లచే నొఱపుమీఱు
పారిజాతమహీరుహపరిసరమున
రత్నకాంతుల విలసిల్లు రమ్యభర్మ
వేదికోపరితలమున సాదరమున
నలరుచుండె సుఖాసీనుఁ డగుచుఁ బేర్మి 170

క॥ దరధరుఁడు నరునితో సా । దరముగఁ బరిహాసములను దనరారుచు సుం
దరవదనేందూద్యత్మి స్మిత । దరచంద్రిక చెలువుమీఱఁ దత్సమయమునన్ 171

క॥ ఆరాజహంసి మెల్లన । శ్రీరాజీవాయతాక్షుచెంతకుఁ జని లక్ష్మీ
రాజమానవిజయమ । హారాజ యటంచుఁ బల్కి యవనతతనువై 172

వనమయూరవృత్తము :

పన్నగశయాన వనపట్టణము లెల్లన్
బన్నుగఁ గనుంగొనుచు వచ్చునెడ లీలన్
గన్నుఁగవ చల్లగను గన్న విధమెల్లన్
విన్నపముసేయ మిము వేఁడెద ననుజ్ఞన్ 173

వ॥ అని రాయంచమించుబోణి విన్నవించిన వెన్నుండు సంతసించుచు వెండియు.

క॥ రమ్మని హంసాంగనను గ । రమ్మున మై నిమిరి సాదరమ్ముగఁ గని తో
రమ్ముగఁ దెల్పుమనఁగను గ । రమ్మా హరితోడ నమ్మరాళముపల్కెన్ 175

మత్తకోకిల॥ దేవదేవ జగంబునందొగిఁ దేజరిల్లు వినోదముల్
భావముల్లసిలంగఁ జూచుచు భాసురంబుగఁ గోసల
క్ష్మావిభు ప్రమదావనంబున సంచరించుచు నొక్కచో
భావజాశుగ సమ్మితాంగిని భామనొక్కతెఁ గాంచితిన్ 176

వ॥ ఆచెలియచెలువముఁ జిలువదొరకైనఁ దెలుపనలవిగాదైనను నా తెలిసినవిధంబున వర్ణించెద వినుము. 177

## : నాగ్నజితి సౌందర్యవర్ణన :

క॥ నీలమ్ములు లలితాంబుద । నీలమ్ములు నెలఁతకురులు నిరుపమచమరీ
వాలమ్ములు మరునైదువ । వాలమ్ములు తలఁచిచూడ వసుదేవసుతా 178

క॥ ఎన్నుదురు హొయలు దఱుచుగ । నెన్నుదురందఱు ధరన్ దరేందువు పగిదిన్
బన్నుగ బొమలు ధనుస్సం । పన్నములై తనరు సతికిఁ బంకజనయనా 179

క॥ నమ్ములు గగనమ్ములు మద । నమ్ములు నీలాబ్జవిలసనమ్ములు ఘనమీ
నమ్ములు తెఱవ విపులనయ । నమ్ములు నమ్మును నిజమ్ము నలినాక్షా 180

క॥ అక్కువలయలోచన నునుఁ । జెక్కులు మరునద్దములను జెక్కులుపట్టున్
జక్కనిసంపెఁగ టెక్కువ । ముక్కున విలసిల్లు రాచముద్దియ కుహరిన్ 181

క॥ పగడాలతోడ నెపుడుం । జగడా లొనరించు మోవి జగదాకారా
మగరాలనుగలుగ న్నిగ । నిగరాలుగఁ జేయునౌర నెలఁత రదనముల్ 182

క॥ అమ్మగువ తళుక్కుగుల్కెడు । నెమ్మొగము హొయల్ వచింపనేఁదగుదునె పొం
దమ్ముల బృందమ్ముల చం । దమ్ములఁ గని యపహసించు దానవమథనా 183

సీ॥ కలవాణివగగుల్కు గళదరమ్మునకు మంగళరేఖ లపరంజికట్లుగాఁగ
లసమాన మృదుబాహు బిసనాళములకును బసఁబూని కరములబ్జములుగాఁగ
బంగారు వలిగుబ్బబొంగరమ్ములకు నాపైమొనల్ ముల్కులపగిదిఁ గాఁగ
నలరారు నూగారు కలువతీఁగెకు నాభిగంభీరమైన పుష్కరిణి గాఁగ
లలితలావణ్యలహరికి వళులు పిరుదు
లూర్మిసైకతములుగాగ నువిదమేని
లతకు వయసు వసంతకాలంబు గాఁగఁ
దెలుపశక్యంబె యాచెలిచెలువ మరయ 184

కII కలమవిశేషోదరముల । గల మహిమ తిరస్కరించు కౌతుకమునఁ బి
క్కలరమ వివరింపఁగఁ । జుక్కలరహి నిరసింపఁజాలుఁ గలికినఖంబుల్ 185

కII ఆజడ నలరెడు సోయగ । మాజిగి కెమ్మోవి సొగసు నాకౌనుహొయల్
ఆజిగిబిగిచన్గవచెలు । వా జవరాల్ రతనమందె యచ్యుత కంటిన్ 186

సీII పగడాల జగడాల జగడాల గెల్చు నావగదీవికెమ్మోవి చిగురుఁదీవి
అళిగుంపు బలుసొంపుఁ దులకింపు చెలవంపు పరువంపు విరులింపు కురులపెంపు
నెలబాలు మైమేలుగలజాలు నగఁజాలునునుసొరుననుమీఱు నుదురుతీరు
అలకుందముల చందములఁ గ్రిందుగాఁజేయు బలువాణి రుచిపాళి చెలిరదాళి
అద్దముల నిద్దపునిగలు రద్దుపఱుచు
నక్కువలయాక్షి నునుపెక్కు చెక్కుటెక్కు
జక్కవల చక్కఁదనమెల్లఁ జిక్కుపఱుచు
నిబ్బరంబగు సిబ్బెంపుగుబ్బ లరయ 187

చII కలువలగుంపుచేఁ గచము కన్బొమ లంగజకార్ముకంబులన్
నళినదళంబులన్ గనుల నాసిక కాంచనసూనలక్ష్మిచేఁ
గులుకుకుచంబులన్ గుసుమగుచ్ఛములన్ బులినంబుచేఁ గటిన్
దలిరులఁ బాణిపాదములు తన్వికిఁ జేసె విధాత నేర్పునన్ 188

కII ఘనసారస ఘనమౌటను
ఘనసారసఘనత నొందె కామినికచమున్
ఘనసార సహితము లగుచు
ఘనసారసహితములయ్యెఁ గామినికుచముల్ 189

కII దరమా కౌను సుధాసో । దరమా కెమ్మోవి నాభిదరసుందరమా
దరమా గళ మిక కాకో । దరమా నూగారు నెన్నఁదరమా విధికిన్ 190

సీII మృగరాజమధ్యమ మెఱుఁగుపాలిండ్లతోఁ గరికుంభయుగము రావెఱచి యులికి
శుకవాణిరతనంబు సొబగు బల్గుదురుతో సరిపోర కరకబీజములు బెదరి
తుహినాంశువదన కన్దోయితోరంబుతోఁ దమ్మిరేకులు దొమ్మిదలఁచి బెదరి
గజరాజయాన పొన్గరిమ లేఁదొడలతో కదళికల్ భీతిల్లి కదనమనఁగ
మరలి యవి మార్దవమునొందెఁ బొరలడాగె
జలములనుగ్రుంకె మిగుల చంచలములయ్యె

నౌర యావిరిబోణి యొయ్యార మెవరి
కైన వివరించి చూడ జగానఁ గాన 191

చ॥ జలమునఁ గంజముల్ నిలిచి చంపకమాశ్రమవాసియైన గాం
చలముననుండి కెంజిగురు చాలతపంబొనరించికాదె యా
నెలఁత విశాలరమ్యమృదునేత్రనసాధరసామ్యమొందె ని
శ్చలనియమాభిరాముల కసాధ్యములున్నవె ముజ్జగంబులన్ 192

క॥ మిన్నగు మొగమల నెలకలి । మిన్నగు నగురామెఱుంగుమెయి నడుమునకున్
మిన్నగురులెన్నఁ గురులెల । మిన్నగుఁ గాదనఁదగుం జుమీ కదళికలన్ 193

భంగ్యంతరకల్పన :

క॥ మిన్నగుమొగమున నెలకలి । మిన్నగురా దానికౌను మెరుగణువువలెన్
మిన్నన నామిన్ననసా । మిన్ననగాఁ జాలవేమిమెప్పొనె ధరన్ 194

క॥ తమ్ముల నెదురించును వా । దమ్ములఁ గన్దోయి చెలిరదమ్ములుగన నం
దమ్ములు గుందమ్ములకుం । దమ్ములనన్ బలుకఁగా ముదమ్మొదవొదవున్ 195

చ॥ వదనము సోముఁగాంచి మది వారిజమంచుఁ దలంచి ఱెక్కలన్
గదలిచి మేనువంచి దుముకం దమకించి మదించి ముందటన్
గుదురగు నాసికాకనకకుట్మలమున్ వెసఁ గాంచి నిల్చు తు
మ్మెదలొ యనంగ ముంగురులు మించె లతాంగిలలాటసీమపై 196

క॥ శ్రీచతురత వీపమరున్ । శ్రీచతురత వీనులందు చెలువొందు కడున్
మోచారససమమధురిమ । మో చారుతరంబు పల్కు ముదిత కనఁదగున్ 197

గీ॥ నెలఁత నిద్దంపు నెమ్మోము నిండుచందు
రునకు నెలనవ్వు వెన్నెలరుచులఁ దనరఁ
గన్నుఁ గల్వలు వికసించి చెన్నుమీఱ
లలితకర్ణంబులను శ్రీవిలాసమమరె 198

గీ॥ కలికి నెమ్మేనుక్రొమ్మించు తళుకుకన్న
మిన్న వన్నియ కలదని యెన్నఁదగును
మరుదివాణంబుహొయలు వేమఱుఁ దలంపఁ
గనకచలదళతళతళగరిమ నణఁచు 199

కII రాయంచను గనుఁగొని భళి । రాయంచను దానిసుందరపు యానమరే
రాయంచఁదగిన సొగసరి । రాయంచవజీరుచిత్తరపుబొమ్మలలోన్ 200

గీII ఇట్టి నెమ్మేనిహొయలుచే నింపుమీఱి
చెలులనడుమునఁ జెలువొంది చిన్నవోయి
సూనబాణశరాహతిసోలి మిగుల
వగలఁ బొగలుచునున్న యామగువఁ జేరి 201

గీII చూచి నానెమ్మనంబునఁ జోద్యమంది
చెలులచెంతకుఁ జని వారిఁ జెలిమిఁజేసి
యీనెలంతకుఁ దలిదండ్రులెవరు మరుని
వలలఁ బడుటకుఁ గతమేమి తెలుపుఁడనిన 202

వII అక్కన్నియ లిట్లనిరి. 203

కII ఈకాంతామణి కోసల । భూకాంతునితనయ దేవమునినాథుఁడు ల
క్ష్మీకాంతువిధముఁ దెల్ప ర । తీకాంతునివశము నొంది దీనతఁజెందెన్ 204

**: నాగ్నజితి సందేశమును హంసి కృష్ణునకు వినిపించుట :**

వII అనిపలికి యమ్ముద్దియలు నీవెక్కడనుండుదాన వీనిష్కుటంబునకువచ్చుటకుఁ గారణంబెయ్యది యనియడిగిన ద్వారకానగరంబున నగధరుని పారిజాతపరిమళ లసదుపవనంబున విహరించుదానఁ గార్యావసరంబున మానససరంబునకుఁజని మరలివచ్చుచు మీవనంబుఁ జేరితిననిన విని యమ్మానవతీమణి నన్నుఁజేరంబిలిచి దేవాభవదీయ సౌందర్యవైభవాతిశయంబుల నావలన విని మగిడి మనోభవా క్రాంతయై చింతనొందు నక్కాంతారత్నంబు నేనూరడించినఁ గొంతదడవునకుం దెప్పిరిలి మీపైఁ బ్రేమముప్పిరిగొన నప్పల్లవాధర మెల్లమెల్లన నిట్లనియె. 205

కII నాజననమునారీతి ర । తీజానిపరాక్రమంబు తేజము మీఱన్
రాజీవాక్షులు తెలుపఁగ । రాజిల్లుచు వింటిగాదె రాయంచచెలీ 206

గీII నందనందను పాదారవిందములకు
మ్రొక్కి నావిధమెల్లను జక్కఁదెలిపి
మోహజలనిధిలోఁ బడి మునుఁగుచున్న
నన్ను దరిఁజేర్పు రాయంచవన్నెలాఁడి 207

వII అని గద్గదగళయై నలినలోచన కొన్ని వచనంబులు విన్నపంబుఁజేయుమనిపల్కె

నవి విన నవధరింపుము నందనందన భవదీయకల్యాణగుణ సౌందర్య వైభవాతిశయంబులు విన్నది మొదలు జగన్మోహనకరంబైన తావకరూపంబు కన్నులఁగట్టినవిధంబునఁ గనుపట్టి యుండి డెందంబు భవత్పాదారవిందంబుల యందు మిళిందాయమానమైయున్న దీపున్నమవెన్నెలకాకకుఁ, జలువతెమ్మెరవీకకు, శుకపికశారికాకేకిసముదయంబులధాకకు, నులుకుచున్న నాపై మరుండుదండెత్తి మెండుకోలలఁ జెండాడుచునున్నవాఁడు కావున యుష్మద్దర్శనం బహర్నిశంబుఁ గోరుచున్న నానేత్రచకోరంబులకు నీదు వదునేందుమండలం బాహ్లాదకరంబు గావించి స్వయంవరపూర్వకంబుగా నామనోరథంబు సఫలంబుఁజేసి ననుం జేకొనంగవలయును 208

మ॥ కమలాలింగితమై కడుంజెలఁగు నీగాత్రంబు నేత్రంబులన్
భ్రమదీరం బొడగాంచి కౌఁగిటను సంరంభంబునం జేర్చి నీ
కమనీయాధరబింబసంభృతసుధన్ గాంక్షించి కైకొన్ననీ
సుమబాణంబుల వేఁడిపోడిమి యణంచున్ శూరవంశాగ్రణీ 209

ఆ.వె॥ సదయ నాదుమనవి మదినుంచి వేంచేసి
వృషభములను గట్టి వేడుకలర
నన్నుఁ గౌఁగిలింపకున్నఁ బ్రాణంబులు
విడుచుదాన నిజము విమలచరిత 210

వ॥ అని కోసలరాజనందన పుత్తెంచిన సందేశంబులు నారాజమరాళాంగనయు నంగజ జనకునకు విన్నపంబుఁజేసియుఁ దగినయర్థంబెద్ది యదిసేయ నవధరింపుమనినఁ బుండరీకాక్షుండు వెండియు. 211

క॥ కవ్వడివదనముఁ గాంచిన । నివ్వటిలుచు నతఁడు నొరపునేరుపుమీఱన్
అవ్వనితామణికోరిక । నెవ్విధముననైనఁ జేయుటిది కర్జ మనన్ 212

వ॥ మరలి మరాళాంగన యిట్లనియె. 213

## : హంసాంగన చతురోక్తులు :

చ॥ గళమున శంఖమున్నిలిపి కచ్ఛపమంఘ్రులపైనఁ దాల్చి కుం
తలముల నీలముంచి సురదమ్ములఁ గుందము నావహించి జం
ఘల మకరంబుఁ బూనిన వరకంజ మహాంబుజముల్వహించుచున్
గులికెడు మోవిఁ గన్నుల ముకుంద నినున్ మదిఁజేర్చెఁ జూచితే 214

వ॥ కావున. 215

క॥ నవవిధులు కలిగి లసదభి । నవయౌవనమునను జెలఁగి నయమందిన యా
జవరాల్రతనముతోడను । గవగూడుట నీకె తగును గౌతుకమొప్పన్ 216

వ॥ మఱియును. 217

క॥ వెలఁదులు వలచిమెలంగుట । కలుగునె జగమునను కమలగర్భునకైనన్
గలికివలరాజు నరబది । ములుకుల వెగడొంది నిన్ను మోహించె హరీ 218

క॥ చెలిమిని దెలిపెద వినుమా
చెలిపద్మిని నీవినుఁడవు సిరిచెలువొందన్
వలపునఁ గరములఁ బొదువుము
బలభిన్మణిరుచిరకాయ వరమునిగేయా 219

వ॥ అనురాయంచ మించుబోణిపల్కులాకర్ణించి కవ్వడిభావంబవలోకించి సంతసించుచుఁ గాంచనాంబరుం డంతఃపురంబునకుంజని రమాంగనాలోలుండై సుఖించుచుండెనని తెలిపినఁ బరితుష్టాంతరంగులై శౌనకాదిమహామునులు రోమహర్షణ తనూభవునితో నవ్వలివృత్తాంతంబుఁ దెలుపుమని యడుగుటయు.

**: ఆశ్వాసాంతము :**

శా॥ నానాజంతునివాస! వాసవశతానందేందుభృన్ముఖ్యదే
వానీకార్చితపాద! పాదపలతాంతాభోగవచ్ఛోభనా
గానింద్యాగ్రవిహార! హారవలయోదంచత్కిరీటాదిభూ
షానల్పప్రియభావ! భావజసహస్రక్షేపిరూపోజ్జ్వలా! 221

పంచచామరము: హిరణ్యదైత్యభేదనా! సుహృద్వ్యథావినోదనా!
హరార్పితాభివాదనా! హయద్భుజంగమోదనా!
హరిత్పతిప్రసాదనా! నిరస్తసూరివేదనా!
స్థిరేందిరావినోదనా! ఋషిద్విషన్నిషూదనా! 222

గద్య॥ ఇది శ్రీమాడభూషికులపయోవారాశిసుధాకరవేదాంతాచార్యతనూభవవైనతేయ కటాక్షలబ్ధవిద్వత్కవిరాజమనోరంజకసంగీతసాహిత్య కవిత్వచతుర నరసింహాచార్య ప్రణీతంబైన వల్లవీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యానప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

*1. కౌతుకమేమిఁక – పూ.ము.పా.*

శ్రీరస్తు.

# వల్లవీపల్లవోల్లాసము.

## తృతీయాశ్వాసము.

కII శ్రీరమణీమణివరవిపు । లోరస్థలకాంచనాంచదుజ్జ్వలమణిస
ద్భారాజమానమంజుల । హారాద్యాభరణ! శోభనాచలరమణా! 1

వII అవధరింపుము మదనగోపాలచరితశ్రవణసంజాతకుతూహలులగు శౌనకాది మునీంద్రులకుఁ దత్కథాసీధుపరిమళితహృదయకమలుండై సూతుండిట్లనియె, నివ్విధంబున నందనందనుండానందంబుననిందిరాలోలుండయ్యును గోసలనందనాస్వయంవరోత్సవ గమనకుతూహలాంచితాంతరంగుండైయున్న సమయంబున. 2

### : వర్షఋతు వర్ణన:

కII వర్షాగమమపు డమరెన్ । గర్షకులుహలములఁబూని కడువేడ్కను సం
కర్షణుని పగిది రాజిలి । హర్షముమీఱంగఁ గృషుల నలరుచునుండన్ 3

కII కరమరుదుగఁ దొలుకరి నిల । కరకప్రకరములుదోఁచె గంభీరభయం
కరగర్జితముల నడలిన । గరుచెడికడువ్రాలు తారకలనంగ [1]కడున్ 4

కII సింహగుఁడై కుజుఁడంబుద । సంహరుఁడని శక్రుఁడతని సంతతితోడన్
రంహమునఁ ద్రోయఁబడెనన । గంహరిపై నింద్రగోపగణములు రాలెన్ 5

సీII పూర్వసమీరము ల్పొలుపొందఁగా వీచె జీమూతపుంజము ల్చెలఁగితోఁచె
నింద్రచాపంబు సొంపెనయంగఁ గాన్పించె మెఱుపుఁదీఁగెలకాంతి మింటమించెఁ
దఱుచుగా ఘనగర్జితంబులు వినిపించెఁ జాతకవ్రాతము ల్సంభ్రమించె
వృష్టి కర్షకమనస్తుష్టిగా వర్షించె సారసౌన్నత్యంబు సన్నగించె
నదులు కూలంకషోదకోన్నతి వహించెఁ
గేకినికరము నర్తించె భేకనాద
మతిశయించెను బెగ్గురు లాక్రమించె
మొలవఁ జిగిరించె మేదిని దొలుకరించె 6

గీII పుడమి నిప్పులురాలి గాడ్పులు నిదాఘ
కాలమున వీచి నవవార్షికమున మరలె

రాజ్యమునఁ బ్రజ బాధించి రహి నిజాధి
పత్యహీనత మరలు దుష్ప్రభులకరణి 7

వ॥ ఆసమయంబున. 8

ఉ॥ వెచ్చని నీరవారముల వేగమె స్నానమొనర్చి యిచ్చటన్
వెచ్చని సత్పదార్థముల వేడుకమీఱఁగ నారగించుచున్
హెచ్చగు సౌధభాగముల నింతులఁ గౌఁగిటఁ గ్రుచ్చి మెచ్చుచున్
బచ్చడము ల్ముసుంగునిడి భాసిలుచుండెను వెన్నుఁ డయ్యెడన్ 9

ఉ॥ శ్రీహరి భర్మహర్మ్యములఁ జెన్నలరారఁగ నయ్యెడ న్బయో
వాహ వినిర్గళద్ధ్వనిబగుబధ్వనుల న్వెఱఁగొంది భైష్మి స
మ్మోహముమీఱఁ గుల్కు కుచముల్గదియించి కవుంగలింపఁ దా
నాహరిణాక్షిఁ గైకొనె నయత్నసమాగతసౌఖ్యమొందుచున్ 10

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు రుక్మిణీసత్యభామాది నితంబినీమణిమనోరంజనీయ
చరిత్రుండయ్యును దక్షిణనాయకుండుగావున నాగ్నజితియందు డెందంబునిలిపి
తదీయ సౌందర్యాతిశయంబుఁ దలంచి వలచుచు వెండియు. 11

సీ॥ వగగుల్కు కార్మొగుల్వన్నియ ల్వొడగాంచి మగువ వేనలిహొయల్మదిఁదలంచి
తీరైన క్రొమ్మించుతీవ చందముఁగాంచి మెలఁత మేనికడాని మెఱుపుఁదలఁచి
తనరారు దేవేంద్రధనువు పొందికఁ గాంచి పొలఁతుక నునుసోఁగబొమలు దలంచి
సరసమై చెన్నొందు కరకసంపదఁగాంచి వెలఁది సన్ననినవ్వు పొలుపుఁదలఁచి
చెలఁగు గేదంగిపువ్వుల కలిమిఁ గాంచి
తరుణినెమ్మోయి ఘుమ్మను తావిఁ దలఁచి
మదనవశగాంతరంగుఁడై మదనగోప
బాలుఁ డజ్జడిని విరాళిఁ జాలనొంది 12

వ॥ మఱియును. 13

చ॥ మదవతు లీయెడ న్బ్రియుల మంజులకేళులఁ గూడియుండియున్
మదనశిలీముఖప్రచలమానసులౌదు రయోగవిప్రలం
భదశను జెంది కోసలనృపాలతనూజని యాపయోదసం
పదఁగని తాళలేక మరుబారికి నేమని తల్లుచుండెనో 14

## : కృష్ణుడు హంసాంగనతో నాగ్నజితికి సందేశము పంపుట :

వ॥ అని వితర్కించుచుఁ గాంచనచేలుం డారాయంచమించుబోణిని రావించి యిట్లనియె. 15

క॥ నీవలరుచు నలకోసల । భూవలయాధిపునితనయఁ బొడగని దయతో
నావెలఁదితోడ నిట్లను । మా వెలివావురపురతనమా మృదురవమా 16

క॥ నాపై నీవలపుఁ దలఁచి । నీపై దయ కిసలయింప నేర్పుదలిర్పన్
నే పైనమై చెలంగఁగ । దాపై వర్షాగమంబు తద్దయు మెఱసెన్ 17

వ॥ అని మఱియును. 18

క॥ వచ్చు శరదాగమంబునఁ । జెచ్చెర వృషభములఁ బట్టి చిదిమెద నృపులన్
దెచ్చెద నినుఁగౌతుకమున । నచ్చెరువందగను జదల నమరగణంబుల్ 19

వ॥ కావున. 20

గీ॥ అంతపర్యంత మీరతీకాంతు చుఱుకుఁ
జిలుకులకు గాలివీకకుఁ జిలుకకులుకు
పలుకులకు నుల్క వలదు నీపల్కు నిజము
గాఁగ నమ్ముము నీయాన కమలనయన 21

వ॥ ఇక్కరణి నక్కోమలికిఁ దెలియంబలికి పెక్కు తెఱంగుల నక్కువలయనయన నోదార్చుచు, నీవక్కడనుండుమని చక్రధరుండనిపిన నమ్మరాళాంగన తనవిభునితో రంగుమీఱి కోసలనగరంబునకుంజని విపులసౌధాంతరాళంబునఁ జెలులనడుమ మురహరునిఁదలంచి, మరుశరంబుల వెగడొంది నిజగమనంబుఁ గోరుచున్న నచ్చెలియెదుటవ్రాలినఁ బెన్నిధిఁగన్న పేదచందంబున సత్యదిగ్గనలేచి హంసాంగన నెదుర్కొని, మార్గాయాసోపశాంతి కరవచనరచనలఁ గుశలంబడిగి గారవించిన, నారాయంచ పువుబోణి కాంచనాంబరుండు వివరించిన సందేశంబు విన్నవించిన నమ్మించుబోణి సంతసించి ఘనాగమనంబునకుఁ జాతకంబుకరణిఁ, జంద్రోదయంబునకుఁ జకోరంబుపగిది, హృదయంబున నందనందను నాగమనంబుఁగోరుచు, విరాళినొందుచు, మరాళవచనంబుల మగిడి ధైర్యంబు నొందుచు విలసిల్లుచున్న సమయంబున. 22

## : శరదృతు వర్ణన :

కు॥ శరదాగమ మపుడమరెన్ । శరదాగమమణఁగె దిక్ప్రసన్నత చెలఁగెన్
శరధులవలె ఘూర్ణిల్లుచు । శరధులతో రాజు లవనిచరులైరి కడున్ 23

వ॥ మఱియును. 24

కు॥ నవరాత్రమునందున దా । నవరిపుమందిరము లందునవ్యవిశేషో
త్సవములు సలుపుచు నేత్రో । త్సవముల వర్తింతు రపుడు తద్దయు భక్తుల్ 25

ఉ॥ ఆసమయంబునన్ జలరుహాక్షుఁడు నిద్దుర మేలుకొల్పు ప
ద్మావతితోఁ బయోజలధిమధ్యమునందు ఫణీంద్రశయ్యపై
భాసిలుచు న్గిరీశవిధిపాకరిపు ప్రముఖామరోత్తముల్
వాసిగ సన్నుతించి కొలువన్విలసిల్లుచునుండె వేడుకన్ 26

కు॥ పద్మాకరములు విలస । త్పద్మాకరతన్వహించి తనరెను దారా
సద్మాభ్రము శుభ్రచకా । సద్మాభ్రంబై చెలంగె సరసత మిగులన్ 27

కు॥ పులినములు మెల్లమెల్లన
పొలుపునఁ గాన్పించె నదులఁబొలఁతులు మరుకే
ళులఁ బ్రియులఁగూడి సిగ్గున
నలరఁగ జఘనముల కరణి నాసమయమునన్ 28

## : పరివారముతో కృష్ణుడు కోసలకు బయలుదేరుట :

కు॥ అంబుజలోచనుఁ డాసమ
యంబునఁ గోసలతనూజ నతిముదమునఁ జి
త్తంబునఁ దలఁచి కిరీటిమ
తంబునఁ బరిజనముతోడఁ దనరుచు వెడలెన్ 29

సీ॥ కాంచనమకుటసంఘటితరత్నచ్ఛాయరవికోటికాంతిఁ దిరస్కరింపఁ
గస్తూరికాతిలకప్రభాస్యము సాంకచంద్రబింబస్ఫూర్తిఁ జౌకళింపఁ
బీతాంబరప్రభావృత శరీరద్యుతి విద్యుదంచితమేఘవిధముఁ జూప
రమణీయచందనరాగంబు నెమ్మేనఁ జదలసంధ్యారాగసరణిఁ దోఁప
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గములు భు । జంబుల నలంకరింపఁగ సరసకనక
భూషణోల్లసితాంగుఁడై పొలుపుమీఱి । వేడుకలర రథస్థుఁడై వెడలె శౌరి 30

వ॥ ఆసమయంబున. 31

ఉ॥ సాంకవగంధ సమ్మిళిత చందనలిప్తశరీరులయ్యు నే
ణాంకవహేందుబింబ తులితాస్యసమంచితులై యదూత్తముల్
రాంకవనిర్మితాస్తరణరంజితకుంజరవాహనంబులన్
శాంకవవిక్రమార్భటులు సల్పుచు నేగిరి శౌరిముందటన్ 32

వ॥ మఱియును. 33

క॥ రంగద్వల్గితలసిత తు । రంగమములనెక్కి వృష్ణిరత్నంబులు సా
రంగవహుపగిది నడచిరి । రంగలరఁగ శౌరికిరుగెలంకుల వేడ్కన్ 34

క॥ రథములు వివిధగతులు సా । రథులు నడుప రవులవలెఁజెలఁగి భోజమహా
రథికులు హరితోడ మనో । రథములు విలసిల్లి చనిరి రహిమీఱంగన్ 35

క॥ హేతిశరాసన ముసలగ । దాతిశయాయుధములను గదాదులవలె వి
ఖ్యాతపరాక్రములైన ప । దాతివరులు నడచిరపుడు దాశార్హునితోన్ 36

వ॥ వెండియు. 37

ఉ॥ మంగళతూర్యనాదములు మంజులమర్దలభూరిభేరికా
రంగదమేయరావము తురంగమతుంగరథాంగభద్ర సా
రంగ భటానుషంగ చతురంగ బలోద్ధరవంబుదిక్కు లన్
రంగుజెలంగి పొంగి తనరంగ సురల్ముదమంది రత్తఱిన్ 38

గీ॥ తురగఖురఘట్టనోద్ధూతదూళిమింట
నంటి వారణజలదనిర్యన్మదాంబు
ధారలను శాంతినొందఁగ దావవారి
చెన్నుమీఱుచుఁ జనియె సంపన్నుఁ డగుచు 39

వ॥ అప్పుడు. 40

క॥ అర్జునుఁడు గాండివముఁ గొని । యార్జవమునఁ గృష్ణువెనుకనరిగె సరథుఁడై
గర్జితధనువుల నమరుచుఁ । బర్జన్యుండింద్రుఁగూర్చి పరఁగిన భంగిన్ 41

వ॥ ఇత్తెఱంగున రథాంగధరుండు దారుకానీతంబైన సైన్యసుగ్రీవమేఘపుష్ప బలాహకంబులను తురంగంబుల డంబుమీఱురథంబున నారోహణంబుచేసి చతురంగసైన్యంబుతో నగరంబువెడలి రాజమార్గంబునఁ జను సమయంబున జవాతిశయంబున సారంగంబుల పగిది దేవమణిశుక్తిప్రముఖమహావర్తంబుల

నర్ణవంబులకరణి హేషారవంబుల ఘూర్ణిల్లుచుఁ దనరుతురంగంబుల ఖురశిఖాసంఘట్టనసముద్ధూతమహాపరాగంబు బృంహితగర్జితాంచిత బలాహక తులితదంతావళకపోలనిర్యన్మదాంబుధారాసేచనంబున నణంగిచెలంగ నుభయ పార్శ్వసమున్నతహర్మ్యప్రాసాదచంద్రశాలాదిభవనవిరాజమాన వాతాయనస్థిత యువతిజనవికీర్యమాణనానావిధవిచికిలసముదయంబు విచిత్రరంగాయమానమై తేజరిల్ల, మంగళతూర్యనినదంబభంగురభేరికాధణంధణరావంబునఁగలిసి రథచక్ర ఖర్భరారావంబులవిలసిల్లి, భటకోటిప్రకటితాస్ఫోటితంబులవిస్తరిల్లి, వందిమాగధజయజయధ్వనులనుల్లసిల్లుచు, దిక్కులుపిక్కటిల్ల మెల్లమెల్లన రాజపథంబుఁగడచి, కాంచనరత్నకీలిత ప్రాకారంబతిక్రమించి, మీనకర్కట మకరశింశుమారగ్రహాక్రాంతంబై, తారాఫలస్ఫూర్తినతిశయించు గగనంబుకరణి రంజిల్లి, పరిఖాయితంబైన సముద్రంబుఁజూచుచు, శాలి ప్రసవతరుజాల సమాకులంబులైన నగరజనపదజాంగలప్రదేశంబులఁ గనుంగొనుచు, దినదిన ప్రయాణంబులఁ గోసలనగరంబునకుం జనుచు, మార్గంబున విమలకువలయ నయనవిలాసాంచితంబై, శైవాలచికురబంధబంధురంబై, చక్రవాక కుచప్రకాశ సముచితంబై, గంభీరావర్తనాభిగహ్వరభ్రాజితంబై, విపులపులినప్రదేశనితంబ శోభాస్పదంబై, హల్లకాధరవికాసితంబై, మృణాలబాహాలాలితంబై, తరుణారుణ వికస్వరకమలవదనకరపదప్రకాశంబై, మలయసమీరసమీరితతీరజకుసుమ నికుంజపుంజపరాగమృదువసనవిభాసితంబై, నితంబినీరత్నంబుపగిది రాజిలు మాగధీనదీరత్నంబు పరిసరంబున నారికేళరసాలసాల హింతాలతాల నక్తమాలకృత మాలతమాలపున్నాగక్రముకకదళీవకుళకంకేళికుటజకురవకతిలకామలకపనస కుందమందారకోవిదారప్రముఖానోకహసముల్లసితోత్సేధశిఖరశతంబులవలన నభ్రంకషంబై, గైరికాదిధాతుదీధితిరాజితంబై, మేరుభూధరముకైవడి మెండు మీఱు రైవతకధరణీధరప్రాంతంబునఁ జమరీచమూరువరాహసింహ వ్యాఘ్రశరభాది మృగాకరంబై, మయూరాదివిహగ నాదానువాదితంబై, కర్ణనేత్రానందకరంబైన వనముంబొడఁగని, యచటసేనానివేశంబుచేయించి, తరుణారుణకిరణారుణిమ రంజితరాంకవ నిర్మితంబులై, కనకకలశప్రకాశాంచితంబులై తనరారు పటకుటీరంబుల నివసించి కవ్వడితో వినోదాలాపంబుల నివ్వటిల్లుసమయంబున.

## : మృగయులు కృష్ణుని వేఁటకు రమ్మని కోరుట :

ఉ॥ చల్లడముల్వడిందొడిగి సంతనగా బిగియించి కాసెలం
బల్లెము లమ్ములు న్విలు తుపాకులు జందళముల్ధరించి సం

ఫుల్లసరోజనేత్రయదుపుంగవు సన్నిధిఁజేరి మ్రొక్కి తా
రుల్లము సంతసిల్ల మృగయు ల్ముదమొందుచుఁ బల్కి రత్తఱిన్ 43

గీ॥ పులులు నెలుఁగులు నేదుబందులును చిఱుత
పులులు పందులకదుపులు పొలుపుమీఱు
కొమ్ముటేనుఁగు గుంపులీ కోనలందుఁ
గలవు వేఁటాడవలసినఁ గమలనయన 44

వ॥ కావున. 45

క॥ రమ్ము తురంగముపై నిక । రమ్మిటు వేంచేసిచూడు రహిమీరమ్మా
యమ్మునచే వనచరనిచ । యమ్ముల నెల్లన్వధింతు మంబురుహాక్షా 46

క॥ అని వీరాలాపంబుల
ననుపమముగ భటులు పల్క హరి విని సంక్రం
దనతనయునితోఁగూడన్
ఘనమృగయాలోలుఁ డగుచుఁ గౌతుకమొదవన్ 47

చ॥ మునుచెవిచాయఁ జారుసిక మూయక సీదురుమాలుగట్టి భూ
షణములు మేనఁ దాల్చి సరసంబుగఁ గస్తురిబొట్టుఁ దీర్చిచ
క్కని కలపమ్ముఁ బూసి కటి గట్టిగ దిట్టపు ధట్టిఁజుట్టి ప
చ్చనివలిపెమ్ముపైనిడి వసంతునికైవడిఁ దేజరిల్లుచున్ 48

వ॥ వెండియు. 49

ఉ॥ బంగరుమోముపట్టియును బచ్చలు కెంపులు గుల్కుపల్లమున్
రంగగు కంఠమాల్య మపరంజిఖలీనము వజ్రకాంతులన్
సంగతమైన శేఖరము చక్కఁగఁ బూనిన వేగధూత సా
రంగము నచ్చతెల్లని తురంగమునెక్కి మురారి వేడుకన్ 50

గీ॥ తొలుత విలుకాండ్రు బల్లెంపుతుటుము వెనుక
నిరుగెడల మత్తవారణ తురగదళము
బల్తుపాకీ జజాయీల పొంఁజుచుట్టు
చెన్నుమీఱంగ వెడలు నవ్వెన్నుఁ గాంచి 51

సీ॥ కుఱుచగోళ్లును గొప్పశిరము కొంచెపుఁదోఁక మించిననాలుక మిట్టయురము
జిగిడొక్క బెడదకండ్లును గలిగి మైవంచి చెలరేఁగి బెబ్బులిజీడిగొంటు

వడిగంఁద్రగొడ్డలి సుడిగాలి దొంగలమిండగాఁడను సారమేయములను
గొప్పకన్నులు తలల్గొరవంక కాళ్లను నల్లనినాలుక తెల్లబొమలు
గల్గు నోరణమున సెలకట్టివైరి । మొదలుగాఁగల దేగలు పొలుపుమీఱ
వేఱువేఱుగఁ బట్టుచు వివిధశస్త్ర । ధారులై వేడ్క మృగయులు దరలిరపుడు 52

గీ॥ ఫల్గునుఁడు గాండివము సితభల్లములును
బూని మదవారణముపైని మోదమలర
నుల్లసిల్లుచు వనమృగయూధములను
జూచుచును శౌరితోఁ జనెఁ జోద్యముగను 53

## : వేఁట వర్ణన :

వ॥ ఇవ్విధంబున వెన్నుండు మృగవ్యక్రీడాలోలుండై యాసమయంబున నయ్యనీకంబు తో రైవతగిరిప్రాంతంబున సకలమృగఖగశరణ్యంబగు మహారణ్యంబుఁజొచ్చి యల్లనల్లన బలగమ్ముల నెలయించుకొనుచుం జనుచున్న సమయంబున. 54

క॥ దొరువుల పడియల మడుఁగులఁ
జెరువులఁ గొలఁకులను బంటచేల నెలవులన్
దరులన్గిరుల గుహలను బొ
దరుల న్మృగయు ల్మహోద్ధత న్గడుఁ జనుచున్ 55

వ॥ మఱియును. 56

క॥ సెలయేరుల మడువులఁ గని । వలలొగ్గుచు గాలములను వడిగానిడుచున్
చెలరేఁగుచుఁ గొందఱు మీ । నులఁబట్టిరి జలజలోచనుఁడు చూడంగన్ 57

వ॥ వెండియు. 58

గీ॥ భైరిడేగల కొంగల బలమణంచి
బేసిడేగల కౌఁజుల బీరమణఁచి
మఱియు సాయిని దేగల మురిపెములను
జూపుచుండిరి కొందఱు చోద్యముగను 59

వ॥ ఆసమయంబున. 60

క॥ అటఁ జని దాశార్హుఁడు ది
క్తటములదర బెదరి వనమృగ గణములు మహో

త్కటముగఁ బరవ సముత్కట
పటహములను నొక్కమాటు వడిఁ జరిపించెన్ 61

వ॥ అప్పుడు. 62

క॥ గిరిదరులవలన వెడలిన । గిరులంగని జాగిలములఁ గేరుచు మూయన్
గరమరుదుగ నవిచని సూ । కరముల మర్మములఁ బట్టి కఱచిచెలంగెన్ 63

క॥ కిటియొకటి వెఱవ నిలునిలు । మిటు తిరుగుమటంచుఁ బలికి యెదిరినదానిన్
దిటముగఁగని పందీటెను । నిటలమ్మునఁ బొడిచె నొకఁడు నేరుపుమీఱన్ 64

క॥ ఒక్క పులిపైని దుముకఁగఁ । జెక్కు చెదరకను దుపాకిఁ జేఁబూని కడున్
గ్రక్కుననేయఁగఁ బడెనది । డొక్కలవియ నెంతశూరుఁడో వాఁడకటా 65

వ॥ ఇవ్విధంబున మృగయు ల్లసిల్లుసమయంబున. 66

సీ॥ వాలమ్ములఁ జమూరువాలమ్ములను ద్రుంచి కోలమ్ముల వధించి కోలములను
ఆశుగైణమ్ముల నాశుగమ్ములనేసి శరభమ్ములకుఁ జూపి శరభయములు
కరుల సాయకభిన్నకరులుగాఁ గావించి భల్లూకముల ముంచి భల్లములను
నమ్ముల వనలులాయమ్ముల హింసించి మార్గణమ్ముల నొంచి మార్గగతుల
మఱియు శార్దూలశల్య చమరీతరక్షు
శంబరవృకాదిజంబుకశశకముఖ్య
మృగసమూహము నచ్చటి ఖగచయంబు
సంహరించుచు వేఁటాడె శౌరి యపుడు 67

క॥ ఇవ్విధమునఁ గవ్వడితో । నవ్వనమున వేఁటలాడి హర్షముమీఱన్
నివ్వటిలి దళము గొలువఁగ । నవ్వలమురిదాల్పు మరలె నటు బడలికతోన్ 68

గీ॥ వెన్నుఁ డల్లనల్లన మున్నుదిగిన । పటకుటీరంబులకు వచ్చి పార్థుతోడఁ
బొల్పుమీఱంగ మజ్జనభోజనములు । చేసి యారాత్రి నచ్చటఁ జెన్నుమీఱి 69

## : నగ్నజిత్తు కృష్ణుని పూజించి ప్రస్తుతించుట :

వ॥ ఇత్తెఱంగున నగధరుండు విచిత్రలీలల నలరారుచు మఱునాఁడు సేనాసమేతంబుగాఁ గోసల నగరంబునకుం జనిన హరిరాక ఫణిహారులవలన నగ్నజిద్ధరారమణుండు విని నగరంబు నలంకరింప నుద్యోగించి చతురంగబలంబుతో నెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యిట్లని నుతియించె. 70

దండకము॥ శ్రీమానినీరాజమానా సునాసీర కార్తస్వరాకార కోటీరకోట్యంచితానర్ఘ్య రత్నప్రభాపుంజ రారాజదంభోజపాదా భవద్దివ్యచారిత్రమెన్నంగ నేనెంతవాఁడన్ హరిమున్ను దైనందినంబైన సంవర్తకాలంబునం దీజగంబెల్ల నేకార్ణవంబౌచు వర్తింపఁగా మత్స్యరూపంబుఁదోరంబుగాఁబూని పాథోధిమధ్యంబునన్ సోమకున్ ద్రచ్చి వేదంబులందెచ్చి యాబ్రహ్మకీవిచ్చి మన్నింపవే! నాఁడుదేవాసురుల్గూడి పీయూషలాభాభిలాషంబునన్ వారిధిన్ మందరాగంబుఁ గవ్వంబుగాఁజేసి త్రచ్చంగ నీవద్రిభారంబుఁ గూర్మంబవైతాల్చి పాలింపవే! దేవకోలాఖ్యచేతన్ హిరణ్యాక్షునిం ద్రుంచిదంష్ట్రాగ్రనాళంబునన్ భూమిగోళంబుఁ బంకేజకోశంబుగా మోచి లోకంబులన్ గావవే! చిత్రచారిత్ర నీభక్తవాత్సల్యమెన్నంగ నాపన్నగాధీశుఁడైనన్ సమర్థుండె! ప్రహ్లాదసంరక్షణాయత్తచిత్తుండవై యుక్కుకంబంబునన్ బుట్టి శ్రీనారసింహాకృతిన్ రాక్షసేంద్రేభమున్ జీల్చి బ్రహ్మాదులగ్గింపవర్తింపవే! వామనత్వంబునన్ బూనివైరోచనింబట్టివంచించి లోకంబుఁద్రైవిక్రమస్ఫూర్తిచే వాసవాధీనముంజేసి మోదంబుఁగావింపవే! భార్గవాభిఖ్యతన్ గార్తవీర్యార్జునున్ గూల్చి లోకంబు నిక్షత్రముంజేసి యీవేదినింగశ్యపాధీనముంజేయవే! రామరూపంబునన్ వార్ధిబంధించి లంఘించి పౌలస్త్యుహింసించి వైదేహినింగూడి పట్టాభిషిక్తుండవై పృథ్విపాలింపవే! భూమిభారంబు వారింప బ్రహ్మేంద్రరుద్రాదులున్ నిన్నుఁ బ్రార్థింపఁగా వాసుదేవుండవై కంససాల్వాదులంగూల్చి లీలాకృతిన్ దాల్చి యీరీతి వర్తించు మీదివ్యకళ్యాణచారిత్రమున్ దెల్పశక్యంబె బ్రహ్మాండభాండంబునం దేరికైనన్! ననున్ నీకృపాదృష్టికిన్ బాత్రునింగాఁ గటాక్షింపవే శ్రీరమాలింగితాంగా! సురారాతిభంగా! విహంగేట్తురంగా! నమస్తే నమస్తే నమస్తే నమస్తే 71

చ॥ అని యనురాగపూర్వముగ నాహరిని న్వినుతించి కోసలా
వనిపతి తూర్యనాదములు వందిజయధ్వను లుల్లసిల్లఁగా
మనుజులు సంతసిల్లఁ బురమానవతు ల్విరులోలిఁ జల్లఁగా
ఘనమగు రాజమార్గమునఁ గౌతుకమేర్పడఁ దోడితెచ్చుచున్ 72

క॥ కాంచన మణిమయ ఘనసౌ । ధాంచల మందిరములందు హర్షముమీఱన్
గాంచనచేలుని నునిచి శు । భాంచిత చేతస్కుఁడయ్యె నావిభుఁ డెలమిన్ 73

వ॥ ఇత్తెఱంగున రమాకాంతుండు నగ్నజిద్ధరణీకాంతపూజితుండై విడిదిఁబ్రవేశించి విలసిల్లుచుండె నంత నెలంతలు సుదంత పాలికింజని చతురవచనంబుల నిట్లనిరి.

క॥ చెలి చెలువంబుగఁ గలుముల । చెలిచెలువుం డిటకువచ్చెఁ జెలిమిదలిర్పన్
వలరాయని ఢాకకుఁ గలు । వలరాయని కాక కులుక వలదిఁకఁ గలికీ 75

క॥ నమ్మమ్ము లెమ్మిఁక లేవచ । నమ్ములు వగగుల్కు భూషణమ్ములు వేడ్కన్
గొమ్మా తాల్పుము మైఁగై । కొమ్మా కలపమ్ము నలఁదుకొమ్మా యఱుతన్ 76

క॥ అని చిగురుబోణు లిత్తెఱఁ
గునఁ బలుకుచునుండువేళఁ గోమలికి న్నె
మ్మనమున సిగ్గును సంతస
మును విరహంబును గరంబు ముప్పిరిగొనియెన్ 77

**: హంసి నాగ్నజితీసందేశమును కృష్ణునకు తెలుపుట :**

వ॥ అంత హంసాంగన యంతరంగంబున సత్యాంగనారత్నంబుతో నిట్లనియె. 78

క॥ హరిదర్శనమున కేగెద । హరిణాక్షీ నీకటాక్ష మలరఁగ మమున్
గరుణింపుమింక మీకిం । కరులమన న్గల్కి పల్కెఁ గౌతుకమొదవన్ 79

క॥ నీరక్షీర వివేకము । నారూఢిగఁ జేయు మీర లాహరితోనే
తీరునఁ దెల్పెదరో మరు । నారసముల కడిమినణఁచి నను దయఁగొనఁగన్ 80

వ॥ అనిన హంసవిలాసిని యాపల్కులాకర్ణించి మన్నించి తనవిభునిన్గూడి నగధరుని
పాలికింజని నాగ్నజితీసందేశంబు విశదంబుగాఁ దెల్పుచు నిట్లనియె. 81

సీ॥ మున్ను నీచరితంబు విన్నది మొదలుగాఁ బడఁతికి మాసమబ్దముగఁ దోఁచె
వలపుమీఱఁగ నిన్నుఁదలఁచిన దాదిగాఁ గలికికి దినము నక్కరణిఁ దోఁచె
నరయ నీదరికి నన్నంపిన దాదిగా వెలఁదికి జాము లవ్విధిగఁ దోఁచె
వెలయ నీరాక నేఁ దెలిపినదాదిగా లేమకు గడియలారీతిఁ దోఁచె
నీవు చతురంగసేనతో నేర్పుమీఱ
రాజమార్గంబునను నీపురంబుఁ జేరి
తేజరిల్లంగ వినుమ యాతెఱవ కిపుడు
నిముస మాజాడగాఁ దోఁచె నీరజాక్ష 82

క॥ కావున నావిన్నప మిఁక । భావంబున నునిచి కరుణ భావింపుచు నీ
వావెలఁదికోర్కె సఫలముఁ । గావింపుము వేగమునను గమలాధ్యక్షా! 83

## : అర్జున రాయబారము :

వ॥ అను మరాళాంగనపల్కు లాకర్ణించి వెన్నుండు మనంబున వివరించి పార్థుని రావించి యిట్లనియె. 84

క॥ కోసలధరణీవిభుని ని । వాసంబునకేగి సరసవచనరచనలన్
వాసిగ సత్యను మాకై । భాసురముగ నడిగిరమ్ము పాండుతనూజా 85

వ॥ అని వెన్నుండు పుత్తెంచిన ఫల్గునుండు గర్గానుమతంబున నగ్నజిదాలోకనంబుఁ గావించి వల్గువచనంబుల నిట్లనియె. 86

క॥ విష్ణుపరాక్రముఁడౌ మా । కృష్ణునకు న్నీదుతనయఁ గీర్తితనయరో
చిష్ణుశరీర నొసఁగి వ । ర్ధిష్ణుఁడవై చెలఁగు వసుమతీపతితిలకా 87

క॥ యదువీరుఁడు కన్యాశు । ల్కదుఁడని మదిలోనఁ దలఁపక మురారికి స
మ్ముదమున రేపటి విదియనొ । తదియనొ నీతనయనొసఁగు ధరణీరమణా 88

వ॥ అని విజయుండు తెల్పినవచనంబులకుఁ గోసలనగరవల్లభుండు సంతసిల్లుచు నిట్లనియె. 89

ఉ॥ తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి సర్వదేవతా
కామితభోగదాయి మధుకైటభదారణుఁ డవ్యయుండు ల
క్ష్మీమదిరేక్షణావిభుఁడు చెన్నలరారుచు నల్లుఁడైన ను
ద్దామతనొందు నాదుసుకృతంబు కరంబుగఁ బాండునందనా 90

క॥ జన్యావారితునకు సౌ । జన్యాదిగుణాంచితునకు జగదాత్మునకున్
గన్యాదానముఁజేసిన । ధన్యంబై నాదుయశము తద్దయు వెలయున్ 91

వ॥ అయిన నొక్కసందేశంబు విన్నవించెద నాకర్ణింపుము. మున్ను లక్ష్మీకటాక్షంబున మత్కుమారీరత్నం బుదయించి దినదినప్రవర్ధమానయై విలసిల్లు సమయంబున నిక్కన్యకుఁ దగిన వరుండెవ్వండని యాత్మగతంబున వివరించువేళ నామందను గైలాసశిఖరాకృతిఁ దనరుచు నేడాఁబోతు లుద్భవించి బలంబుగ నతిశయించి కాపరుల నతిక్రమించి పౌరుల బాధింప బలాధ్యక్షులవలన నావృషభంబుల నొక్క ప్రదేశంబుఁ బ్రవేశంబుఁ జేయించి రాజన్యులలో నెవ్వండేని వీనిబంధించిన నతనికి నానందన నొసంగెదనని చాటించిన ధరారమణులు వచ్చి యా గోవృషంబులఁ జూడంజాలక చనిరిగావున నీజనార్దనుండును బెబ్బులులపగిది నబ్బురంబుగ జొబ్బిలుచున్న నాగిబ్బలయుబ్బణంచి వీర్యశుల్కయగు నానందనన్బరిగ్రహించి

నన్నానందింపంజేయవలయుననిన నతండు నవ్వృత్తాంతంబంతయు శౌరికి విన్నవించి తదభిమతంబు రాజునకుందెల్పిన నతండాభీరులఁ బిల్వంబంచి యా వృషభంబులం దెప్పించి నందనందనుని సపరివారంబుగా నచ్చటికి రావించి నగ్నజిద్భూవల్లభుండు శౌరినుద్దేశించి యిట్లనియె. 92

## : కృష్ణుఁడు గిత్తలను కట్టివేయుట :

గీ॥ శౌర్య ముంకువగాఁ జేసి శౌరి వీనిఁ
బట్టి కట్టితివేని నాపట్టినిపుడు
నీకొసఁగి పెండ్లిచేసెద నిక్కమనఁగ
నగధరుఁడు నవ్వి కాంచె గోనగములపుడు 93

క॥ కాంచిన నయ్యాఁబోతులు
కాంచనపటధారిపైకిఁ గాల్రద్రువ్వుచు వీ
క్షాంచలములఁ జూచుచు రో
షాంచితముగ ఱంకెలిడుచు నాడుచునుండన్ 94

మ॥ అతిరూక్షేక్షణుఁడై యదుప్రవరుఁడుక్షాధ్యక్షగోత్రంబులన్
శతధారాయిత బాహుదండముల నిచ్చన్బట్టి ధట్టింపఁగాఁ
గుతలంబల్లలనాడెఁ జుక్కలురాలె న్గొండల్దలంకె న్సుర
ప్రతతు ల్పుష్కరవీధినుండి యుపరిత్రస్తంబులయ్యెం గడున్ 95

వ॥ వెండియు. 96

గీ॥ అన్నిఁటికి నన్నిరూపులై వెన్నుఁ డలరి
యాలబోతులపై బాలకేళిలీల
సలుప నవి వానికొమ్ముల శౌరియెదను
బొడిచి గెలిచిన వాని నమ్మురహరుండు 97

గీ॥ బెట్టిదంబుగఁ గొమ్ములఁ బట్టి నెట్టి
ముట్టెలవియంగఁ గొట్టుచు దిట్టముగను
దొడరి పిడికిటిపోటుల మెడలుతొడలు
నడుము లదరంగఁ బొడుచుచు నడఁచిపట్టి 98

గీ॥ పగ్గముల వానిఁ గట్టిన పద్మనాభు
పై విరులవాన గురిసె నప్సరసలాడి

రాదరంబున ఫల్గునుం డపుడు హరినిఁ
గౌఁగిలింపుచుఁ దనరారెఁ గౌతుకమున 99

గీ॥ శౌరివిక్రమసౌందర్యసరసచరిత
రూపయౌవనసద్గుణాటోపములను
గాంచి కోసలవిభుఁడు దాఁ గౌతుకమునఁ
గోర్కెదీరంగఁ బల్కెను గోపసుతుని 100

క॥ సత్యంబిది ముమ్మాటికి । సత్యను నీకేనొసంగి సంక్రందన సం
స్తుత్య యశోలంకృతకృత । కృత్యతఁ బాటింతునింకఁ గేశవకృష్ణా 101

**: శ్రీ కష్ణుని పెండ్లికుమారునిఁ జేయుట :**

వ॥ అనిపల్కి విజయునింజూచి "శుభస్యశీఘ్రం"బన్న విధంబున నిక్కార్యంబున కాలస్యంబుసేయక వాసుదేవుని పెండ్లికుమారునిం జేయవలయునని సూచన యొనర్చిన నతండును నృపపుంగవునకు హృదయంగమంబుగా సమంచిత భాషణంబుల మంచిది సంతోషమాయె ననిపలికి గోవిందుని నిజమందిరమునకుఁ దోడ్కొనిచని మంగళస్నానం బొనరించి యలంకరింప నుద్యోగించెనంత. 102

క॥ దువ్వెనలఁ గురులు నున్నగ । దువ్వి యొయారముగ వైచు తోరపు సిగలై
క్రొవ్విరిసరు లొరపుగనిడి । రవ్వల మురిదాల్పు చిత్తమలరఁగ నింతుల్ 103

వ॥ మఱియును. 104

గీ॥ మంజులకిరీట మలరంగ మకరకుండ
లములు చెలువొంద హేమచేలములు మెఱయఁ
బునుఁగుజవ్వాజి తావులు బుగులుకొనెడు
గంద మలదంగఁ జెన్నొందెఁ గంసవైరి 105

వ॥ వెండియు. 106

గీ॥ నిల్వుటద్దంబు ముందర నెలకొనంగఁ
దిలకమలికమ్ము ననువుగఁ గులుకుదీర్చి
శివుఁడు రేవెల్గురేఖఁ దాల్చిన విధాన
భాసిలఁగఁ గట్టె ముత్యాలబాసికంబు 107

క॥ ఈవిధమునఁ గౌంతేయుఁడు
గోవిందునిఁ గూర్మిపెండ్లికొమరునిగా సం

భావించిన విని కోసల
భూవిభుఁ డాసమయమునను ముదమెద నొదవన్ 108

కు॥ బంగారు గోడలందున । రంగగు లత్తుక నమర్చి రహితోరణముల్
ముంగిళ్లనిడి హొరంగుగ । శృంగారింపఁగఁ బురంబుసిరి చెలువొందెన్ 109

## : చెలులు నాగ్నజితిని అలంకరించుట :

కు॥ చెలులంగని మనసత్యం । జెలువొంద నలంకరింపఁజేయుఁడనిన న
వ్వెలఁదుకలు వల్లెయని న । వ్వెలయఁగ జని మగువఁగాంచి వేడుకమీఱన్ 110

గీ॥ మానికపుబొమ్మ కొమ్మ రమ్మా బిరానఁ
గోర్కెలీడేరె హరి పెండ్లికొమరుఁడయ్యె
ననుచు వ్రీడావనతముఖి నతివనపుడు
సొంపెసఁగ గద్దెపై వసియింపఁజేసి 111

గీ॥ అపుడు ముత్తైదువలు శోభనాక్షతలను
దలను గీలించి దీవించి సలలితముగ
వేడుకలుమీఱఁ బాటలుపాడు నంతఁ
జానయొక్కతె సంపంగినూనెఁ దెచ్చి 112

గీ॥ కుంతలమ్ములు గదలఁ జెక్కులుసెమర్పఁ
గౌను వణఁకంగ హారము ల్కదునటింప
ఘల్లుఘల్లున బంగారుగాజు లులియ
సలలితంబుగఁ దలయంటి సంభ్రమమున 113

సీ॥ కొనగోళ్లదువ్వుచుఁ గురుల చిక్కెడలించి నెఱజాజి గొజ్జంగినీరుఁ బోసి
వడినీరుపాయఁగాఁ బిడిచి గొబ్బున విప్పి కదలించి నెమ్మేనఁ గమ్మపిండి
యలఁది పన్నీటను జలకమార్చి మడుంగువలువచేఁ దడియొత్తి వన్నెమీఱు
వలిపెమ్ముఁగట్టి మైఁగలపమ్ముఁ బూసి మంజులమైన కంచెల నలరఁదొడిగి
కీలుజడవైచి పూసరాల్గీలుకొలిపి । లలితభూషణ మణిహారముల నొసంగి
లలనలీరీతి సత్యనలంకరింప । మదనసామ్రాజ్యలక్ష్మినా మగువ దనరె 114

వ॥ ఇత్తెఱంగున నగరంబునలంకరించి తనకుమారిం బెండ్లికూఁతుం గావించి యజ్జగతీరమణుండు సుముహూర్తం బాసన్నంబయ్యె నాలస్యంబుసేయక విచ్చేయవలయునని తన మంత్రులఁ బార్థపాలికిం బనిచిన నతండును

బుండరీకాక్షుని వేదండసమారూఢుం జేసి. 115

సీ॥ పంచవాద్యంబులు పరిఢవిల్లఁగ భూరిభేరికానాదము ల్బోరుకొనఁగ
సరసంపుబిరుదధ్వజంబులు చెలగంగ వందిమాగధులు కైవారమొసఁగ
నాగరుల్సూనము ల్నయమొప్పఁ జల్లంగ మహతాపుదీధితుల్ రహివెలుంగఁ
జందనాగరు దివ్యసాంబ్రాణి ధూపితంబై రాజమార్గంబు నలరఁ ద్రోవ
రాని బలగంబుతోడ ననూనలీల
వచ్చి నగరంబుసొచ్చి యవ్వారణంబు
డిగ్గి నెలకొనిరా శౌరిమొగ్గరముగ
నెదురుకొనె రాజు నెమ్మది ముదము మీఱ 116

వ॥ అంత. 117

క॥ అడుగులకు మడువు లొసఁగుచు । నెడనెడ నప్పుడమితేఁడు నింపుదలిర్పన్ ।
గడువేడ్కశౌరిఁ దోడ్కొని । తడవొనరఁగఁ బెండ్లిచవికె దరికిన్జనుచున్ 118

గీ॥ గులుకు మగరాల తళ్కుబోదెలను గప్పు
రాలకంబములను గెంపురాలపట్టి
యలకలికిపచ్చరాలతల్పులును గల్గి
పరిఢవిల్లెడు గొప్ప యుప్పరిగ నడుమ 119

గీ॥ పలునిగారింపు పనుల చప్పరముక్రింద
నొఱపుమీఱెడు యపరంజి యఱుగుమీఁద
నలరు మణిపీఠముననను శ్రీహరి వసింపఁ
జేసె నక్కోసలేంద్రుండు చెన్ను మీఱ 120

వ॥ ఇత్తెఱంగున ధరారమణుండు రథాంగధరుని నునిచి తనకుమారికను దోడితెమ్మని మించుబోణులం బనిచిన నవ్వలంతుల సంతసిల్లుచుం జని తల్లిచెంగట మెఱుంగుఁదీగె పగిది వెలుంగుచున్న కురంగనయనం గని బంగరుబొమ్మా వెన్నునకు నిన్నుఁ గన్యాదానంబుసేయఁదలంచి మీతండ్రి నిన్నుఁబిలుచుకొనిరమ్మని మమ్ము ననిపెనని పలుక సిగ్గును జిఱునవ్వును మొగంబునఁ జెలంగ నక్కన్నియ చెలులనడుమ విలసిల్లుచు వచ్చుసమయంబున. 121

సీ॥ లేఁగౌనుపై నొక్కలేమ కేల్గీలించి చేడియ నల్లనఁ దోడితేఁగ
కలికియొక్కతె చనుంగవపైని యించుకజారుపైట నమర్చి సరవిరాఁగ

మగువయొక్కతె కాంత వగగుల్కు మోమున నమరు లేఁజెమట చేలమునఁ దుడువ
లలితాంగియొక్కతె లలనకీల్జడఁ జారుగేదంగిఱేకులఁ గీలుకొలుపఁ
గువలయశ్రీల విలసిల్లు కొమ్మచూపు
లంఘ్రుల న్నవనీలంపు టందెలనఁగ
వెలయసిగ్గను హర్షంబు ప్రేమ మాన
సమునఁ బెనఁగఁగ సతి పెండ్లిచవికిఁ జేరె 122

వ॥ ఇత్తెఱంగున నక్కురంగనయనను నంగనామణులు దోడితెచ్చి రథాంగధరుని చెంగట నిలిపిన. 123

గీ॥ మించు క్రొమ్మించుతీవను మించు మొయిలు
లీలఁ జని తోడ విలసిల్లు నీలవర్ణుఁ
గాంచి భూసురకామిను ల్కౌతుకమునఁ
దగును వీరలకని మదిఁ దలఁచి రెలమి 124

వ॥ అప్పుడు. 125

## : నాగ్నజితీ కృష్ణుల వివాహము :

క॥ కరములఁ గంకణములు న । య్యిరువురకున్ బూన్చి పెద్దలింపుగ దీక్షా
కరులం గావించిరి శ్రీ । కరమని తాపసులు పలుకఁగా మోదమునన్ 126

వ॥ అంతఁ గోసలనగరీకాంతుండు కాంతాసమేతంబుగా శ్రీకాంతుచెంతకుంజని.

క॥ గర్గార్యాది పురోహిత । వర్గమిదె ముహూర్తమనుచు వాసిగఁ బలుకన్
భర్గాది సర్వసుమన । స్సర్గాంచితు నెదుట నునిచి సత్యను వేడ్కన్ 128

గీ॥ లలిత కాంచన భృంగారుజలము తనదు
వనితలార్పఁగ హరిపాదవారిజములు
కనకపుంబళ్లెరంబునఁ గడిగి వేడ్క
గంధమాల్యాదు లొసఁగుచుఁ గౌతుకమున 129

వ॥ మఱియును. 130

క॥ మధుసూదనున కొసంగెన్ । మధుపర్కము దివ్యరత్నమయహారములన్
బ్రథితముగ గోత్రనామము । లు ధరావిబుధు ల్పఠింప లోలత నపుడున్ 131

కు॥ వసురుద్రాదులు గొలువఁగ । వసుదేవునిసుతుని కొసఁగె వాసిగఁ దనయన్
వసుధామరులకు నభిమత । వసువులునిడి నృపతియలరె వాంఛదలిర్పన్ 132

కు॥ పరిజనులంతఁ బ్రమదసం । భరితులగుచు దంపతులకుఁ బరికింపఁగ నీ
తెరచాలదనుచు నవ్వుచుఁ । దెరయునిచిరి నెలఁతసిగ్గుఁదీరి చెలంగన్ 133

కు॥ పంచశరుండా నడుమను
పొంచి కఱకుఁదమ్మికలువములుకులు వడిగా
నించెననఁ జూఱుకుఁజూపులు
మించెను నిరువురిపయి భ్రమింపఁగ మనముల్ 134

కు॥ కల్యాణము నరపతి సా । కల్యమెసఁగఁజేయుచుండఁగాఁ గామినులా
కల్యాణంబుగ లక్ష్మీ । కల్యాణముఁ బాడిరపుడు కౌతుకమొదవన్ 135

కు॥ మంగళతూర్యరవంబు సె
లంగఁగ సత్యాసతీగళంబున వేడ్కన్
మంగళసూత్రముఁ గట్టుచు
నంగజగురువలరె హృదయ మానందింపన్ 136

గీ॥ అమరదుందుభిరవగర్జితములతోడ
సురలు సుమవృష్టిఁ గురియ నప్సరసలాడ
సరసగాంధర్వగానవిస్ఫురణ నొసఁగ
నారదుండాడె మింట విన్నాణముగను 137

కు॥ బంగారు పళ్లెరంబుల । రంగుగ ముత్తియఁపుఁబ్రాలు రహినించి సతుల్
పొంగుచు నిరుగెడలం దన । రంగన్వారిప్రాలు చెలిశిరంబున నుంచెన్ 138

వ॥ అప్పుడు. 139

గీ॥ వనిత సరసంపు నెఱిగుంపు వలనఁ జారి
వెలయు తలఁబ్రాలు వగఁజూడ వింతయయ్యె
మొయిలు గడనింగి విలసిల్లి ముత్తియములు
కుప్పకుప్పలుగా వానఁగురియు కరణి 140

పృథ్వీవృత్తము॥ పొలంతులు వలంతులై పొదవి సేసలందియ్యఁగా
వెలంది వెఱగొందుచు న్విభునిమౌళిపై నించకెం

పులంగదిమి రంగున న్బొలుపుమీఱుచు న్జారుచున్
జెలంగెఁ దనుసంగతి న్సిరుల నింద్రనీలాలనన్ 141

వ॥ అంత. 142

క॥ హరి హరిణాక్షికరమున్ । గరమునఁ గీల్కొలిపి చెలఁగి కరమరుదుగ బం
గరుపెండ్లిపీటపై సుం । దరముగ వసియించి ముదమెదం దళుకొత్తన్ 143

వ॥ అప్పుడు. 144

గీ॥ పడఁతు లయ్యెడ శుభవేది నిడినపావ
కంబునను వేడ్క లాజహోమంబొనర్చి
రంగలరు కొంగుముండ్ల మరంగ సప్త
పదములను మెల్లమెల్లనఁ గదలినడిచి 145

వ॥ మఱియును. 146

క॥ బంధువులు దెల్ప నప్పుడ । రుంధతి దర్శనముఁజేసి రుచిరాకృతియౌ
గంధేభయానతోడను । సింధురవరదుండు దనరె సిరిచెలువొందన్ 147

వ॥ అప్పుడు. 148

మత్తకోకిల॥ రంగుమీఱి మెఱుంగు మించు చెలంగు మేఘముకైవడిన్
బొంగుచు న్హరిపెండ్లిపీటను బొల్తితో వసియింపఁగా
మంగళం జయమంగళం శుభమంగళం బనిమానినుల్
మంగళారతులిచ్చి పాడిరి మత్తకోకిలరీతులన్ 149

వ॥ వెండియు. 150

గీ॥ వేడు కలరంగ మురవైరి వివిధభక్ష్య
చోష్యపానీయభోజ్యవస్తువులఁ దనరు
భోజనమొనర్చెఁ గాంచన భాజనముల
బాంధవజ్ఞాతిసహజసంపన్నుఁ డగుచు 151

క॥ ఈరీతి నాల్గుదినములు । కూరిమిమీఱంగ సల్పి కువలయవిభుఁడున్
వారక నైదవరాతిరి । నారూఢిగ నాగవల్లి నటుగావించెన్ 152

## : నాగ్నజితితో కృష్ణుఁడు ద్వారకకు బయలుఁదేరుట :

వ॥ ఇత్తెఱంగున నగ్నజిద్ధరారమణుండు సాకల్యంబుగాఁ గళ్యాణంబొనరించి సంతసించి యవ్విరించిజనకునకుఁ గిరీటమకరకుండలగ్రైవేయక హారకేయూరాది భూషణంబులును నానావిధ శస్త్రాస్త్రంబులును మఱియు వినోదోచిత వస్తువుల నొసంగి తమకు వందనం బొనరించినిలిచిన నందనకుఁ బత్నీసమేతుండై నవరత్నంపుటొడిబియ్యంబునించి సరసాంబరాభరణంబులును గ్రామంబులును నాలమందలును దాసీజనంబులును మఱియు మనోహరవస్తువులు నరణంబుగా నొసంగి యదువృష్ణిభోజాగ్రణులను సముచితంబుగా సత్కరించి తక్కినపరిజనుల మనోరథంబు సఫలంబుగావించి తననందన నందంబుగా గోవిందునికరంబున నునిచి కరుణార్ద్రచేతస్కుండై పరికించి యప్పగించి చెలువొంది వందిమాగధ కైవారంబులును భేరీభాంకారరావంబులు నుల్లసిల్ల బంధుసహితుండుగా గోవిందుని ననతిదూరంబుగాననిచి. మరలి నిజమందిరంబుఁజేరి దారపుత్రాది యుతంబుగా నానందించుచు సకలభోగంబు లనుభవించుచు రాజ్యంబుఁ బరిపాలనంబు సేయుచు సుఖంబున నుండె నంతటవాసుదేవుండు నాగ్నజితిన్బెండ్లియాడి తోడ్కొని చతురంగబలంబుతోఁ గదలి ద్వారకా నగరంబునకుఁ జేరు నభ్యంతరంబున. 153

## : ఎదిరించిన శత్రురాజుల నర్జునుఁడు జయించుట :

గీ॥ మున్ను సత్యాస్వయంవరమునకు వచ్చి
బలిమి ననిసల్పి యాలబోతులకు నోడి
నట్టి రాజన్యవీరుల య్యంబుజాక్షు
విక్రమంబెల్ల విని మది వెఱఁగునొంది 154

వ॥ మఱియును. 155

క॥ తమతమ బలములతోడన్। సమరోత్సాహమున నృపతిసముదయములు న
క్కమలాక్షువాహినికి న। డ్డమువచ్చిరి భేరికాది ఢాంకృతు లలరన్ 156

వ॥ వెండియు. 157

క॥ వచ్చి బలమ్ములు[3]గదిమి వి
యచ్చరు లత్యంతవిస్మయమునొంది తమున్
మెచ్చఁగఁ బటుభల్లంబులఁ
గ్రుచ్చి యదూత్తములనృపులు గ్రుమ్మిరి పెలుచన్ 158

వ॥ అప్పుడు. 159

క॥ బెబ్బులులపగిది యాదవు । లబ్బులుయూధపులఁ గదిసి యహమహమిక లా
గుబ్బుగ సంగ్రామంబున్ । నిబ్బరముగ సల్పి రపుడు నేర్పుదలిర్పన్ 160

క॥ ఇరువురబలమ్ము లిత్తఱి । శరశస్త్రాస్త్రముల రణముసల్పుచును భయం
కరనాదమేదురములగు । శరధులవలెఁ గలసె నమరసంఘము పొగడన్ 161

వ॥ అట్టిసమయంబున. 162

క॥ కేకయసృంజయశకబా । హ్లీకాది ధరాధినాధు లేకంబయ్యా
భీకరయాదవసైన్యము । ప్రాకటముగఁ జుట్టుముట్టి పైకొనిరి వెసన్ 163

క॥ భీకరశరవృష్టి న్మొ । ర్వీకృతరణితములఁ గటకవిద్యుత్ప్రభలన్
స్వీకృత కల్పాంబుధరో । గ్రాకృతులై విమతనృపతు లలరఁగఁ గడిమిన్ 164

వ॥ అప్పట్టున. 165

ఉ॥ పాండుతనూభవుండు తనబాంధవులత్తఱి సంతసిల్లఁగా
గాండివ మేడ్తెర న్దిగిచి కల్పకృశానుసమానుఁడై లస
త్కాండముల న్నిగిడ్చి నృపకాండముల న్దెగటార్చి పేర్చి త
త్కాండమున న్ముదంబెసఁగఁ దద్దయునొత్తెను దేవదత్తమున్ 166

వ॥ ఇవ్విధంబున విజయునివలన రణంబునఁ బరాజయంబునొంది విమతజగతీ రమణులు కాందిశీకులైనంగని నందనందనుండు పాండునందనుపరాక్రమం బభినందించి సేనాసమేతంబుగా మధ్యందినంబున నొక్క నదీతీర విరాజమానరమణీయారామశోభితంబగు ప్రదేశంబున వసియించి విలసిల్లు సమయంబున. 167

## : మధుపాన వర్ణన :

ఉ॥ ఆలలితాటవీస్థలి నహార్యసమీప విరాజ దాపగా
కూలమునందుఁ గ్రమ్మికొని ఘుమ్మని తావులెసంగఁ బొంగు హిం
తాళవిశాలతాళమధుధారలఁ గాంచి తదీయసేవనా
లోలతనొందిరారధికులు ల్స్రమదాంచిత చిత్తవృత్తులై 168

వ॥ మఱియును., 169

కII యదువీరులు మధుసేవను
మదవిహ్వలచిత్తులగుచు మధుసూదను సం
పదనెన్నుచు నాడుచు స
మ్మదమొందుచు గంతులిడి ప్రమాద మెనయుచున్ 170

వII వెండియు. 171

గీII అక్రమాలాపధావనహసనగాన । నర్తనవిహారపాతననమనవారి
కేళులను బాలలీలలఁ గెరలి మిగుల । సంతతానందసంభృతస్వాంతులైరి 172

వII ఇవ్విధంబున నయ్యనీకాగ్రణులు మధుపానసంజాతచేష్టావిశేషంబుల నర్ణవంబుల కరణి ఘూర్ణిల్లుచుఁ దౌర్యత్రికాదివినోదంబుల నారాత్రి నచటనివసించి మఱునాడు మురవైరి ననుసరించి ద్వారకానగరోపకంఠవిరాజమానోద్యానవనసమీపంబునకుఁ జనుసమయంబున. 173

**: వధూవరులకు ద్వారక స్వాగతము పల్కుట :**

ఉII కోసలకన్య నచ్యుతుఁడు కూరిమిమీఱఁగఁ బెండ్లియాడి యు
ల్లాసమెలర్పవచ్చెనని లగ్గుగఁ జారులు దెల్ప నజ్జనా
వాసము ద్వారకాపురము వన్నియలూర నలంకరించి తా
భాసురలీల రాముఁడు సబాంధవుఁడై యెదురేగె నత్తఱిన్ 174

వII అప్పట్టున. 175

కII తనకెదురుగ వచ్చిన రా । మునిపాదమ్ములకు మ్రొక్కి మురహరుఁ డపుడా
వనితామణితోఁ దా దీ । వనలొందె నశేషబంధువర్గం బలరన్ 176

వII వెండియు. 177

కII అటఁ గృష్ణుండును బ్రహితో । త్కటఢక్కాపటహభేరికాతౌర్యరవా
ర్భటులు న్నలుదిక్కులఁ బి । క్కటిల న్నిజపురముఁజేరెఁ గౌతుకమొదవన్ 178

కII రథమునఁ దనసతి నిడుకొని । మధుసూదనుఁ దరుగుదేర మానినులు మనో
రథములుదీరఁగ హరిపైఁ । బృథుసుమవర్షంబు గురిసిరింపుదలిర్పన్ 179

కII ఈతెఱఁగునఁ బౌరజన । వ్రాతంబు కడుం జెలంగ వసుదేవసుతుం
డాతెఱవతోడ సతత । శ్రీతతమగు నంతిపురముఁ జేరె ముదమునన్ 180

కః భూసురకాంత లొసంగెడు । భాసురనీరాజనములు పరికించుచు న
క్కోసలనందనతోడ । న్భాసిల్లె న్వారి రసానుబంధ మెలర్పన్ 181

వః అప్పుడు. 182

కః దేవకికి న్వసుదేవున । కావనజాక్షుండు మ్రొక్కె నంగనతోడన్
దీవనలొసంగి వారు వ । ధూవరుల నొకండుసేయఁ దొడరఁగ నంతన్ 183

గీః సూర్యుఁ డస్తాద్రి జేరె నవార్యతమము
నిండె బ్రహ్మాండమున రాజమండలంబు
నుదయమయ్యెను జంద్రికలొదవె దిశల
మదనుఁ డలరెను సామ్రాజ్యపదము నొంది 184

వః ఆసమయంబున. 185

**: తొలికలయికకు వధూవరుల నలంకరించుట :**

చః హరి జలకంబొనర్చి హృదయం బిగురొత్తఁగ గంధమాలికా
సురుచిరభూషణంబులను శోభనచేలముల న్ధరించి కాం
తరసమనోజ్ఞపాయసఘృతప్లుతభక్ష్యఫలేష్టశాకభో
జ్యరసముల న్భుజించి మధురాంబువు గ్రోలి సుఖంబు నొందుచున్ 186

సీః మంజులస్తంభాగ్రరంజితమాణిక్యకాంతులు దీపాధికత భజింప
శృంగారమైన మెఱుంగుబంగరుకీలుబొమ్మలు కొమ్మలపోల్కిఁ దనరు
సోరణగండ్లను సోఁకెడుతెమ్మెర ల్చామరవిక్షేపసరణి వెలయఁ
బొలుపొంద పంజరములఁ జిల్కపల్కులు శృంగారగాథలై చెన్నుమీఱఁ
బద్మరాగప్రవాళసోపాననీల
మణికవాటప్రథితవజ్రమహితకుడ్య
మరకతాంచితవేదికాస్ఫురణ నమరు
చారుతరమైన కేళికాసౌధమునను 187

సీః పగడాలకోండ్ల బల్మగరాలపట్టెల చంద్రంపుపట్టెడ జిగిఁజెలంగు
హంసతూలంబుచే నలరెడి ముకమాలుపాన్పున నించిన పారిజాత
సుమజాలములపైని సొంపుగాఁ గప్పిన సన్నంపు వలిపెమ్ము చెన్నుమీఱ
బాలీసుటెక్కెల బంగారుకాంతు లెసంగు సింగారంపు శయ్యపైనఁ

బవ్వళించిన కంసారి భావమెఱిఁగి । పువ్వుఁబోణులు సత్య ప్రభూతరత్న
లసితభూషణరాజి నలంకరింపఁ । దొడఁగి రప్పుడు వేడుక ల్గడలుకొనఁగ 188

చ॥ సురుచిరశీతలాంబువుల సుందరికింజలకంబులార్చి మేల్
సరసపురంగు పావడనొసంగి చొకాటఁపుఁజీరెఁ గట్టి సుం
దరరుచిమించుకంచెలఁ బదంపడి సంతనచేసి తావులన్
గరమరుదై హొయల్గులుకు గందమలంది సరుల్ఘటింపుచున్ 189

వ॥ మఱియును. 190

ఉ॥ అందముగుల్కు కుందనపుహారములు న్శశిపువ్వు పైఁడిబా
బ్బందులు సండిదండలును బాపటిబిందులు ముద్దుటుంగరా
లందెలు కమ్మలున్ మురువులాదిగ మిక్కుటమైన సొమ్ములం
దంద నలంకరించి రిభయానలు కస్తురిబొట్టు మున్నుగాన్ 191

**: నాగ్నజితితో చెలుల సరసోక్తులు :**

గీ॥ ఈగతి నలంకరించి యయ్యిగురుబోండ్లు
నిలువుటద్దంబుఁ గడుమ్రోల నిలిపిపలికి
రతివరో నీవువిభునికి హర్షమొదవఁ
జేయనిఁకఁ జనుమనఁ జెలి సిగ్గునొందె 192

వ॥ వెండియు. 193

గీ॥ తమ్మి నరచూపులను జూచి దంభలీల
బొమలు ముడివైచి చిఱునవ్వుమోమునందు
మొలకలెత్తంగ నెమ్మేనఁ బులకలొదవు
పొలఁతిభావంబుఁ బొడఁగని వెలఁదు లపుడు 194

క॥ వలమురిదాలుపుపై మును । వలపున బెగ్గడిలు నీకు వనితా సిగ్గే
వలనుండి వచ్చి నేఁడ । వ్వలరాయనితండ్రి మనసు వలపించుటకున్ 195

ఆ.వె.॥ పతిసమీపమునకుఁ బనిచిన దనుకనే
పడఁతులకును సిగ్గుపొడముచుండుఁ
బిదపఁబ్రియునకెంత ముదమొదవింతురో
యెవరసూతు రమ్మ యిందువదన 196

వ॥ అయినను వినుము. 197

గీ॥ ముదిత రమ్మని పిలువకమున్నె మగనిఁ
బొదువఁ దగదమ్మ వగకాఁడు పొలుపుమీఱి
సకియ దరిఁజేర వెన్కకుఁ జనియదేమొ
విడెమొసంగినఁ గొనవమ్మ వేడ్కఁగొమ్మ 198

వ॥ మఱియును. 199

చ॥ చెలువుఁడు నీదుచన్గవను జెక్కుల గంధమలందఁ బ్రేమతోఁ
గులుకుచుఁ గౌఁగిట న్బొదువుకొమ్ము ముకుందుఁడు నీదుమోవి జొ
బ్బిలు మధువాని యయ్యలరువిల్లునికేళినొనర్పు నేర్పునన్
దలఁగక వానితోఁ బెనఁగి తద్దయుఁ గూడుము కొమ్మ నెమ్మదిన్ 200

గీ॥ అనుచుఁ జేడియ లిత్తెఱంగునను సత్య । నల్లనల్లన గేళికాహర్మ్యమునను
హంసతూలికశయ్యపై నలరుశౌరి । సౌధమున కన్చి మరలిరి సంతసమున 201

**: నూతన వధూవరుల తొలిసమాగమము :**

క॥ అంత రమాకాంతుఁడుదన । చెంతన్గొమ్మింంచుతీవె చెలఁగు కయివడిన్
వింతగ విలసిల్లెడు న । య్యింతిఁ గనుంగొనియె వేడ్కలింపుదలిర్పన్ 202

వ॥ మఱియును. 203

క॥ కుందనపుపైఁటచెఱగు ము । కుందుఁడు చేఁబూని తిగిచి కోమలి యిఁకనీ
కుం దగున సిగ్గు రమ్మని । కుందరదన నెదను జేర్చుకొని యిటు పలికెన్ 204

చ॥ కలువలతేఁడనందగు మొగంబిటుత్రిప్పుము చూడు కన్నులన్
లలితమృణాలబాహులతలం బిగియారఁగఁ గౌఁగిలించి నీ
కులుకు కుచద్వయంబులను గోమలి నాయెదఁ జేర్చి మోవి తే
నెలు చవిఁజూడనిమ్ము దయనివ్వటిల న్ననునేలు కోమలీ 205

వ॥ వెండియు. 206

సీ॥ కొమ్మ నీకెమ్మోవి కమ్మతేనియ లానఁగల్గకుండిన సుధాకాంక్ష చనునె
కలికి నీకులుకు చన్గవనంటకుండిన దుర్గాధిపత్యంబు దొరకుటెట్లు
చెలియ నీశ్రోణిపైఁ జెయ్యాడకుండినఁ జక్రవర్తిత్వ మేసరణి నడుచు
నింతి నీయూరుపయిం బరుండకయున్న ఫణిశాయిభావ మేపగిదిఁ జెల్లు

వెలది! గళమున నఖపఙ్క్తి నిలుపకున్నఁ
బాంచజన్యధరత్వంబు పరుగుటెట్లు
కాంత నినుఁ గౌఁగిటను జేర్పఁగలుగకున్న
బాహుచతురాకృతిత్వ మేభంగి నలరు 207

వ॥ మఱియును. 208

గీ॥ కలికిరో కౌతుకమున లేఁగౌను నంద
గులుకు [4]పొక్కిటఁ బిరుదులఁ గోర్కెదీరఁ
గరము కరమూనకున్నను గలదె నాకుఁ
దలఁప భువనత్రయాధిపత్యము మృగాక్షి 209

గీ॥ అనుచుఁ దద్దయు బేళించి హాళినించి
తమికటాక్షించి వలపించు దయితునెదుటఁ
గాంచి [5]కన్నులుచల్లఁగాఁ గౌతుకమునఁ
గౌఁగిటను జేర్చి గులుకుచుఁ గలసెఁ గలికి 210

మ॥ అసకృచ్చుంబనదంతదంశననఖవ్యాపారసంశ్లేషన
ర్మసుధాపూరవచోవిశేషమృదుమర్మస్పర్శసంజాతమో
హసముల్లాససుమాస్త్రకేళులను బ్రహ్మానంద భూయిష్ఠమా
నసులై సొక్కుచునుండి రయ్యిరువురు న్నవ్యానురాగంబులన్ 211

వ॥ వెండియు నివ్విధంబున నవ్వధూవరులు విలసిల్లుచున్న సమయంబున యుగపచ్చుంబితేతరేతరమంజులతాంబూల సుగంధబంధురాధరాభిరామంబై, యనురాగాతిశయ సాంగత్య కుంచిత పరస్పర కంఠవలయోన్మీల దవ్యక్త మధురిమాంచత్కపోలారవంబై, సమకాలప్రవృత్తాన్యోన్యసంవిష్టమనోజ్ఞావయవంబై, సహనటన్మిథుననిధువన సమయచటులమణితరణిత విలసితంబై, సుఖాకరంబైన సురతంబుప్రవర్తించునెడ మదనజనకుండు మెండుమీఱి హృదయంబుగదియించి ధైర్యంబు గలంగించి డంబుమీరు చన్గవఁగౌనగోటమీటుచు మాటిమాటికి నోరూరఁజేయుచు, నారడిబెట్టు కెమ్మోవి మునిపంటనొక్కుచు, మరుని ముకురంబులపగిదిఁ గొసురుమీరు చెక్కులఁ జపేటంబులనుంచుచుఁ, గ్రొమ్మించుతీవెకరణి మెఱయు నప్పువ్వుబోణి మనోహరంబైనశరీరంబుఁ దనబాహాంతరాళంబున బంధించి జయించినంగాంచి యమ్మించుబోణి మదనకదనంబున నప్పరిభవంబుసహింపక రతిరమణ రాద్ధాంతరహస్యవేదిని

గావున రసవశంబునఁ బురుషాయమాణయై శౌరిని దిరస్కరించి పెనంగిన నయ్యిరువురు ననంగక్రీడావిశేషంబులఁ జెలంగుచు సమాకాలస్ఖలనశమితమదన కదనసన్నాహులై స్రుక్కుచు శయ్యపై వ్రాలియు నవనవోన్ముఖంబైన ప్రేమాతిరేకంబున నన్యోన్యవ్యాపృతైకైకబాహాలింగిత పులకితగాత్రులై తత్కాలోచిత మధురాలాపజల్పనాశీలురై యున్న సమయంబున.

క॥ తూరుపుతెమ్మెరమొలకలు
తోరంబుగ వీచి మించెఁ దోరపుకాంతుల్
వారక తిమిరమణఁగెఁ గూ
కూరుతములు కుక్కుటములు కూయఁగఁదొణఁగెన్ 213

వ॥ అట్టియెడ. 214

క॥ మంగళతూర్యరవంబు చె । లంగ విహంగములు పంజరమ్ముల ఘనసా
రంగవరద మేల్కొమ్ము కు । రంగనయనతోడననుచు రహిఁబలుకంగన్ 215

వ॥ అప్పుడు. 216

**: తియ్యని పోరాటములో ఓడి గెలిచిన వధూవరులు :**

సీ॥ అతివచన్బంతుల నలరారు కస్తూరియురముపై శ్రీవత్ససరణి మెఱయ
సురతజాగరముచే సొక్కిన కన్దోయి వారిజాకృతి నొందివన్నెకెక్కఁ
గల్కిపన్నొనలచేఁ గందిన కెమ్మోవి బింబఫలస్ఫూర్తి డంబుమీఱఁ
గాంతకస్తురితిలకంబంటి యాననం బేణాంకతులితమై యింపుమీఱ
నెలఁత మణిహారముల నొక్కులెలమి మేన
లలిత వనమాలికా చిహ్నములన వెలయఁ
గాంతపై మోహసంభృత స్వాంతుఁ డగుచుఁ
గేళిసదనంబు వెడలె గోపాలమౌళి 217

వ॥ వెండియు. 218

గీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠానదానములను । సముచితంబుగ సల్పుచు శౌరి విజయు
తోడ నిష్ఠానులాపము లాడికొనుచు । నివ్వటిల్లుచునుండెను నేర్పుమీఱ 219

వ॥ అంతట. 220

ఉ॥ వాడిన పూలదండలను వాతెరనంటిన పంటిగంటులన్
వీడిచెలంగుపెన్నెరుల వేకువనిద్దురఁదేరుకన్నులన్

బ్రోడజెలంగి మన్మథునిపోరున దస్సినరీతిఁ దెల్పుచున్
జేడియ యంసభాగములఁ జేతులువైచుచు వచ్చె సొక్కుచున్ 221

కII కాంతలు సంతసమున శ్రీ । కాంతునితో రతులఁదేలి క్లాంతానన న
క్కాంతను గద్దియనిడి యే । కాంతంబునఁ జెలులు చుట్టుగ్రమ్ముచు వేడ్కన్ 222

ఆ.వె.II ముకురమెదుటనిల్పి ముదితలు కొందఱు । చికురములను దువ్వి చిక్కువడిన
హారములు సదల్చి హౌసుమీఱఁగఁ బైటఁ । జక్కఁగాను సరిది మక్కువలర 223

వII వెండియు. 224

ఉII కన్నులు చల్లఁగాఁ గనిమొగంబున మోమలరంగఁ జేర్చి యా
వెన్నునిఁ గౌఁగిలించి మదివేడుకదీరఁగ ముచ్చటాడి సం
పన్నతనొంది కోసలనృపాలతనూజ మనోజవేదనా
పన్నతదీర మోవిసుధపానమొనర్చి సుఖంబు నొందితే 225

గీII కమ్మవిలుకాని నెఱపువ్వుటమ్ములకును । సొమ్మసిలి మునుజెందిన నుమ్మలికము
దీర వేడ్క ముకుందునిజేరి మదన । కేళులను సొక్కఁగలిగెనే కీరవాణి 226

గీII కులుకు పన్నీట మెలఁదిన కలపమునను । మేదురంబైన వనమాలి మేనుఁగౌఁగ
లింపఁగల్గెనె వానితో సొంపుమీఱ । మరునికేళుల మెలఁగితే మంజువాణి 227

కII అని నెచ్చెలియలు వలుకు వ
చనములు వీనులకువిందుసల్పఁగఁ జెలి సి
గ్గును జిఱునవ్వును దనమో
మునఁ బెనఁగొన సఖులతోడ మురియుచునుండెన్ 228

వII వెండియు. 229

కII హాటకచేలునితో స । య్యాటలఁ బాటలను రతుల నలరుచు నెపుడున్
బాటలగంధి ముదంబునఁ । బాటిలుచుండె నలకలిమిభామిని పగిదిన్ 230

## : హేమంతఋతువర్ణన :

కII అంతటహేమంతము మద । దంతావళకుంభసమ్మితస్తనదయితా
ధ్యంతరహితకాముకకా । లాంతకసమమై చెలంగె నాసమయమునన్ 231

సీII కందర్పమాతంగకరపుష్కరోదీర్ణశీకరోపమహిమానీకమగుచుఁ
గాంతాకుచాభోగగహ్వరధరదుర్గభాగలీననిధానభావమగుచుఁ

గాదంబనికురంబమోదాపనోదకసారసోల్లసితకాసారమగుచుఁ
గల్హారకచకోరకాళికానతిభయంకరదివాకరదివ్యకిరణమగుచు
గళితయౌవనవేశ్యాంగతులితశీత
లలితసౌభాగ్యసత్త్రపాకలితమగుచుఁ
గాంతనవతాలవృంతవిశ్రాంతమగుచు
నపుడు విలసిల్లెఁ దత్సమయాగమంబు 232

వ॥ మఱియును. 233

క॥ కాంతలు తతవిరహాగ్ని। క్లాంతలగుచు మోహజలధి ఘనతరవేలా
ప్రాంతము తద్రజనీవే। లాంతము గనలేక యుండి రాసమయమునన్ 234

చ॥ దివములు సన్నగించెఁ గడు దీర్ఘములై కనిపించె రాత్రులున్
దవము నటించె దీనతను దద్దయు మించె హిమాంబుధారలీ
యవనియుఁ బాడిపంటలసమంచితమై రహిమించె శీతమున్
భువనము నాక్రమించె యదుపుంగపురీతి వహించి యత్తఱిన్ 235

వ॥ వెండియు. 236

క॥ వడవడవణఁకుచు సూర్యుఁడు
తడవొనరింప కపరాద్రిదరిఁ జేరియుఁ దా
వెడలఁడు చలికులికి యనన్
బుడమిన్శీతార్తి యొరులఁ బొదువుట యరుదే 237

వ॥ ఆసమయంబున. 238

గీ॥ సరసకమలాకరవిహారచందనాను
లేపవాతాయనాప్తిచంద్రోపలస్థ
లీనివేశనచంద్రశాలానివాస
ముల నిరాదరుఁడై యుండి మురహరుండు 239

చ॥ సరసకదుష్ణనీరముల స్నానమొనర్చి కటూష్ణభోజ్యముల్
కరము భుజించి తానగరుగంధముఁ బూసి లవంగజాతిభా
సురమగు వీడ్యమంది చలిసోకనిసౌధమున న్వసించి సా
దరముగ హంసతూలయుతతల్పముపైఁ బవళించి యంతటన్ 240

కII చలిచలియనుచు రమాధవుఁ । డల చెలిచనుగవను డాగి యానందమునన్
జెలరేఁగుచు వలరాయని । కళలన్విలసిల్లి ప్రొద్దుగడుపుచు నుండెన్ 241

వII ఈతీరు నాగ్నజితితో దనరారుచు ననంతరంబ. 242

**: శ్రీకృష్ణుఁడు భద్ర, లక్షణలను పెండ్లియాడుట :**

కII శ్రుతకీర్తితనూజ న్వి । శ్రుతకీర్తి న్భద్రకన్య సుచరిత ధన్యన్
గ్రతుభుగ్వరులెన్నఁగఁ దా । నతివేడ్కను బెండ్లియాడె నచ్యుతుఁడంతన్ 243

వII మఱియును. 244

కII పక్షీంద్రుఁడు మున్నమరుల । శిక్షించి యమృతముఁదెచ్చి చెలఁగిన పగిదిన్
గుక్షితిపులఁ గదిమి హరి వి । లక్షణముగఁ బెండ్లియాడె లక్షణ నపుడున్ 245

వII వెండియు. 246

గీII భైష్మియును జాంబవతి సత్యభామ మిత్ర । వింద కాళింది కోసలవిభుతనూజ
భద్ర లక్షణలాదిగా భామలొలయఁ । బరిఢవిల్లుచునుండె గోపాలమౌళి 247

వII ఇవ్విధంబున లీలాగృహీతశరీరుండైన మదనగోపాలవల్లభుండు విలాసినీ సహస్రంబులతోఁ గందర్పకేళుల విలసిల్లుచు మన్మథానిరుద్ధాది పుత్రపౌత్రకోటితో నానందించుచు దుష్టనిగ్రహపూర్వకంబుగా శిష్టపరిపాలనంబొనరించుచు ద్వారకా నగరంబున సుఖంబుననుండెనని సూతుండు శౌనకాదులకుం దెలిపిన నమ్మునీంద్రు లమందానందమకరందసందోహ హృదయారవిందులై యతని నభినందించిరి. 248

**: ఫలశ్రుతి :**

గీII వల్లవీపల్లవోల్లాసముల్లసమున
వినినఁ జదివిన వ్రాసిన జనులకెపుడు
మదనగోపాలమౌళి సమ్మదముతో డ
సకలసంపద లొసఁగును సంతతంబు 249

**: కావ్యాంతము :**

ఉII శ్రీకమనీయరూపతుల సీదళగుంభితదివ్యమాలికా
స్వీకరణానురూపకవిశేఖరదత్తరసోల్లసత్పదా

ర్థాకృతికోపహారనికరాకలనోపచితస్వరూపభ
ద్రాకరశోభనాద్రిశిఖరాంచితదీపఘనద్వనీపకా 250

స్రగ్విణి॥ ఇందిరాదృక్చకోరేందుబింబన్ముఖా । వందినీతామితావార్యసంపత్సుఖా
నిందితప్రాదినీనీతిభాస్వన్నఖా । నందితాగేంద్రకన్యావచస్త్రీసఖా 251

గద్య॥ శ్రీమాడభూషికులపయోవారాశిసుధాకర వేదాంతాచార్యతనూభవ వైనతేయ కటాక్షలబ్ధ విద్వత్కవిరాజమనోరంజక సంగీతసాహిత్యకవిత్వచతుర నరసింహాచార్య ప్రణీతంబైన వల్లవీపల్లవోల్లాసంబను సత్యాపరిణయాఖ్యాన ప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

---

*1.* మహిన్ – పూ. ము. పా.

*2.* నవ్వెలఁదులు వల్లేయని వెలయఁగ – పూ. ము. పా

*3.* గదిమి – పూ. ము. పా.

*4.* పుక్కిట – పూ. ము. పా.

*5.* చన్నులు – పూ. ము. పా.